శ్రీరామచంద్రపరబ్రహ్మణే నమః
శ్రీమతే రామానుజాయ నమః
శ్రీమద్వరవరమునయే నమః



# వాల్మీకి వాగమృతమ్

(జగదాచార్య సింహాసనాధిపతి, పద్మవిభూషణ,

ఉ.వే.శ్రీమాన్ కాఞ్చీ ప్రతివాది భయంకరం అణ్ణఙ్గరాచార్య స్వామివారి

తమిళ గ్రంథానికి ఆంధ్రానువాదం)



**అనువక్త:**

'పండిరత్న'

**ఉ.వే. శ్రీమాన్ డా॥ ఈయుణ్ణి అ*ழ*గ శింగరాచార్యులు**

**సమర్పణము:**

ఉ.వే.శ్రీమాన్ వానమామలై యెస్ వేంకటేశన్, శ్రీమతి వాణి దంపతులు

చి.సౌ॥ వి.విష్ణుప్రియ, చి॥ యెస్.సుదర్శనం ల పరిణయమహోత్సవ చిహ్నము

15, నవంబరు 2021

# వాల్మీకి వాగమృతమ్ - ఆంధ్రానువాదం

అనువక్త - పండిరత్న, డా॥ శ్రీమాన్ ఈయుణ్ణి అ॥ గ శింగరాచార్యులు

ఈ గ్రంథం ఉ.వే.శ్రీమాన్ వానమామలై యెస్ వేంకటేశన్, శ్రీమతి వాణి దంపతులచే చి.సౌ॥ వి.విష్ణుప్రియ, చి॥ యెస్.సుదర్శనం ల పరిణయమహోత్సవ సందర్భంగా భగవద్భాగవతాచార్య కైంకర్యరూపంగా సమర్పింపబడింది

డి.టి.పి. : శ్రీమతి జయలక్ష్మి, తిరుపతి



శ్రీశ్రీశ్రీ పరమహంస పరివ్రాజకాచార్య కలియన్ వానమామలై జీయర్ స్వామివారి మంగళాశాశనములతో

ஸ்ரீ:
ஸ்ரீ ராமஜெயம்

ஸ்ரீவரமங்கா கோதா ஸமேத ஸ்ரீ தெய்வநாயக பரப்ரஹ்மணே நம: ஸ்ரீ குறுங்கநாயிகா ஸமேத ஸ்ரீ சுந்தரபரிபூர்ண பரப்ரஹ்மணே நம:
ஸ்ரீ ரெங்கநாயகி ஸமேத ஸ்ரீ ரெங்கநாத ஸ்வாமி பரப்ரஹ்மணே நம: ஸ்ரீ அலர்மேல் மங்கா ஸமேத ஸ்ரீ ஸ்ரீநிவாஸ பரப்ரஹ்மணே நம:
ஸ்ரீ பெருந்தேவி நாயிகா ஸமேத ஸ்ரீ தேவாதிராஜ பரப்ரஹ்மணே நம:
ஸ்ரீமதே ராமானுஜாய நம: ஸ்ரீமத் வரவரமுநயே நம: ஸ்ரீவானாசல மஹாமுநயே நம:

# விவாஹ சுபமுகூர்த்த ஆஹ்வான பத்திரிகை

ஸ்ரீ.உ.வே.........................................................................ஸ்வாமி ஸந்நிதியில்

அடியேன் தெண்டம் ஸமர்பித்த விக்ஞாபனம் அநேக நமஸ்காரம் / ஆசீர்வாதம் / உபயகுசலோபரி

நிகழும் ஸ்வஸ்தி ஸ்ரீ மங்களகரமான 1197-ம் ஆண்டு பிலவ வருஷம் ஐப்பசி மாதம் 29-ம் தேதி **(15-11-2021) திங்கள்கிழமை,** த்வாதசி திதியும், உத்திரட்டாதி நக்ஷத்திரமும் சித்த யோகமும் கூடின சுபயோக சுபதினத்தில் சூரிய உதயாதி நாழிகை 7.30க்குமேல் 9.00க்குள் (காலை 9.21 மணிக்குமேல் 9.57 மணிக்குள்) தனுர் லக்னத்தில்

வானமாமலை ஸ்ரீ N.G.N.ஸ்ரீநிவாச ஐயங்காரின் பௌத்ரியும்,
ஹைதராபாத், Dr. ஸ்ரீ பாஷ்யம் ஸ்ரீநிவாஸ ராமாச்சாரியின்
தௌஹித்ரியும், எனது ஜேஷ்ட குமாரன்
வானமாமலை S.வெங்கடேசனின் குமாரத்தியுமான
சௌபாக்யவதி. **விஷ்ணுப்ரியா** என்கிற வதுவை

ஸ்ரீ.உ.வே. வில்வராயநல்லூர்
ராமானுஜாச்சாரியாரின் பௌத்ரனும்,
திருஇந்தளூர் ஸ்ரீ ராம ஐயங்காரின் தௌஹித்ரனும்,
ஸ்ரீ சந்தானம் அவர்களின் ஜேஷ்ட குமாரனுமாகிய
சிரஞ்சீவி. **சுதர்ஸனம்** என்கிற வரனுக்கு

கன்னிகாதானம் செய்து கொடுப்பதாய் ஸ்ரீமத் பரமஹம்ஸேத்யாதி கலியன் வானமாமலை ராமானுஜ ஜீயர், ஸ்ரீமத் பரமஹம்ஸேத்யாதி மதுரகவி வானமாமலை ராமானுஜ ஜீயர் ஸ்வாமிகளின் திவ்ய அனுக்ரஹத்தாலும் ஸ்ரீ.உ.வே. கோவில் கந்தாடை வாதூல தேசிய அண்ணாவியப்பன் குமார வேங்கடாச்சாரியார் ஸ்வாமி (வர்த்தமான முதலியாண்டான் ஸ்வாமி க்ருபாகடாக்ஷத்தாலும்) பெரியோர்களால் நிச்சயிக்கப்பட்டு மேற்படி சுபமுகூர்த்தம் **AVASA, MADHAPUR, HYDERABAD-ல்** வைத்து நடக்கிறபடியால் தேவரீர் / தாங்கள் குடும்ப ஸமேதராய் எழுந்தருளியிருந்து / வந்திருந்து மேற்படி சுபமுகூர்த்தத்தை நடத்தி வைத்து தம்பதிகளை ஆசீர்வதிக்க வேணுமாய் ப்ரார்த்திக்கிறோம் / கேட்டுக்கொள்கிறோம்.

அவ்வண்ணமே அடியோன்களும் ப்ரார்த்திக்கிறோம்
**வானமாமலை G.தோதாத்ரி**
**ராமானுஜ தாஸன்**
**வானமாமலை G.ரெங்கராஜ**
**ராமானுஜ தாஸன்**
**வானமாமலை G.தெய்வநாயக**
**ராமானுஜ தாஸன் (ஸ்ரீகாந்த்)**

**வாசகதோஷ: க்ஷந்தவ்ய:**
**கலியன் க்ருபா**

தாஸன்
**வானமாமலை நம்பிஸ்ரீநிவாஸ**
**ராமானுஜ தாஸன்**

ஸ்ரீ ஸ்ரீ ஸ்ரீ

Srimathe Ramanujaya Nama:
Srimath Varavaramunayae Nama:
Sri Vanachala Mahamunayae Nama:

# Wedding Invitation

Smt. Vanamamalai S.Vani Venkatesan
and
Shri. Vanamamalai S.Venkatesan

request the honour of your esteemed presence and blessings
with family and friends on the auspicious occasion of the wedding ceremony
of our daughter

Sowbhagyavathi V.Vishnupriya
(Grand Daughter of Shri. Vanamamalai Nambi Srinivasan and Dr. Sribashyam S.Ramacharya)
with

Chiranjeevi S.Sudarsanam
(S/o. Smt. & Shri. R.Santhanam, Chennai)

on Monday, the 15th November 2021
at AVASA
Madhapur, Hyderabad - 500 081.

Muhurtham : 15.11.2021 - Monday
9.21 a.m to 9.57 a.m. Dhanur Lagnam

## విషయసూచిక

# సవినయ సమర్పణమ్

**అర్థాన్ రామాయణాబ్ధౌ మణిగణసదృశాన్ వీక్షితుం వాపి వక్తుం**
**సామగ్ర్యేణాత్ర శక్తో న హి విబుధగురుర్వాదిశేష స్తథాపి,**
**శ్రీమద్రామానుజాదిప్రముఖగురువరాః దివ్యపీయూషకల్పైః**
**వ్యాఖ్యానైరన్వగృహ్ణన్ సురుచిరమహనీయార్థరత్నాన్యుదారాః.**

(శ్రీ రామాయణం ఒక సముద్రం. అందులో ఉండే మణులవంటి అర్థాలను అన్నిటిని దర్శించడానికి గాని, చెప్పడానికి గాని ఎవరికి సాధ్యం? దేవగురువు బృహస్పతికి కానీ ఆదిశేషునకు కానీ సాధ్యం కాదు. కానీ భగవద్రామానుజులు మొదలైన మన పూర్వాచార్యులు అమృతంవంటి తన వ్యాఖ్యల ద్వారా అందమైన గొప్ప అర్థ రత్నాలను అన్వేషించి మనకు ఇచ్చారు)

**"ఇతిహాసపురాణాభ్యాం వేదం సముపబృంహయేత్, బిభేత్యల్పశ్రుతాద్వేదో మామయం ప్రతరేదితి"** (వేదంలోని అర్థాన్ని, ఇతిహాసపురాణాలను ఆధారంగా చేసికొని వివరించాలి. ఆ విధంగా ఇతిహాసపురాణాల అవగాహన లేకుండా వేదాన్ని వివరించేవానిని చూచి ఆ వేదం - అయ్యో! ఇతడు నన్ను సరిగా అర్థం చేసుకోలేదే! నా హృదయాన్ని సరిగా వ్యక్తం చేయలేక నన్ను మోసగిస్తున్నాడే! - అని భయపడుతుంది) అని ఈ ప్రసిద్ధమైన సూక్తి వేదార్థాన్ని వివరించడంలో ఇతిహాసపురాణాల ప్రాధాన్యం ఎంతటిదో తెలియజేస్తున్నది. ఆవిధంగా వేదార్థవిశదీకరణలో ఉపకరించే ఇతిహాసాలు రెండు. వాటిలో, వాల్మీకిమహర్షి ప్రణీతమైన శ్రీరామాయణం మొదటిది. వ్యాసభగవానునిచే రచింపబడిన మహాభారతం రెండవది. **"వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే, వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాత్ రామాయణాత్మనా"** (వేదవేద్యుడైన పరమ పురుషుడు శ్రీరాముడై అవతరించగా, ఆ వేదం సాక్షాత్తు శ్రీరామాయణరూపంలో

అవతరించింది) అనే ప్రసిద్ధమైన శ్లోకం శ్రీరామాయణం వేదోపబృంహణాన్ని చేస్తున్నదని తెలుపుతున్నది. శ్రీరామాయణంలోని **"వేదోపబృంహణార్థాయ తావగ్రాహయత ప్రభుః"** (వేదోపబృంహణమైన శ్రీరామాయణం కోసం ఆ వాల్మీకి కుశలవులను స్వీకరించాడు) అనే సూక్తి కూడా శ్రీరామాయణం వేదార్థాన్ని విశదీకరిస్తున్నది - అని తెలుపుతున్నది.

వేదంలోని **"యః సర్వజ్ఞః సర్వవిత్"**, **"పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** అని మొదలైన పలు సూక్తులు భగవంతుని కళ్యాణగుణాలను కీర్తిస్తున్నవి. శ్రీరామాయణం కూడా ఆరంభం నుండే **"కోన్వస్మిన్ సాంప్రతం లోకే గుణవాన్?"** ఇత్యాదిగా ప్రశ్నించడం ద్వారా శ్రీరామచంద్రభగవానుని కళ్యాణగుణాల ప్రస్తావనను చేసింది. ఆ విధంగా వాల్మీకి అడిగిన ప్రశ్నలో పదహారు గుణాలు చోటు చేసుకున్నాయి. ఈ ప్రశ్నకు సమాధానరూపంగా నారదమహర్షి వాల్మీకి మహర్షికి శ్రీరామాయణ గాథను తెలియజేసినందున, ఆ ఇతిహాసం పూర్తిగా వాల్మీకి ప్రశ్నించిన గుణాలు వివరణరూపమే అయి ఉండడంలో ఆశ్చర్యం లేదు కదా! అందుచేత, శ్రీరామాయణం మొత్తం పదహారు గుణాల వివరణమే అని అభిజ్ఞులైన పెద్దల అభిప్రాయం. శ్రీరామాయణంలోని పలు సంఘటనలను, ఆ యా సందర్భాలలో ఆ యా వ్యక్తులు పలికిన మాటలను పరిశీలించి చూస్తే, ఆ ఇతిహాసం మొత్తం శ్రీరామచంద్రుని కళ్యాణగుణాల వర్ణనరూపమే అని తెలిసికోవచ్చు.

**"నాథోపజ్ఞం ప్రవృత్తమ్"** అని చెప్పబడిన రీతిలో శ్రీవైష్ణవసంప్రదాయం అంతా శ్రీమన్నాథమునుల కాలంనుండి ప్రవర్తించింది. అందువల్ల విశిష్టాద్వైతసిద్ధాంతానుగుణంగా శ్రీరామాయణంలో మన పూర్వాచార్యులు వివరించిన రస్యరహస్యార్థాలకు బీజం ఆ కాలంలోనే ఏర్పడింది అని భావించడంలో అడ్డు లేదుకదా. ఆ విధంగా ప్రవర్తించిన

సంప్రదాయార్థాలు పరంపరగా శ్రీయామునులవరకు చేరగా, తరువాత అవి యామునుల శిష్యులైన పెరియ తిరుమలనంబికి, వారినుండి భగవద్రామానుజులకు, వారి ద్వారా పరంపరగా తదనంతరాచార్యులకు అందాయి. శ్రీరామానుజులు ఒక సంవత్సరకాలం పాటు పెరియ తిరుమలనంబి సన్నిధిలో శ్రీరామాయణంలోని సంప్రదాయార్థాలను తెలిసికొన్నారు అనే విషయం ప్రసిద్ధమైనది. ఈ అర్థాలనే నంబిళ్లై, పెరియ వాచ్చాన్ పిళ్లై మొదలైన మన పూర్వాచార్యులు తమ దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో వ్యక్తం చేశారు. పెరియవాచ్చాన్ పిళ్లై శ్రీరామాయణంలోని కొన్ని ముఖ్యమైన శ్లోకాలలోని సంప్రదాయార్థాలను శ్రీరామాయణ తనిశ్లోకి అనే పేరు కల గ్రంథాన్ని రచించడంద్వారా అనుగ్రహించారు. దేశికులు కూడా 'అభయ ప్రదానసారం' అనే గ్రంథంలో కొన్ని శ్రీరామాయణశ్లోకాలకు అద్భుతమైన వివరణలను కృపజేశారు. శ్రీరామాయణవ్యాఖ్యాత గోవిందరాజులు తమ వ్యాఖ్యలో పలు చోట్ల సాంప్రదాయికాలైన, మధురమైన అర్థవిశేషాలను పొందుపరచారు.

గడచిన శతాబ్దిలో భగవద్రామానుజ సిద్ధాంతాన్ని, శ్రీవైష్ణవ సంప్రదాయాన్ని ఆసేతుహిమాచలం విలక్షణమైన రీతిలో తమ ప్రవచనాలతో, గ్రంథాలతో తమకే సాధ్యమైన ప్రక్రియలో ప్రచారం చేసిన మహనీయులు **ఉ.వే.శ్రీమాన్, మహావిద్వాన్, కాంచీ వాస్తవ్యులు అణ్ణంగరాచార్యస్వామివారు.** వీరు శ్రీరామాయణంలోని పలు విశేషార్థాలను వివరిస్తూ **అపూర్వ రామాయణం, సహస్రనామ రామాయణం** మొదలైన పలు గ్రంథాలను ద్రావిడభాషలో రచించడమే కాక, సంస్కృతంలో **వాల్మీకివాగమృతం** అనే అపూర్వమైన గ్రంథరాజాన్ని వెలయించారు. అందులో వారు, శ్రీరామచంద్రునిలో ప్రకాశించే వీర్యసౌశీల్య సత్యవాదిత్వ యుక్తవాదిత్వ దృఢవ్రతత్వ సామర్థ్య సౌందర్యధార్మికత్వాలనే ఎనిమిది కళ్యాణగుణాలను రామాయణంలోని శ్లోకాలను, వాటికి పూర్వాచార్యులు కృప జేసిన వ్యాఖ్యానాలను, దివ్యసూరుల సూక్తులను అందంగా

వేళవించి, చాలా మధురంగా రచించారు. ఈ గ్రంథం సంప్రదాయజ్ఞులనే కాక, సంస్కృతభాషావిదులైన సహృదయులను అందరిని మెప్పిస్తుంది అని అనడంలో ఏ సందేహం లేదు.

ఈ సద్గ్రంథానికి ఆంధ్రానువాదం ఇప్పుడు భాగవతగోష్ఠికి, గుణజ్ఞులైన ఆస్తికులకు సవినయంగా సమర్పింపబడుతున్నది. ఈ అనువాదం ఇదివరకే 'శరణ్య' మాసపత్రికలో ధారావాహికంగా వెలువడింది. ఇప్పుడు గ్రంథరూపంగా ప్రకాశింపజేయబడుతున్నది. ఈ గ్రంథప్రచురణ సహృదయాస్తికుల ఆమోదాన్ని పొందగలదని భావిస్తాను. దీనిని, తమ కుమార్తె చిరంజీవిని **విష్ణుప్రియ** కళ్యాణ మహోత్సవసందర్భంగా వెలువరించడానికి సిద్ధపడిన భగవద్భాగవతాచార్యకైంకర్యనిష్ఠులు **ఉ.వే.శ్రీమాన్ వానమామలై యెస్ వేంకటేశన్, శ్రీమతి వాణి దంపతులను** అభినందిస్తున్నాను. తమ పితామహులు రచించిన ఈ గ్రంధాన్ని ఆంధ్రీకరించి ప్రచురించడానికి ఉదారంగా తమ అంగీకారాన్ని తెలియజేసిన సహృదయులు, ఉ.వే.శ్రీమాన్ **పి.బి.రాజహంసం స్వామివారికి, వారి సోదరులకు** సవినయంగా కృతజ్ఞతలను సమర్పించుకుంటున్నాను. ఈ గ్రంథాన్ని సిద్ధం చేయడంలో నాకు చాలా సహకరించిన కుమారుడు చిరంజీవి శ్రీమాన్ అనంతరంగరామన్‌కు అనేక మంగళాశాసనాలు. అనువాదంలోని లోపాలను సహృదయ పాఠకులు మన్నిస్తారని నమ్ముతున్నాను. స్వస్తి .

**అణ్ణంగరార్యవర్యైః రామాయణవారిధేః సమున్నీతా,**
**వాల్మీకివాక్సుధేయం జనయతు మోదం విశేషవిచ్ఛిత్తేః.**

భాగవత దాసుడు

**ఈయుణ్ణి** *అ॥*గ **శింగరాచార్యులు**







వ్యాచష్టే రూపమేవాస్య మహిమానమితి శ్రుతిః,
శ్రీమత్యణ్ణంగరార్యేస్మిన్ సమ్యగేతి సమన్వయమ్.

వాల్మీకి వాగమృతాన్ని వెలయించిన ప్రాతఃస్మరణీయులు
ఉ.వే.శ్రీమాన్ కాఞ్చీ ప్రతివాదిభయంకరం అణ్ణరాచార్యస్వామివారు (1891-1983)

**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**



# వాల్మీకి వాగమృతమ్

## ఉపోద్ఘాతం

**శ్రీరామాయణనామ్నః సుధానిధేః మధురమర్థ సారౌఘమ్।**
**అణ్ణంగరార్యనామా ప్రవాహయామి ప్రహర్షయన్ ప్రాజ్ఞాన్॥**

(అణ్ణంగరాచార్యులనే పేరు గల నేను శ్రీరామాయణమనే పేరును కల సుధానిధి (చంద్రుని) నుండి మధురాలైన అర్థాలనే అమృత ప్రవాహాన్ని విజ్ఞులను సంతోషింపజేస్తూ ప్రవహింపజేస్తున్నాను)

లోకంలో పలు పేర్లను కల ఇతిహాస పురాణ ప్రబంధాలు ప్రకాశిస్తూ ఉన్నా, భగవద్వాల్మీకి రచించిన రామాయణానికే సర్వాతిశాయిత్వం - అన్నిటి కంటే విలక్షణంగా, గొప్పగా ఉండే స్వభావం - ఉన్నది - అనే మాట సారజ్ఞుల దోషం లేని, మనోహరమైన సిద్ధాంతం.

**వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।**
**వేదః ప్రాచేతసాదాసీత్ సాక్షాద్రామాయణాత్మనా**
(స్కాందపురాణమ్)

వేదాల చేత తెలియబడే పరమాత్మ దశరథుని కుమారుడై పుట్టగా, వేదం వాల్మీకి మహర్షి ద్వారా సాక్షాత్ శ్రీరామాయణంగా అవతరించింది

అనే ఈ ముక్తక శ్లోకరత్నం అంతటా అన్ని మతాలకు చెందినవారిచే ఏకకంఠంగా అనుసంధింపబడుతున్నది. దీని ద్వారా శ్రీరామాయణరూపంలో వేదం ఆవిర్భవించిందనే విశేషం చక్కగా ప్రకాశిస్తున్నది. ఈ గ్రంథంలో ముందు చేయబడబోయే నిరూపణల ద్వారా శ్రీరామాయణంలోని అనేకార్థవిశేషాలు వేదార్థాలతో సౌభ్రాత్రాన్ని కల్గినవిగా శోభిస్తున్నాయని క్రమంగా రసికులు గ్రహించగలరు.

ఈ ఇతిహాసరత్నాన్ని గూర్చి లోకంలో మూడు విధాలైన వ్యవహారాలు (పేర్లు) ప్రసిద్ధంగా ఉన్నాయి. అవి - **రామాయణమ్, శ్రీరామాయణమ్, శ్రీమద్రామాయణమ్** - అనేవి. శ్రీ శబ్ద ప్రయోగం లేకుండా కేవలం రామాయణమనే వ్యవహారాన్ని గూర్చి ఇక్కడ ఏమీ ప్రస్తావించ గోరడం లేదు. **శ్రీరామాయణమ్, శ్రీమద్రామాయణమ్** - అనే రెండు వ్యవహారాలలో ఏ వ్యవహారం విశేషంగా ప్రకాశిస్తున్నది - అని పరిశీలించడానికి ప్రయత్నిద్దాం.

**"రామస్య అయనం రామాయణమ్"** (రాముని చరిత్ర రామాయణం) అనే వ్యుత్పత్తి లోకంలో అందరికీ తెలిసినదే. రామకథ - అని దీని భావం. రామకథను ప్రతిపాదించే ప్రబంధానికి శ్రీరామాయణమ్ - అనే పేరు సిద్ధిస్తుంది. పూజ్యతాలాంచనార్థం శ్రీశబ్దం గాని, శ్రీమచ్ఛబ్దంగాని ప్రయోగించి ఉండవచ్చు. శ్రీవత్సాంకమిశ్రులనబడే కూరేశులు శ్రీస్తవంలో - **"ఐశ్వర్యం యదశేషఽంసి యదిదం సౌందర్యలావణ్యయోః, రూపం యచ్చ హి మఙ్గలం కిమపి యల్లోకే సదిత్యుచ్యతే। తత్సర్వం త్వదధీనమేవ యదత శ్రీరిత్యభేదేన వా, యద్వా శ్రీమదితీ దృశేన వచసా దేవి! ప్రథా మశ్నుతే"**(ఓ శ్రీదేవి! లోకంలోని అందరు వ్యక్తులలోని ఐశ్వర్యం కాని, సౌందర్య లావణ్యాల రూపంకాని, మంగళ వాచ్యమైనది కాని, సత్ (మంచిది) అని అనబడేది కాని ఏదిఉన్నదో, అది అంతా నీ అధీనంలో

ఉన్నది. అందువల్లనే అది శ్రీ అనే పదాన్ని కలిపి అభేదంగా గాని, లేక, శ్రీమత్ అనే పదాన్ని చేర్చి భేదంతో కాని వ్యవహరింపబడుతున్నది) (శ్రీస్తవం -6) అని అన్నారు కద! శ్రీభాగవతమ్, శ్రీమద్భాగవతం, శ్రీభాష్యం, శ్రీమద్భాష్యం - అనే వ్యవహారాల వలె ఇక్కడ కూడ శ్రీరామాయణమ్, శ్రీమద్రామాయణమ్ - అనే రెండు విధాలైన వ్యవహారాలు తగినవే అని పలువురు భావిస్తారు. ఇక్కడ దీనిని గమనించాలి. (అది ఏమంటే) ఇతిహాస రత్నమైన ఈ శ్రీరామాయణంలో శ్రీరాముని కథవలె, సీతాదేవి కథకు కూడ ప్రాధాన్యమున్నదని మన పూర్వాచార్యుల అభిసంధి. శ్రీపరాశర భట్టార్యులు శ్రీగుణరత్న కోశమనే లక్ష్మీ విషయక స్తుతిలో - **"శ్రీమద్రామాయణమపి పరం ప్రాణితి త్వచ్చరిత్రే"** (శ్రీమద్రామాయణం అనే పేరు కూడ నీ చరిత్రలో గొప్పగా జీవిస్తున్నది) అని అన్నారు. శ్రీవచనభూషణమనే దివ్య శాస్త్రంలో కూడ ప్రారంభంలో 'ఇతిహాస శ్రేష్ఠమైన శ్రీరామాయణం చేత లంకలో బంధింపబడిన వైదేహి యొక్క వైభవం చెప్పబడుతున్నది' అని అన్నారు. వేయి మాట లేల? **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"** (శ్రీరామా-బాల-4-7) (రామాయణ కావ్యం అంతా సీతాదేవి గొప్ప చరిత్ర) అని ప్రాచేతసుడైన మహర్షి వాల్మీకి స్వయంగా అన్నాడు కద! అందువల్ల శ్రీరామాయణమనే వ్యవహారంలో ఔచిత్యం మిక్కిలిగా ప్రకాశిస్తున్నది (ఘటిస్తున్నది - కుదురుతున్నది) - అనే విషయాన్ని గమనించాలి. ఏ విధంగా అంటే - **"శ్రీశ్చ - రామశ్చ శ్రీరామౌ, తయోః అయనమ్ శ్రీరామాయణమ్"** - అనే వ్యుత్పత్తిని శ్రీరామాయణమనే సమస్త పదానికి చెప్పాలి. శ్రీమద్రామాయణమనే వ్యవహారంలో రామ శబ్దానికి విశేషణంగా శ్రీశబ్దం అన్వయిస్తుందనేది - అర్థవివక్ష కనుక, విశేషణమైనది - అప్రధానమై ఉంటుందనే క్రమంలో, శ్రీశబ్దానికి- అప్రాధాన్యం అనివార్య మవుతుంది. ఉభయ పదార్థ ప్రధానంగా ప్రసిద్ధమైన ద్వంద్వ సమాసాన్ని ఈ రెండు పదాలకు చెప్పినపుడే ఈ రెండింటికి సమాన ప్రాధాన్యం సిద్ధిస్తుంది.

కనుక, అటువంటి సమాసం చెప్పడానికి వీలయిన శ్రీరామాయణమనే వ్యవహారం అందమైనది అని పలువురు అంగీకరిస్తారు.

రామచరిత్రను బహుళంగా (ఎక్కువగా) కల గ్రంథంలో సీతా చరితానికి ప్రాధాన్యం ఉందని అనడంలో అభిప్రాయం ఏమి? అని పలువురు ప్రశ్నిస్తారు. ఈ విషయంలో మేము పలికేది ఏమంటే, వినండి. లక్ష్మీసాహిత్యం వల్లనే భగవానునకు కూడ ఉత్కర్ష కల్గుతుందని ఆచార్యవర్యులు చక్కగా నిరూపించారు. **"తవ స్పర్శాదీశం స్పృశతి కమలే! మంగళ పదం తవేదం నోపాధేః ఉపనిపతితం శ్రీరసి యతః।"** (శ్రీగుణరత్న-29) (ఓ లక్ష్మీదేవీ! నీ స్పర్శ వల్లనే భగవానునకు మంగళమనే నామం స్పృశిస్తున్నది - అంటే - మంగళశబ్ద వాచ్యుడయ్యాడు. నీ కయితే ఈ మంగళ పదం ఏదో ఒక కారణంవల్ల కల్గినది కాదు. ఎందువల్ల నంటే నీవు శ్రీశబ్ద వాచ్యురాలవు కద) అని, **"అపాంగా భూయాంసో యదుపరి పరం బ్రహ్మ తదభూత్, అమీ యత్ర ద్విత్రాః, స చ శతమఖాదిః తదధరాత్"** (గుణరత్న-30) (లక్ష్మీదేవి కటాక్షాలు అధికంగా ఎవరిపై పడ్డాయో, అతడు పరతత్త్వమయ్యాడు. ఎవరిపైన ఈ లక్ష్మీ కటాక్షాలు రెండు మూడు మాత్రం పడ్డాయో, అతడయితే ఆ పరతత్త్వం కంటే తక్కువ వారైన ఇంద్రాదులుగా అయినాడు) ఇత్యాది ప్రమాణాలు ఇక్కడ భావించదగినవి. శ్రీరామాయణంలో మారీచుడు పల్కిన **"అప్రమేయం హి తత్తేజః యస్య సా జనకాత్మజా"** (రామా-అరణ్య-37-18) (జనకుని కుమార్తె అయిన సీతకు ఏ తేజస్సుకు చెందిన ఆ తేజస్సు ఇంతటిదని పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యం కానిదో) అనే వచనం విశేషించి అనుసంధేయం. ప్రమాణ మూర్ధన్యమైన **"శ్రద్ధయా దేవో దేవత్వమశ్నుతే"** (శ్రద్ధాశబ్ద వాచ్యురాలైన లక్ష్మీదేవిచేత దేవుడు దేవత్వాన్ని పొందుతున్నాడు) అనేది శ్రుతి వాక్యం. అటువంటి లక్ష్మీదేవి యొక్క

గుణవైభవాన్ని ప్రకాశింపజేయడం కోసమే శ్రీరామాయణం అవతరించింది. **"రాఘవత్వే-భవత్ సీతా"** (విష్ణుపు-1-9-144) (భగవానుడైన శ్రీమన్నారాయణుడు శ్రీరామునిగా అవతరించినపుడు లక్ష్మీదేవి సీతగా అవతరించింది) అనే పురాణ రత్నసూక్తి క్రమంలో లక్ష్మీదేవియే కద సీతాదేవీ రూపంలో అవతరించి, శ్రీరాముని సహధర్మచారిణియై, తనకు మిక్కిలి సహించరానిది అయినా రామ విశ్లేషాన్ని స్వయంగా కోరుతున్నదై వియోగాన్ని పొందింది. **"సుందరీ రఘునాథస్య సురస్త్రీ దుఃఖశాంతయే, దశాననస్య భవనే దశ మాసా నువాస హ"** (రఘునాథుని సుందరి అయిన సీతాదేవి దేవకాంతల దుఃఖం తీరడం కోసం దశాననుడైన రావణుని భవనంలో పదినెలలు ఉన్నది) అని సీతాదేవి లంకానగర నివాస మర్మాన్ని తెలిసినవారు అన్నారు కద! సీతాదేవియే స్వయంగా **"అసందేశాత్తు రామస్య తపస శ్చాను పాలనాత్, నత్వాం కుర్మి దశగ్రీవ! భస్మ భస్మార్హతేజసా"** (రామా-సుందర -22-20) (నాకు రాముని ఆజ్ఞ లేనందువల్ల, నేను పారతంత్ర్యమనే తపస్సును అనుసరిస్తున్నందు వల్ల, నేను నిన్ను భస్మం చేయగల్గినా, నా తేజస్సుతో భస్మం చేయడం లేదు) అని పల్కుతూ, తన గొప్ప శక్తిని వ్యక్తం చేసింది. ఇటువంటి విశేషమైన శక్తిని సహజంగా కల్గినదైన ఈ సీతాదేవి పంచవటిలోని పర్ణశాల ప్రాంగణంలోనే రావణుని తన తేజస్సుతో భస్మం చేయగల సమర్థురాలైనా, అశక్త్యాదులను అభినయించడం ద్వారా, అతనిచే అపహరింపబడిన స్థితిని పొందింది. **"హిమహత నళినీవ నష్టశోభా వ్యసన పరంపరయా తి పీడ్య మానా, సహచర రహితేవ చక్రవాకా జనకసుతా కృపణాం దశాం ప్రపన్నా"** (రామా-సుందర-16-30) (మంచు చేత పద్మం వలె, శోభను కోల్పోయినదై, దుఃఖ పరంపర చేత మిక్కిలి పీడింపబడే సీతాదేవి తన సహచరుని (మగపక్షిని) కోల్పోయిన ఆడ చక్రవాక పక్షివలె మిక్కిలి దయనీయమైన దశను పొందింది) ఇత్యాదిగా హనుమంతునిచే చెప్పబడిన

పలు నిర్వేదోక్తులకు లక్ష్యభూతురాలై, **"మమాపి వ్యధితం మనః"** (రామా-16-28) (వీత రాగుడనైన నా మనస్సు కూడ ఈమెను చూచి వ్యథను పొందింది.) అని విరాగులలో అగ్రేసురుడైన వాయుసూనుని విషాద వచనాలకు లక్ష్యభూతురాలై, భరించడానికి సాధ్యం కాని పలు దుఃఖాలను అనుభవించింది. ఇది అంతా ఆమె తనకు గల నిరతిశయమైన తన కృపాగుణవిశేషాన్ని ఆవిష్కరించడం కోసమే అనే విషయాన్ని విద్వాంసులు తెలుసుకొంటున్నారు. మన పూర్వాచార్యులందరు దీనిని ఏకకంఠంగా పల్కుతున్నారు. దయాళువు, క్షమానిధి, ఆశ్రిత వత్సలుడు అనే స్తుతికి భగవానునిలో యోగ్యత లక్ష్మీదేవితో గల సంబంధం వల్లనే కల్గింది - అని నిష్కృష్టమైన, ఏ దోషం లేని జ్ఞానానికి నిధులైన పండితులు నిష్కర్షిస్తున్నారు. ఈ రీతిలోనే శ్రీరామాయణంలో కథా భాగాలు అవతరించాయని తెలిసి కొంటున్నాము కూడ. ఈ విషయం క్రమంగా ముందు విశదీకరింపబడుతుంది. అందువల్ల ఆ లక్ష్మీదేవి చరిత్రయే శ్రీరామాయణంలో ప్రాధాన్యాన్ని సంతరించుకొన్నది అనే మాట పూర్తిగా సమంజసం కాగలదు. దీని వల్ల శ్రీరాముని చరిత్ర అప్రధానమైనదని పల్కడంలో ఉద్దేశ్యమున్నదని భావించరాదు. విశేషించి సీతా చరిత్రకు ప్రాధాన్యమున్నదని పల్కడం ఇద్దరి ప్రాధాన్యాన్ని పల్కడంలోనే పర్యవసిస్తుందని భావించడం యుక్తం. ఈ విధంగా ద్వంద్వసమాస యోగ్యమైన శ్రీరామాయణమనే వ్యవహారమే యుక్తతరమనే వచనం యుక్తం.

శ్రీమద్రామాణమనే వ్యవహారం కూడ తగినదే కాగలదు. అపుడు **"రామస్య అయనమ్"** అనే వ్యుత్పత్తిని విడచిపెట్టాలి. **"రామాయాః అయనమ్"** (సీతాదేవి యొక్క చరిత్ర) అని వ్యుత్పత్తిని చెప్పాలి. ఇక్కడ రామా శబ్దానికి సీత - అని అర్థం. **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"** (రామా-బాల-4-7) (రామాయణ కావ్యం పూర్తిగా

సీతాదేవి గొప్ప చరిత్ర) అనే వాల్మీకి వచనం. వ్యుత్పత్తికి పూర్తిగా అనుకూలం. ఈ వ్యుత్పత్తిలో శ్రీమత్ అనే పదం రామాయణ పదానికి విశేషణమని గ్రహించాలి. **'శ్రీమతీ చ సా రామా చ'** అని యోజనలో స్వారస్యం లేదు కనుక, ఆ యోజనను దూరంగా ఉండ నివ్వండి. ఈ విధంగా సీతాదేవి యొక్క చరిత్రయే - అనే అర్థాన్ని తెలుపడంలో శ్రీమద్రామాయణమనే వ్యవహారం కూడ చక్కగా పొసగుతుందని తెలుపబడి, రామ సంబంధం విడువరానిది అయినందున, ఈ రెండింటిలో శ్రీరామాయణమనే సాంప్రదాయిక వ్యవహారాన్ని మహనీయులు ఎక్కువ ఆదరిస్తారు. ఇక, శ్రీరామాయణ మహాసముద్రం లోపలకు ప్రవేశిద్దాం.

భగవానుడైన శ్రీ మహావిష్ణువు దశరథ నందనుడుగా అవతరించాడు. **"అజాయమానో బహుధా విజాయతే"** (పురుష సూక్తమ్-2-1) (భగవంతుడు కర్మమూలకంగా జన్మించనివాడై, కృపామూలకంగా పలు జన్మలను పొందుతున్నాడు) అని, **"స ఉ శ్రేయాన్ భవతి జాయామానః"** (యజుర్వేదం సం.3-6-3) (ఆ భగవానుడు అవతరించినవాడైనపుడే మిక్కిలి శ్రేయస్సును కలవాడవు తున్నాడు) అని, **"పితా పుత్రేణ పితృమాన్ యోనియౌనౌ"** (జగత్తు అంతటికి తండ్రి అయిన భగవానుడు ప్రతి అవతారంలోను తన పుత్రుడైన ఒక జీవుని ద్వారా తండ్రిని కలవాడవుతున్నాడు) అని వేదంలో పల్కిన రీతిలోను, **"బహూని మే వ్యతీతాని, జన్మాని తవ చార్జున!"** (భగవద్గీత 4-5) (ఓ అర్జునా! నా జన్మలు చాల గడచి పోయాయి, ఆ విధంగా నీ జన్మలు కూడ అనేకం గడచి పోయాయి) అని గీతాచార్యుడు పల్కిన రీతిలోను లెక్కలేనన్ని అవతారాలను ఎత్తే పరమ పురుషుని అవతారాలలో మత్స్య కూర్మాది అవతారాలు విశేషించి లెక్కించబడుతున్నాయి. వాటిలో, **"దశ వర్ష సహస్రాణి దశవర్ష శతాని చ, రామో రాజ్యముపాసిత్వా**

**బ్రహ్మలోకం గమిష్యతి"** (రామ-బాల-1-97) (పదకొండు వేల సంవత్సరాల కాలం రాముడు రాజ్యాన్ని ఉపాసించి, శ్రీరాముడు పరబ్రహ్మలోకమైన వైకుంఠాన్ని చేరగలడు) అనే రీతిలో పదకొండు వేల సంవత్సరాల కాలం భూతలాన్ని అలంకరించిన దశరథ నందనుడైన పరమ పురుషుని దివ్యావతారం మిగిలిన అవతారాలన్నిటిలో అతిశయాన్ని కల్గినదనేది అందఱు అంగీకరించినది. అందువల్లనే లోకంలో మిగిలిన ఇతిహాసాలన్నింటి కంటే శ్రీరామాయణానికి శ్రేష్ఠత ఉన్నదనేది నిర్వివాదం. **"భారతం పంచమో వేదః"** (మహాభారతం పంచమ వేదం), **"వేదాన ధ్యాపయామాస మహాభారత పంచమాన్"** (మహాభారతముతో కూడి అయిదు అయిన వేదాలను అధ్యాపనం చేశాడు) అని చెప్పబడిన రీతిలో మహాభారతానికి ప్రాశస్త్యం ఉన్నా, సదాచార్య గోష్ఠిలో శ్రీరామాయణానికి గల పరిగ్రాహ్యతాతిశయం వల్ల కల్గిన ప్రశస్తి సాటి లేనిది - అనేది నిజం. ఆ ప్రశస్తిని శ్రీరఘు నందనుని రూపంలో పరమాత్మ వ్యక్తం చేసిన కల్యాణ గుణాల ఉత్కర్షయే కారణ మనేది వాస్తవం. ప్రసన్న రాఘవమనే నాటకంలో, **"స్వసూక్తీనాంపాత్రం రఘుతిలకమేకం కలయితాం కవీనాం కోదోషః? సతు గుణగణానామవిగుణః"** (కవులు తమ సూక్తులను - అంటే - కవిత్వానికి రాముని ఒక్కని మాత్రమే లక్ష్యంగా చేసికోవడంలో వారి తప్పు ఏమున్నది? అపరాధం అంతా ఆ శ్రీరాముని కల్యాణ గుణాలదే) అని, **"యది క్షుణ్ణం పూర్వైరితి జహతి రామస్య, చరితం గుణైరేతావద్భిః జగతి పునరన్యో జయతి కః?** (శ్రీరాముని చరిత్ర ఇంతకు ముందే పలువురు పూర్వ కవులచే రచింపబడినదని విడచి పెడితే, ఆ విధంగా కల్యాణ గుణాలను కల్గిన వ్యక్తి ఇంకొకడు ఈ లోకంలో ఎవడున్నాడు?) అని (అనర్ఘ రాఘవ నాటకంలో మురారి కవి) అన్నారు కద!

ఇక్కడ ఒక సందేహం. మానవులలో ఒక విశిష్టమైన వ్యక్తియే కద,

రాముడు. ఇతడు విష్ణువు ఏ విధంగా కాగలడు? శ్రీరామాయణంలో కూడ ఇతనికి మనుష్యత్వమే వ్యక్తమైనది. తన ఆశ్రమానికి వచ్చిన నారద మహర్షిని తపస్వి, వాగ్విశారదుడైన వాల్మీకి ముని ప్రశ్నిస్తూ - **"జ్ఞాతుమేదం విధం నరమ్, పరం కౌతూహలం హి మే"** (ఈ విధంగా పదహారు గుణాలను కల్గిన మానవుని నేను తెలిసి కోవాలని నాకు మిక్కిలి కుతూహలంగా ఉన్నది) అని అడిగాడు. దీనికి నారదుడు సమాధానం పల్కుతూ **"మునే? వక్ష్యామ్యహం బుద్ధ్వా తైర్యుక్తం శ్రూయతాన్నరః"** (రామా- బాల -1-7) (వాల్మీకి మహామునీ! నేను తెలిసికొని ఆ పదాహాఱు గుణాలను కల్గిన మానవుని గూర్చి నీకు తెలుపగలను) అని బదులిచ్చాడు. తన యజ్ఞరక్షణ కోసం రాముని తీసికొనిపోగోరి వచ్చిన విశ్వామిత్రునికి దశరథ చక్రవర్తి సమక్షంలో **"అహం వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్"** (సత్యమైన పరాక్రమాన్ని కల రాముని నేను మహాత్మునిగా తెలిసి కొంటున్నాను) (రామా - బాల-19-14) అని పల్కినప్పటికీ, ఏకాంతంలో శ్రీరామునకు మేల్కొలుపు పలికేటపుడు **"కౌసల్యా సుప్రజా రామ! ఉత్తిష్ఠ నరశార్దూల"** (రామా-బాల-23-2) (కౌసల్యా దేవికి పుట్టిన మంచి కుమారుడా! శ్రీరామా!... మానవ శ్రేష్ఠా! నిద్రలే) అని ప్రబోధించాడు. వాస్తవానికి **"ఉత్తిష్ఠ సుర శార్దూల! దేవ దేవేశ దేవతాధీశ"** (దేవతలలో శ్రేష్ఠుడా! దేవ దేవేశ! దేవతలకు ప్రభూ! (ఇత్యాది క్రమంలో నిద్రలేపి ఉండాలి. కాని, ఆ విధంగా పలుక లేదు. పలు మాటలు పల్కడం ఎందుకూ? పట్టాభిషేకాన్ని ప్రతిపాదించిన (వర్ణించిన) సమయంలో కూడ **"అభ్యషించన్నర వ్యాఘ్రం ప్రసన్నేన సుగంధినా సలిలేన"** (రామా-యుద్ధ-128-61) (నర శ్రేష్ఠుడైన రాముని ఋషులు స్వచ్ఛమైన సుగంధాన్ని కల జలంతో అభిషేకించారు) అని పలికారు తప్ప, **"అభ్యసించన్ మహావిష్ణుమ్"** (మహావిష్ణువును అభిషేకించారు) అని అనలేదు. ఈ విధంగానే అప్రకంప్యాలైన (చెక్కు చెదరని), కాదనడానికి వీలులేని నిరూపణ విశేషాలతో పూర్తిగా

శ్రీరాముడు ఒకానొక విశిష్టమైన వ్యక్తిగా తెలియ బడుతున్నాడే తప్ప, నారాయణుడు, మహావిష్ణువే రాముడై అవతరించాడనే భావనకు అవకాశలేశాన్ని అయినా పొందలేము (అనేది ఇచట సందేహం).

దీనికి ఇపుడు సమాధానం తెలుపబడుతున్నది. అయోధ్యాకాండ ఆరంభంలో - **"స హి దేవైరుదీర్ణస్య రావణస్య వధార్థిభిః, అర్థితో మానుషే లోకేజజ్ఞే విష్ణుస్సనాతనః"** (రామా-అయో-1-7) (ఆ సనాతనుడైన విష్ణువు, దుష్టుడైన, గర్వించిన రావణుని వధను కోరే దేవతలచే ప్రార్థింపబడినవాడై మానవ లోకంలో జన్మించాడు) అని సుస్పష్టంగా మహర్షి సార్వభౌముడైన వాల్మీకి స్వయంగా పలికాడు. శ్రీరామాయణం ఆరంభంలోనే **"ఏతస్మిన్నంతరే విష్ణు రూపాయాతో మహాద్యుతిః"** (రామా-బాల-15-16) (ఇంతలో గొప్ప కాంతిని కల విష్ణువు అక్కడకు వచ్చాడు) ఇత్యాది వచనాలతో విష్ణువే దేవతల ప్రార్థనలు విషయ భూతుడయ్యాడు (దేవతలు ప్రార్థించారు) అని చక్కగా తెలియజేశాడు. రావణ వధ తరువాత **"భవాన్నారాయణో దేవః"** (రామా-యుద్ధ-117-13) (నీవు దేవుడవైన నారాయణుడవు)అని చెప్పబడే దేవతల ముందు **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** (రామా-యుద్ధ-117-11) (తనను మానవునిగా భావించేవాడు, దశరథుని కుమారుడైన రాముడు) అని పలికేవాడైన రామచంద్రుని చేత తన నారాయణత్వం నిరాకరింప బడలేదు. సరికదా, నారాయణత్వం కంటే మానుషత్వంలో తనకు ఎక్కువ అభిమానం - అని మాత్రమే వ్యక్తమవుతున్నది. భగవద్గీతలో **"అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్, సాధురేవ స మంతవ్యః, సమ్యక్ వ్యవసితో హి సః"** (భగవద్గీత 9-30) (మిక్కిలి దురాచారాలను చేసేవాడైనా, నన్ను అనన్య భక్తితో కొలిస్తే అతడు మంచివాడని గ్రహించాలి. అతడు పూర్తిగా తీర్చిదిద్దబడినవాడు కద!) అనే శ్లోకంలో **"మంతవ్యః జ్ఞాతవ్యః**

(**మంతవ్యః** - అంటే తెలియదగిన వాడు) అని శంకరాచార్యులవారి వ్యాఖ్య. భగవద్రామానుజుల భాష్యంలో అయితే **"మంతవ్యః బహుమంతవ్యః"** (గౌరవించదగిన వాడు) అనే అర్థం ఆమ్రేడితమైనది.

ఈ సందర్భంలో శ్రీదేశికుల **తాత్పర్య చంద్రికా** సూక్తి ఈ విధంగా ఉన్నది. - **"బహుమంతవ్య ఇతి. అర్థ సిద్ధ బోద్ధవ్యతా మాత్రకథనం నిరర్థకమ్. సంపూర్వన్య మనిధాతోశ్చ బహుమతి రర్థః ఉపసర్గా ర్థాశ్చ ధాతులీనా ఇతి భావః (బహుమంతవ్యః"** - అనేటపుడు ఈ పదార్థం ద్వారా సిద్ధించిన బోద్ధవ్యమనే అర్థాన్ని మాత్రం చెప్పడంలో ఉపయోగం ఏమి లేదు. సం అనే ఉపసర్గను కల్గిన మని ధాతువునకు బహుమతి అని అర్థం. ఇక్కడ మూలంలో **"మంతవ్యః"** అని ఉపసర్గ లేని ప్రయోగం ఉన్నా, ధాతువులోనే వక్తవ్యమైన ఉపసర్గార్థం లీనమై ఉన్నదని భావం) ఈ రీతిలోనే **"ఆత్మానం మానుషం మన్యే"** (నన్ను నేను మానవునిగా, గొప్పగా భావిస్తున్నాను) అనే చోట కూడ మన్యే అనే పదానికి బహుమన్యే (గొప్పగా తలుస్తున్నాను) అనే అర్థం రుచిరమైనదని మహామతులైన ఆచార్యులు భావించారు. ఈ విధంగా భగవానునకు మానుషభావం మిక్కిలి అభిమతమని పల్కడం వల్ల అతనిలో నారాయణత్వంగాని, మహావిష్ణుత్వం గాని లేదని భావించరాదు. సాక్షాన్నారాయణుడు, దేవతా సార్వభౌముడే దాశరథి రూపంలో దివ్యమైన అవతారాన్ని ఎత్తాడు - అనేది మిక్కిలి పొసగుతుంది.

ఈ విమర్శనానంతరం, నారాయణుడే రాముడై ఎందుకు అవతరించాడు? అనే ప్రశ్న కల్గుతుంది. **"పరిత్రాణాయ సాధూనాం, వినాశాయ చ దుష్కృతామ్, ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి యుగే యుగే"** (భగవద్గీత 4-8) (సాధు పరిత్రాణార్థం, దుష్టుల వినాశం కోసం, ధర్మ సంస్థాపన కోసం నేను ప్రతి యుగంలోను అవతరిస్తాను) అని స్వయంగా

పలికే శ్రీకృష్ణ భగవానునిచే సాధు పరిత్రాణం, దుష్కృద్వి నాశం, ధర్మ సంస్థాపనం అనే అవతార ప్రయోజనాలు నిర్దేశింపబడ్డాయి.

కాని, శ్రీరామాయణంలో కూడ **"ఉదీర్ణస్య రావణస్య వధార్థిభిః దేవైరర్థితో మానుషే లోకే జజ్ఞే"** (గర్వించిన రావణుని వధను కోరే దేవతలచే ప్రార్థింపబడిన నారాయణుడు మానవలోకంలో అవతరించాడు) (రామా-అయో 1-7) అని రావణవధయే రామావతార ప్రయోజనంగా నిర్దేశింపబడింది. అయినా, విమర్శన విచక్షణులైనవారికి ఈ విషయంలో తృప్తి కలుగదు. భగవానుడు సత్య కాముడు, సత్య సంకల్పుడు కూడ. **"సో-కామయత బహుస్యాం ప్రజాయేయేతి, స తపో తప్యత, స తప స్తప్త్వా, ఇదం సర్వ మసృజత, యదిదం కించ"** (తైత్తిరీయ-2-6) (ఆ భగవానుడు పలు రీతులలో సృష్టి చేస్తాను) అని సంకల్పించాడు. అతడు ఆలోచించి, కంటికి కన్పించే ఈ జగత్తును అంతటిని సృష్టించాడు) అని ఉపనిషత్తులో పల్కిన రీతిలో సంకల్ప మాత్రంతోనే సృష్టి స్థితి సంహారాదులను నిర్వహించగల్గిన ఆ పరమాత్మకు, అయ్యో!, హిరణ్య కశిపు హిరణ్యాక్ష, రావణ, కుంభకర్ణ, కంస, శిశుపాల, క్షుద్ర, క్రిమికీటకాలను వధించడంలో పలు దుఃఖాలకు కారణమైన మానవలోకంలో అవతరించడం ఏమయినా ఆవశ్యకమైనదా? **"సాధవః పరిత్రాతా భవంతు, దుష్కృతో వినష్టా భవంతు** (మంచివారు రక్షింపబడిన వారు అగుదురు గాక, దుష్టులు నశించిన వారగుదురు గాక) అని సంకల్ప మాత్రంతోనే సాధించలేనిది ఏదయినా ఉన్నదా?

ఆనందమయుడుగా వేదంలో చెప్పబడిన ఆ భగవానుని భరించడానికి సాధ్యం కాని, నానా విధాలైన దుఃఖాలను అనుభవించడానికి మూలకారణమైన జన్మ పరంపరలను పరిగ్రహించడంలో ఆసక్తి ఏ విధంగా కల్గింది?

భవభూతి మహాకవి 'ఉత్తరరామచరిత' నాటకంలో వనదేవతలను ఉద్దేశించి శ్రీరాముడు పల్కిన పల్కులను అనువదిస్తూ **"దుఃఖ సంవేదనాయైవ రామే చైతన్య మాహితమ్"** (ఉత్తర రామ-1-47) (దుఃఖానుభవం కోసమే రామునిలో చైతన్యం ఉన్నది) అని అన్నాడు. కేవలం దుఃఖానుభవం కోసమే రాముని అవతారం జరిగిందని అనడం నిజమా? అని ఈ రీతిలో హెచ్చు తగ్గులైన పలుశంకలు కల్గుతాయి. వీటికి తృప్తికరమైన సమాధానమేమి? (అంటే).

వినండి. తరువాత విశేషమైన వివరణం క్రమంగా దీనికి చేయబడుతుంది. ప్రస్తుతంలో సారతమమైన సమాధానాన్ని ఆలకించండి. భగవద్రామానుజార్యవర్యుల పాదపద్మ పరిసరంలో సకలార్థాలను అభ్యసించిన వారు, **"యదుక్తయ స్త్రయీకంఠే యాంతి మంగళ సూత్రతామ్** (ఎవరి సూక్తులు వేదకాంతమెడలో మంగళ సూత్రాల స్థితిని పొందుతున్నాయో) అని కీర్తింపబడిన వారైన, పూజ్యులైన కూరేశులనే గురువర్యుల చేత అనుగ్రహించబడిన పద్యరత్నాలలో ఒక శ్లోకాన్ని ఇక్కడ ఉదాహరిస్తాము. అది ఏమంటే-

**''అనాప్తం హ్యావ్తవ్యం న తవ కిల కించి ద్వరద! తే, జగజ్జన్మస్థేమ ప్రళయ విధయో ధీ విలసితమ్, తథాపి క్ష్మోదీయ స్సురనర కులేష్వా శ్రితజనాన్ సమాశ్లేష్టుం పేష్టుం తదసుఖకృతాం చావతరసి"** (వరదరాజస్తవం-64) (ఓ వరదరాజస్వామీ! పొందనిది కదా పొందవలసియున్నది. నీకు పొందవలసినది ఏదీ లేదు. జగత్తు యొక్క సృష్టి, స్థితిలయ క్రమాలన్నీ నీ సంకల్ప విలసితాలు. అయినా, నీవు చాల శ్రమను కల్గించే సురనర జాతులలో నీ భక్త జనులతో కలసి ఉండడం కోసం, వారికి కష్టాలను కల్గించే దుష్టులను సంహరించడం కోసం అవతరిస్తున్నావు సుమా!) అనేది ఈ శ్లోక తాత్పర్యం. భగవానుడు అవాప్త సమస్త కాముడనే విషయం

నిజమే. తన సంకల్ప మాత్రంలోనే జగత్తుల సృష్టిస్థితి ప్రళయాదులను నిర్వహిస్తాడు. అయినా, మిక్కిలి శ్రమను కల్గించే సుర-నర జాతులలో భగవానుని అవతారాలు తన ఆశ్రితులను కలవడం కోసం, వారి విరోధి వర్గాన్ని నిరసించడం కోసం. భగవద్గీతలో కూడ **"పరిత్రాణాయ సాధూనామ్"** (సత్పురుషులను పరిరక్షించడం కోసం) అనే కద చెప్పబడింది. అదే కద ఇక్కడ కూడ చెప్పబడింది. అధికంగా ఏమి విశేషం ఉన్నది? అని ప్రశ్నించనక్కరలేదు.

అక్కడ **"సాధూనాం పరిత్రాణాయ"** అని చెప్పబడింది. దానికి పిమ్మట, ఇది సంకల్ప మాత్ర సాధ్యం కాదా? - అనే ప్రశ్న కల్గింది. పరిత్రాణమనే శబ్దం ద్వారా చెప్పదలచిన అర్థాన్ని వివరించడం ద్వారా ఆ ప్రశ్నకు సమాధానాన్ని కూరనాథ గురువరులు పల్కుతున్నారు - **"ఆశ్రిత జనాన్ సమాశ్లేష్టుమ్"** అని పల్కడం ద్వారా.

ఎవరు భగవానుని సాక్షాత్కరించ గోరుతున్నారో, ఎవరు ఆ స్వామితో సంభాషించగోరుతున్నారో, ఎవరు అతని గాఢాలింగనాన్ని కోరుతున్నారో, ఎవరు అతని పాదపద్మ సమీపంలో స్వయంగా అర్చనను చేయగోరుతున్నారో, వారి వారి ఆయా మనోరథాలను తీర్చడం ద్వారా, తన దర్శన ఆలాప, సంశ్లేషాదులను అనుగ్రహించడం ద్వారా వారిని రక్షించడం కోసం అవతరిస్తాడు అనేది భగవద్భాష్యకారులు గీతాభాష్యంలో చేసిన వివరణ ప్రక్రియ.

అంతకంటే అతిశయించి ఉన్నది కద, ఇక్కడ ఉదహరింపబడిన శ్రీకూరనాథుల శ్రీస్తుతి. **"ఆశ్రిత జనాన్ సమాశ్లేష్టుమ్"** (భక్తులను ఆలింగనం చేసి కోవడం కోసం) అనే సూక్తి అన్వర్థమైనది. భక్తులకు భగవానుని ఆలింగనం చేసికోవాలనే ఆశ ఉంటే ఉండనివ్వండి. తన భక్తులను కౌగలించుకోవాలనే కోరిక అతడు అచరించక పోతే ఏ విధంగా తీరుతుంది? అని కూరనాథులు పల్కుతున్నారు (వినండి). **"సంశ్లేషే భజతాం త్వరాపరవశః కాలేన సంశోధ్య**

**తాన్ ఆనీయ స్వపదే స్వసంగమ కృతం సోఢుం విలంబం బత!, అక్షామ్యన్ క్షమిణాంవరో వరద! సన్నత్రావ తీర్ణః"** (వరద రాజస్తవం-66) (వరదరాజస్వామీ! ఓర్పును కలవారిలో నీవు గొప్పవాడై నందున, కాల గమనంలో ఆ భక్తుల కర్మజ్ఞాన రూపాలైన ఉపాయాలతో శోధించి, నీ లోకమైన పరమపదానికి తీసికొని, అపుడు వారితో కలిసే క్రమంలో జరిగే ఆలస్యాన్ని సహించలేక, ఈ అజ్ఞానప్రదమైన ప్రపంచంలో జన్మిస్తున్నావు. సరే కాని, ఆశ్రితులు కానివారికికూడ నీ దివ్యరూపాన్ని దర్శించేటట్లు అనుగ్రహిస్తున్నావే! ఇదేమి ఆశ్చర్యం!) అనేది ఈ శ్లోకం.

ఈ అర్థాన్ని శ్రీరామాయణంలో కొంచెం దర్శిద్దాం.

**"గుహేనసహితో రామః"** అనే శ్రీరామాయణ శ్లోకం అందరికి తెలిసినదే. రాముడు గుహునితో కలిసిన వాడయ్యాడు - అనే అర్థాన్ని మాత్రమే ఇక్కడ ఇంచుమించుగా అందఱు పల్కుతారు. రసికాగ్రేసరులైన మన పూర్వాచార్యులయితే ఇటువంటి (సాధారణమైన) అర్థాన్ని మనస్సులో కూడ భావిస్తారా? చూడండి. ఈ శ్లోకం సంక్షేప రామాయణంలో **"గుహేన సహితో రామో లక్ష్మణేన చ సీతయా"** (రామా-బాల-1-30). (రాముడు గుహునితో కలిసినవాడయ్యాడు. లక్ష్మణునితో, సీతతో కూడ కలిసినవాడయ్యాడు) అని ఉన్నది. ఇక్కడ సీతాలక్ష్మణుల సాహిత్యాన్ని గూర్చి పలకడం చర్విత చర్వణమే కాగలదు. లక్ష్మణుడు, సీత రాముని అనుసరించి వెళ్ళారు అనే విషయం ఇతః పూర్వమే చెప్పబడింది. **''తం వ్రజంతం ప్రియోభ్రాతా లక్ష్మణోనుజగామహ"** (రామా-బాల-1-25) (అరణ్యానికి వెళ్ళే ఆ రాముని అతనికి ప్రియమైన భ్రాత లక్ష్మణుడు అనుసరించాడు, ఆహా!) అని, **"సీతాప్యనుగతా రామం శశినం రోహిణీయథా"** (రామ-బాల-1-28) (చంద్రుని రోహిణి అనుసరించినట్లు, సీత కూడ రాముని అనుసరించింది)

అని చెప్పబడింది. అందువల్ల మళ్ళీ వారితో కలసి ఉన్న విషయాన్ని గూర్చి పల్కడం కవిసార్వభౌముడైన వాల్మీకి మహర్షి కవిత్వానికి న్యూనతనే కల్గిస్తుంది. ఆ దోషాన్ని పరిహరిస్తూ ఆచార్యులు శ్రీరామచంద్రుని స్వభావానికి అనుగుణంగా వ్యాఖ్యానించారు. ఇక్కడ గోవిందరాజీయ వ్యాఖ్యాన పంక్తి ఈ విధంగా ఉన్నది.

**''స్వస్మిన్ ఆశాలేశ మాత్రేణ జనితం గుహ విషయ ప్రేమాతిశయం దర్శయతి - గుహేనేతి. రామో గుహేన సహిత స్సన్ లక్ష్మణేన సీతయాచ సహితోభూత్. గుహసంధానానంతర మేవ లక్ష్మణ సీతాభ్యాం నిత్యానపాయిభ్యాం సాహిత్య మాసీత్. తతః పూర్వం సిద్ధమపి సత్ అసత్ప్రాయమాసేదిత్యర్థః"** (తన పట్ల గుహునకు కల ఆశాలేశ మాత్రం వల్ల గుహుని పట్ల కల్గిన ప్రేమాతిశయాన్ని శ్రీరాముడు ప్రదర్శిస్తున్నాడు - **'గుహేన'** అని అంటూ. శ్రీరాముడు గుహునితో కలిసినవాడై, లక్ష్మణునితో సీతతో కూడ కలసినవాడయ్యాడు. గుహునితో కలసిన పిమ్మటనే తనను ఏ సమయంలోనూ విడచి ఉండని లక్ష్మణునితో, సీతతో సాహిత్యాన్ని కల్గిన వాడయ్యాడు. అంతకు ముందు సాహిత్యం ఉన్నా, అది లేనట్లుగానే అయినది అని అర్థం.)

ఈ సూక్తిలోని అర్థాన్ని పండితులు సులభంగా అర్థం చేసికొంటారు. జ్ఞానంతో, శీలంతో, వర్తనంతో, కులంతో పూర్తిగా వైషమ్యాన్ని కల్గిన నిషాద (కిరాత) కులానికి అధిపతి అయిన గుహుని ఉద్దేశించి **"మహర్షి రామస్యాత్మసమః సఖా"** (రామా-అయోధ్యా-50-33) (రామునకు ఆత్మతో సమానమైన మిత్రుడు) అని అన్నాడు. ఆహా! ఏ విషయంలో గుహుడు రామునకు ఆత్మ సముడైన సఖుడయ్యాడు - అనే విమర్శ చేసినపుడు శ్రీరాముని హృదయమే ఇక్కడ ప్రమాణమని తప్ప వేరొక విషయాన్ని తెలియలేము.

తక్కువ జాతివాడు, జుగుప్సను కల్గించే వేషాన్ని, వర్తనాన్ని కల్గిన వాడైన గుహునితో కలయిక రామునకు చాల అభిలషణీయమైనదని శబ్దతః (శబ్ద ప్రయోగం ద్వారా) తెలిసికొంటున్నాము. గుహునితో కలసిన పిమ్మటనే రాముడయ్యాడని కూడ అన్నాడు. **"రమతే ఇతి రామః, రమయతీతి రామః"** (ఆనందిస్తున్నాడు కనుక రాముడు, ఆనందింప చేస్తూన్నాడు కనుక రాముడు) అని రెండు విధాలుగా రామ శబ్దానికి వ్యుత్పత్తులున్నాయి. గుహుని సాహిత్యంలోనే దాశరథికి ఆనందించే స్థితి, ఆనందింప చేసే స్థితి కల్గినవనేది రస్యతరమైన అర్థం.

''**గుహేన సహితో రామః**'' అనే ఈ మాట కవి యొక్క వాక్యం, శ్రీరామునిది కాదు. దీనికి ఇంతకు ముందు తెల్పిన అర్థం కూడ ఆరోపితంగానే (కృత్రిమంగా)కొందఱికి తోచవచ్చు. సాక్షాత్తు రాముడు పల్కిన మాటలలోని అర్థ సౌశీల్యాన్ని ప్రదర్శిస్తాము. గమనించండి. ఆరణ్యా కాండలో ''**కదాన్వహం సమేష్యామి భరతేన మహాత్మనా, శత్రుఘ్నేన చ వీరేణ త్వయా చ రఘునందన!**'' (రామా-అరణ్యా-16-40) (రఘుకులంలో పుట్టిన లక్ష్మణా! ఎపుడు నేను మహాత్ముడైన భరతునితో, వీరుడైన శత్రుఘ్నునితో, నీతో కూడ కలువగలను?) అని లక్ష్మణునితో రాముడు పలికాడు.

చిత్రకూట పర్వత ప్రాంతాలను చేరి, అమృతం వంటి పలు మాటలను పల్కి తిరిగి వెళ్ళిన భరతుని మాటిమాటికి స్మరించి విలపించే రాముని వచనం ఇది. 'వత్సా! లక్ష్మణా! భరతునితో, శత్రుఘ్నునితో కూడ మళ్ళీ ఎపుడు నేను కలిసిన వాడను కాగలను?' - అని అనడం తగినది. కాని, అంతమాత్రమే చెప్పలేదు. లక్ష్మణా! నీతో కూడ ఎపుడు కలువగలను? అని కూడ చెప్పబడింది. సంబోధింపబడే లక్ష్మణుడు సన్నిహితుడై ఉన్నాడు కద! భరత శత్రుఘ్నులతో పాటుగా ఇతడు కూడ వెళ్ళి పోలేదు కద! ఈ విధంగా

ఉండగా, నీతో కూడ ఎపుడు కలవగలను? అని అనడం అన్వయం లేనిదే అవుతుంది. ఇక్కడ ఈ గోవిందరాజీయ వ్యాఖ్యానాన్ని చూడండి.

**''కదేతి. భరతసాహిత్యాభావేన విద్య మానాభ్యాం సీతా లక్ష్మణాభ్యా మపి విరహిత మాత్మానం మన్యతే. భరత స్నేహాతిశయ ప్రకారోయమ్''** (భరతుని సాన్నిహిత్యం లేనందున సీతాలక్ష్మణులిద్దఱూ దగ్గరే ఉన్నా, వారితో కలిసి లేనట్లుగానే తానను భావిస్తున్నాడు. శ్రీరామునకు భరతునిపై గల స్నేహ విశేషం ఇది) అనేది గోవిందరాజీయ వ్యాఖ్యాన సూక్తి. మూల శ్లోకంలోని **'త్వయాచ'** అనే ప్రయోగంలోని చకారం అనుక్త సముచ్చాయకంగా (అంటే- శబ్దతః శ్లోకంలో చెప్పబడని సీతను కూడ తెల్పుతున్నట్లు) గ్రహించి, ఈ రీతిలో అందంగా వ్యాఖ్యానింపబడింది. ఇటువంటి అర్థాన్ని చెప్పకపోతే శ్లోకం ఏ మాత్రం అన్వయించదు. ఈ ప్రకరణంలోనే దీనికి ముందు **''తామేవేక్ష్వాకునాథస్య భరతస్య కథాం కురు''** (రామా-అరణ్య-16-37) (ఇక్ష్వాకువంశ ప్రభువైన ఆ భరతుని వృత్తాంతాన్ని పలుకు) అని ఆరంభించి ఉండే శ్రీరామచంద్రుని వదన పద్మం నుండి పుట్టిన తేనె వంటి రెండు మూడు శ్లోకాలు అతనికి ఆశ్రితులను కలవడంలో గల త్వరాతిశయాన్ని స్ఫుటం చేస్తున్నవి. రాతి గుండె వారి మనస్సులను కూడ ద్రవీకరిస్తాయి. ఆ విధంగా ఉండే శ్లోకాన్ని వినండి. **''నిశ్చితాపి హి మే బుద్ధిః వనవాసే దృఢ వ్రతా, భరత స్నేహ సంతప్తా బాలిశీక్రియతే పునః''** (రామా-అరణ్య-16-38) (నా మనస్సు నిశ్చయాన్ని కల్గినది, వనవాసంలో దృఢమైన వ్రతాన్ని (దీక్షను) కల్గినది అయినా, భరతునిపై గల స్నేహం వల్ల మిక్కిలి తాపాన్ని పొందినదై, మళ్ళీ మూఢునిగా చేస్తున్నది) అనేది ఆ శ్లోకం. వనవాస కాలం పరిమితి పూర్తి కాకపోయినా, భరతుని పై గల ప్రేమాతిశయం చేత ఇపుడే వనం నుండి తిరిగి వెళ్ళడంలో నాకు కూతూహలం కల్గుతున్నది - అని కదా దృఢవ్రతుడైన

రాముడు ద్రవించే మనస్సును కలవాడై పల్కుతున్నాడు. ఆ తరువాత కూడ **''సంస్మ రామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ, హృద్యా న్యమృతకల్పాని మనఃప్రహ్లాదనాని చ''**(రామా-16-39) (ప్రియమైనవి, మధురమైనవి, అందమైనవి, అమృతం వంటివి, మనస్సును ఆనందింప చేసేవి అయిన అతని మాటలను స్మరిస్తున్నాను) అని అన్నాడు. భగవానుడు అవతరించి ఉండకపోతే అపుడు ఈ విధంగా భక్తి స్నేహ బలత్కారాన్ని తెలిపే ఇటువంటి వచనామృతాలు ఏ విధంగా అవతరిస్తాయి. వాటిని మనం ఏ విధంగా అనుభవించగలం? తరువాత కూడ **''ఇత్యేవం విలపం స్తత్ర ప్రాప్య గోదావరీం నదీమ్, చక్రేభిషేకం కాకుత్థ్సః''** (రామా-అరణ్య-16-41) (ఈ విధంగా అక్కడ విలపిస్తూ శ్రీరాముడు గోదావరీ నదిని చేరి అందులో స్నానమాడాడు) అనేది కవి వచనం. ఇచట **'విలపన్'** అనే పదానికి రోదిస్తూ అనే అర్థాన్ని అందరు పల్కుతారు. గోవిందరాజులు (వ్యాఖ్యాత) **''భరత స్నేహ కృతాని బహుని వాక్యాని జల్పన్''**(భరతునిపై గల ప్రీతి కారణంగా వెలువడిన పలు మాటలను జల్పిస్తూ) అని వ్యాఖ్యానించారు. సుప్రభాత సమయంలో అందఱు వైదికులు, పరమైకాంతులు **''హరిః హరిః హరిః''** అని పల్కి, భగవానునకు చెందిన పలు స్తుతులను అనుసంధానం చేస్తూ, తమను పవిత్రం చేసి కొంటారని ప్రసిద్ధం. భగవానుడైతే అపుడు భక్త జనుల స్తుతులను మాటిమాటికి స్మరించి, ద్రవించిన హృదయాన్ని కలవాడై, నిర్విణ్ణుడవుతాడు అని రామాయణం మనకు స్పష్టం చేస్తున్నది. కేవలం రావణాది దుష్టుల వినాశమే అవతారం ద్వారా భగవానుడు చేయదలిస్తే, అపుడు సంకల్పమాత్రంతోనే దానిని నిర్వర్తించ గలడు. ఇది నిజం. ఇందువల్ల సామాన్య జనులకు అభిమతమైన సాధు పరిత్రాణం కూడ సిద్ధిస్తుంది. వాస్తవానికి భగవానుడు తన అచింత్యమైన, దివ్యమైన, అద్భుతమైన గుణగణాలనే ప్రకాశింప జేయాలనే ఆశతోనే మనుష్యులమైన మన మధ్య అవతరించి

కృతకృత్యుడవుతున్నాడు. ప్రసంగవశాత్తు ఈ విషయాన్ని పల్కుతున్నాము. ఇంతకుముందు గోవిందరాజీయ వ్యాఖ్యాన పంక్తులు కొన్ని ఉదాహరింప బడ్డాయి. అక్కడ వచనాలు మాత్రం ఆ వ్యాఖ్యాతవే. అర్థాలైతే వారివి కావు. ద్రావిడ వేదమనబడే దివ్య ప్రబంధాన్ని వ్యాఖ్యానించిన వారిలో ''**నంబిళ్ళై, పెరియవాచ్చాన్ పిళ్ళై**'' - అనే పేరు గల రసికులైన విద్వత్ చక్రవర్తి గురుసార్వభౌములిద్దరిచే తమ వ్యాఖ్యలో అక్కడక్కడ ప్రకరణానికి తగినట్లు రుచిరంగా వ్యాఖ్యానించిన అర్థ విశేషాలను గోవిందరాజార్యులు సంస్కృత భాషలో అనువదించారు. అంతే. అన్ని అర్థాలను వారు అనువదించలేదు కూడ.

పూర్వం నిర్దేశించిన పూర్వాచార్య వ్యాఖ్యానాలు ద్రావిడ వేదాలలోనివి అనేది నామమాత్రమే. శ్రీరామాయణ, విష్ణుపురాణ, భగవద్గీతాది అనేక గ్రంథాలలోని విశేషార్థాలను తెలిపేవి కూడ - అనే విషయాన్ని తెలియాలి. ఆ ఆచార్యవర్యులు వ్యాఖ్యాన కౌశలం అద్వితీయమైనది. మాటకు, మనస్సుకు కూడ అందనిది కూడ. మా మదిలో సదా మెదిలె ఒక చోటును ఉదాహరిస్తాము. దశరథుని మరణానంతరం కేకయ రాజ్యం నుండి భరత, శత్రుఘ్నులను తీసికొనిరావడం కోసం పంపబడిన దూతల ప్రయాణాన్ని వాల్మీకి మహర్షి వర్ణిస్తూ - ''**సరాంసిచ ప్రఫుల్లాని నదీశ్చ విమలోదకాః, నిరీక్షమాణాస్తే జగ్ముః దూతాః కార్యవశాత్ ద్రుతమ్**" (రామ-అయోధ్య-68-14) (బాగా పూచిన సరస్సులను, తేటపడిన నీటిని గల నదులను ఆ దూతలు గమనించకుండా కార్యవశం చేత తొందరగా వెళ్ళిపోయారు) అనే ఒక శ్లోకాన్ని పలికాడు. ఇక్కడ '**నిరీక్షమాణాః**' అనే దాన్ని "చూస్తూ ఉండే వారై'' అనే అర్థాన్ని ఇచ్చే పదంగా అందరు భావిస్తారు. సరస్సులను, నదులను చూస్తూనే ఆ దూతలు వెళ్ళారు - అని ఈ శ్లోకం ద్వారా చెప్పబడింది. కాని, ద్రవిడోపనిషత్తు అనే పేరు గల తిరువాయ్మొழி దివ్య ప్రబంధ వ్యాఖ్యానంలో

**''నిరీక్షమాణాః - అనవేక్షమాణాః ఇత్యర్థః''** (నిరీక్షమాణాః - చూడనివారై అని అర్థం) అని ఆచార్య వర్యులచే తెలుపబడింది. "ఏమది! ఏ విధంగా ఇటువంటి అర్థం చెప్ప బడింది?'' అని గురుకుల వాసం చేయని పలువురు సందేహపడతారు. కొందరు **'నిః'** అనే ఉపసర్గను **'నిర్దోషః'** వంటి ప్రయోగాలలో **'నఞ్'**కి పర్యాయ పదంగా భావించడం చేత ఈ రీతిలో వ్యాఖ్యానించబడింది అని అనువదించడానికి కూడ తగని అర్థాన్ని వర్ణిస్తారు. గోవిందరాజాచార్యులు **''సరః ప్రభృతీన్ నిరీక్షమణా జగ్ముః''** (సరస్సులు మొదలైన వానిని చూడకుండా వెళ్ళారు) అని మాత్రమే వ్రాశారు. ఇక్కడ **'అనవేక్షమాణాః'** అని వ్యాఖ్యాతృ సార్వభౌములచే చెప్పబడిన మాట అగాధజ్ఞాన సామ్రాజ్య విజయానికి ధ్వజం. ఇది నిజం. ఇక్కడ **'నిరీక్షమాణాః'** అనే ప్రయోగం అనవేక్షణ (చూడక పోవటం) అనే మాటకు పర్యాయమే - అని విమర్శక విశారదులు గ్రహిస్తారు. ఇది కూడ తరువాత వివరింపబడుతున్నది.

భగవద్యామునులు అనుగ్రహించిన స్తోత్రరత్నంలో - **''తవామృత స్యందిని పాదపంకజే నివేశితాత్మాకథమన్య దిచ్ఛతి, స్థితేరవిందే మకరంద నిర్భరే మధువ్రతో నేక్షురకం హి వీక్షతే''** (స్తోత్రరత్నమ్-23) (అమృతాన్ని చిందించే నీ పాద పద్మాలలో దృష్టిని పెట్టినవాడు ఎవడు ఇంకొక విషయాన్ని గూర్చి ఆలోచిస్తాడు? మకరందం నిండుగా ఉండే ఒక పద్మంలో నిలచి ఉండే తుమ్మెద అల్పమైన రసాన్ని కల ముళ్ళ గోరింట పూవును కంటితో కూడ చూడదు.) అనే పద్యరత్నాన్ని అప్పయ్య దీక్షితులు తమ కువలయానందంలో ప్రతి వస్తూపమాలంకార వివరణ సందర్భంలో ప్రస్తావిస్తూ ఈ విధంగా **''అత్ర, యద్యప్యుపమేయం వాక్యే అనిచ్ఛా, ఉపమాన వాక్యే అవీక్షేతి ధర్మభేదః ప్రతిభాతి; తథాపి వీక్షమాణస్యా-వర్జనీయస్య ప్రతిషేధ్యనర్హత్వాత్ ఇచ్ఛాపూర్వకవీక్షణప్రతిషేధోయమ్ అనిచ్ఛా-**

**వర్యవసిత ఏవేతి ధర్మైక్యమనుసంధేయమ్"** (కువలయానందం) (ఇక్కడ ఈ శ్లోకంలోని ఉపమేయ వాక్యంలో అనిచ్ఛ (ఇచ్ఛ లేకపోవడం) ఉపమాన వాక్యంలో అవీక్షణం (చూడకపోవడం) అనే రీతిలో ధర్మభేదం భాసిస్తూ ఉన్న ప్పటికీ ఈ రెండింటిలో అవర్జనీయమైన వీక్షణ మాత్రం (చూడడం అనేది మాత్రం) ప్రతిషేధించడానికి - కాదని అనడానికి వీలు కానిది కనుక, ప్రకృతంలో ఇచ్ఛాపూర్వకంగా చూడడం - అనేది ప్రతిషేధింపబడుతున్నది కనుక, - ఉపమాన వాక్యంలోని వీక్షణం కేవల వీక్షణం కాదు, ఇచ్ఛా పూర్వకమైన వీక్షణంలో పర్యవసిస్తున్నది కనుక ఇక్కడ ధర్మైక్యాన్ని భావించాలి) అని అన్నారు. ప్రస్తుత శ్రీరామాయణ శ్లోకంలో. **'నిరీక్షమాణాః'** అని ప్రయోగించిన మహర్షి ఏ అభిప్రాయంతో దీనిని ప్రయోగించాడనేది విమర్శించవలసి ఉన్నది. వినండి.

వెళ్ళే దారిలో ఒక్కొక్క చోటు పలు విధాలైన అందాలతో చూచేవారి దృష్టిని, మనస్సును అపహరించేటట్లున్నది. అక్కడక్కడ నిశితమైన దృష్టిని సారించినపుడు ఆయా విషయాల అనుభవం వల్ల ఆలస్యం తప్పక జరుగుతుంది. ఆలస్యానికి అవకాశం కొంచెం కూడ లేదు. అందువల్ల వారు నిశితంగా గమనించకుండా వెళ్ళారు. తమ కళ్ళను వారు మూసికోలేదు. అయినా చూచిన దాని వల్ల కలిగే ఫలలాభం వారికి కలుగలేదు - అని కద ఇక్కడ మునివరుడు చెప్పదలచినది. దానికి అనుగుణంగానే వ్యాఖ్యానం ఆచార్య పాదులచే అనుగ్రహింప బడినది. కనుక మర్మాన్ని తెలిసిన రసికమణులు ఈ వాఖ్యను చూచి ఆశ్చర్యపడతారు.

తిరువాయ్‌మొళి ప్రబంధంలోని ఏ ప్రకరణంలో ఈ శ్లోక రత్నం ప్రస్తావింపబడినది? అనే విషయం కూడ ఇక్కడ తెలుపబడవలసిఉన్నది. భగవద్విశ్లేషం వల్ల కల్గిన దుఃఖం చేత ఆర్తిని పొందిన పరాంకుశ మునులు భగవానుని ఉద్దేశించి దూత ప్రేషణం చేయడంలో వ్యగ్రులయ్యారు. కేరళ

దేశంలోని **తిరువణ్ వండూరు** అనే దివ్య క్షేత్రానికి నాథుడైన భగవానుని సన్నిధికి పక్షులను దూతలుగా ఈ సందర్భంలో శఠకోపముని పంపిస్తున్నారు. **"దేశికాస్తత్ర దూతాః"** అని దేశికులు పల్కిన రీతిలో జ్ఞానం, అనుష్ఠానం - అనే రెండు రెక్కలచే అలంకరింపబడిన సదాచార్యులే దూతలుగా భావింపబడ్డారు-అనేది ఇచటి వస్తుతత్త్వం. ఆ దశకంలోని ఏడవ పాశురంలో "ఓ! అందమైన చిన్ని చిలుకా! ఏదో ఒక విధంగా ప్రయాసపడి ఆ క్షేత్రాన్ని ప్రవేశించి నా సందేశాన్ని తెల్పు" అని సందేశం పంపబడింది. ఇక్కడ "ఏదో ఒక విధంగా ప్రవేశించి" అని అనడంలో ఏమి తాత్పర్యం? - అని విమర్శించి నిపుణంగా, సమంజసంగా గురు సార్వభౌములు వ్యాఖ్యానించారు. మొట్టమొదటి వ్యాఖ్యాత అయిన కురుకేశులు (తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్) 'తిరువణ్ వండూర్ క్షేత్రంలోని ఉపవనాల మనస్సును దోచే అందంలో అవగాహించకుండా ఏదో ఒక విధంగా వెళ్ళు' అని వివరించారు. దృష్టిని, మనస్సును అపహరించే అందంలో చూపు, మనస్సు ప్రవేశించకుండా నిలుపడం ప్రయాస సాధ్యమే కద!

ఇక, నంజీయర్ వ్యాఖ్యలో దీనికి పర్యాయంగానే వ్యాఖ్యానింపబడింది. ఇక, సుప్రసిద్ధ వ్యాఖ్యానరత్నంలో పూర్వం తెలుపబడిన అర్థాన్ని అర్థసంవాదాన్ని (సామ్యాన్ని) కల్గిన ప్రమాణాన్ని ఉట్టంకించడం ద్వారా మఱింత స్వాదువుగా చేస్తూ నమ్పిళ్ళై గురుచరణులు **"సరాంసిచ సుఫుల్లాని"** అనే ప్రకృత శ్లోకరత్నాన్ని ఉదాహరించి ఈ విధంగా వ్యాఖ్యానించారు కూడ. **'నిరీక్షమాణాః'** ఇత్యాది - దారిలో గమనించకుండా వెళ్ళారు - అని అర్థం. ఎందువల్ల? కార్యవశం చేత - అని అర్థం. ఈ విధంగానే 'తిరువణ్వండూర్ క్షేత్ర పరిసరంలో కూడ అక్కడి మార్గంలోని భోగ్యత అపరిచ్ఛిన్నమైనది కనుక దానిని వేగంగా దాటి పోవడం వీలుకానిదే కాగలదు. కాని, కార్యవశం చేత

ఏదో ఒక విధంగా అతిక్రమించి నీవు వెళ్ళాలి' అని రసఘనంగా వివరణాన్ని అనుగ్రహించారు. అటువంటి ఆచార్య దివ్యసూక్తులలో లభించే అర్థరత్నాలే ఈ గ్రంథంలో ఎక్కువగా ఆదరింపబడతాయి. ఇక శ్రీరామచంద్రుని గుణవిశేషాలు నానా విధాలుగా విమర్శించడం ద్వారా అనుభవింపబడతాయి.

## ఉపోద్ఘాతం సంపూర్ణం



**శ్రీమతే రామానుజాయ నమః**
**శ్రీమద్వరవరమునయే నమః**



# వాల్మీకి వాగమృతమ్

## శ్రీరామచంద్రుని వీర్యగుణానుభవం

భగవంతుడైన శ్రీరామభద్రుని జగద్విఖ్యాతమైన గొప్ప వీర్యగుణాన్ని ఉద్దేశించి ముందుగా మన అనుభవ ప్రవాహం నిర్గతమవుతున్నది (ప్రసరిస్తున్నది).

లోకంలో యుద్ధ రంగంలో అగ్రేసరులు, వీరపుంగవులైన పురుషులను ఉద్దేశించి పలికే కవివరేణ్యులు వారిని "వీరుడు, శూరుడు, పరాక్రమవంతుడు" అని మూడు విధాలుగా వ్యవహరిస్తున్నారు.

ప్రత్యర్థుల సేన బలమైనది అయినా, ఏ మాత్రం జంకు గొంకు లేకుండా ఉండడం, శత్రుసైన్యం బలమైనది అయినా అందులోకి ఏకాకిగా ప్రవేశించి యుద్ధం చేయడం, ఆ విధంగా యుద్ధం చేసేటప్పుడు తనకు కొంచెం అయినా భంగం కలుగకుండా, శత్రువులకు సర్వాంగీణమైన భంగాన్ని కల్గించడం - అనే ఈ మూడు పైన తెల్పిన శౌర్య, వీర్య, పరాక్రమ శబ్దాలకు అర్థం. ఇటు వంటి మూడు విధాలైన సామర్థ్యం యథా యోగ్యంగా వీరులు, శూరులు, పరాక్రమవంతులని ప్రసిద్ధులైన యుద్ధరంగ పుంగవులలో తప్పక గోచరిస్తుంది.

ఈ సామర్థ్య త్రయం పుష్కలంగా, శ్రీరామాయణంలో

ప్రతిపాదింపబడే ప్రభావ విశేషాన్ని కల్గిన భగవంతుడైన శ్రీరామచంద్రునిలో ప్రకాశిస్తున్నది. అందు వల్లనే, శ్రీరామాయణంలో, శ్రీరామచంద్రుని ప్రభావాన్ని తెలిపే అన్య గ్రంథాలలో కూడ మహా వీరుడని, మహాశూరుడని, మహాపరాక్రమశాలి అని భగవానుడైన దాశరథి పొగడబడుతున్నాడు. మహాశూరుడు, మహా పరాక్రమవంతుడు అనే వ్యపదేశాల కంటే మహావీరుడనే సంజ్ఞ శ్రీరామచంద్ర భగవానునిలో మిక్కిలిగా ప్రకాశిస్తున్నది. మహాకవి అయిన భవభూతి తాను రచించిన కావ్యానికి **'మహా వీరచరిత'**మనే పేరును పెట్టాడు. శ్రీవేదాంత దేశకులచే రచింపబడిన రఘువీర గద్య ప్రారంభం **"జయ!జయ! మహావీర!''** అని మహావీరశబ్ద ప్రయోగంతో అయినది కద! ఈ రఘువీరగద్యం మహా వీరవైభవమనే పేరునే కల్గి ఉన్నది. వీక్షారణ్యమనే పేరును కల తిరువళ్ళూర్ అనే దివ్యదేశంలోని అర్చామూర్తికి వీరరాఘవుడని పేరు.

శ్రీపరాంకుశ, పరకాల భక్తిసారాది దివ్యసూరులు కూడ రాఘవుడైన సీతాపతి యొక్క అతివృత్తామర, విక్రమ, ప్రతాప విశేషాలను అభివర్ణించి, **"వీర!''** అని పిలిచి సంబోధిస్తున్నారు. విశేషించి, ఇక్కడ ఈ సందర్భంలో ఈ విషయాన్ని గమనించాలి. అది ఏమంటే - రావణుడు తానే స్వయంగా తన మాటలలో **"శత్రోః ప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః"** (శ్రీరామా-యుద్ధ-104-6) (ప్రసిద్ధి చెందిన వీర్య గుణాన్ని కలవాడు, నాకు శత్రువు, తన పరాక్రమాలతో రంజింప చేసేవాడు) అని యుద్ధరంగంలో తన సారథి సమక్షంలో అన్నాడు - అనేది. ఇక్కడ రావణుడు శ్రీరాముని శత్రువుగా నిర్దేశిస్తూనే, **"ప్రఖ్యాత వీర్యస్య"** (ప్రసిద్ధి చెందిన వీర్యగుణం కలవాడు) అని, **"రంజనీయస్య విక్రమైః"** (పరాక్రమాలతో ఆనందింప జేసేవాడు) అని కూడ యుద్ధ రంగంలో అన్నాడు.

దీనిని బట్టి బాగా అర్థమవు తున్నది ఏమంటే - రావణుడు

రాఘవుని యొక్క వీర్యగుణ, పరాక్రమగుణ ప్రభావాన్ని మిక్కిలిగా అనుభవించాడని. లేకపోతే ఇటువంటి మాట వెలువడి ఉండదు. "ఆహా! ఏమి మాట! ఎటువంటి మాట! **"శత్రోః ప్రఖ్యాత వీర్యస్య రంజనీయస్య విక్రమైః"** - అనేది ఎంత గొప్ప మాట! శ్రీరామచంద్రుని వీర్యగుణంలో విస్మితులైన పరమభక్తులు కూడ పలువురు హనుమదాదులైన ప్రముఖులున్నారు కద! వారెవ్వరి నోటి నుండి ఇటువంటి మాట వెలువడ లేదే! ఆశ్చర్యం!

ఈ విధంగా వివరించ దగిన వీర్య, పరాక్రమ గుణశాలి అయిన శ్రీరామచంద్రునిచే వ్యక్తం చేయబడిన వీర్య చరిత్రలు అనేకం ఉన్నా, ఒక చరిత్రను మాత్రం ముఖ్యంగా ఇక్కడ ఉదాహరిస్తాను. (ఈ వృత్తాంతాన్ని యుద్ధకాండ లోని 93వ సర్గలో గమనించవచ్చు.) మూలబలయుద్ధం చాలా భీకరంగా జరిగే సందర్భం ఇది. శ్రీరామచంద్ర భగవానుడు అపుడు ప్రదర్శించిన అతిమానుషమైన అతిదైవమైన విక్రమాన్ని వర్ణించేటపుడు వాగ్మి అయిన వాల్మీకి మునివరుడు కూడ చలించిన వాక్కును కలవాడై తడబడ్డాడు.

**"ఛిన్నం ఛిన్నం శరైర్దగ్ధం ప్రభగ్నం శస్త్ర పీడితమ్, బలం రామేణ దదృశుః న రామం శీఘ్ర కారిణమ్"** (శ్రీరామా-యుద్ధ-93-21) అనే శ్లోకంలో వాల్మీకిముని - శ్రీరామునిచే మిక్కిలిగా కొట్టబడిన రాక్షసుల బృందాలను చూచారని, కాని, గొప్పవేగంతో చక్రం వలె చుట్టూ పరిభ్రమించే శ్రీరాముని ఎవ్వరూ చూడలేక పోయారని మొదట అన్నాడు. తరువాత ఆ వాల్మీకి మునియే **"తే తు రామ సహస్రాణి రణే పశ్యంతి రాక్షసాః"** (ఆ రాక్షసులయితే యుద్ధంలో వేలాది శ్రీరాముని రూపాలను చూచారు) (శ్రీరామా-యుద్ధ-93-36) అని అంటూ వేలాది సంఖ్యలో శ్రీరాముని రూపాలను చూస్తున్నారని అన్నాడు. మళ్ళీ తిరిగి **"పునఃపశ్యంతి, కాకుత్స్థమేకమేవ మహాహవే"** (శ్రీరామా-యుద్ధ-93-26) (మళ్ళీ శ్రీరాముని ఒక్కనిగానే రణరంగంలో



శ్రీ మరకతవల్లీ సమేత శ్రీ విజయరాఘవ పెరుమాళ్ - తిరుప్పుట్కుழி

చూస్తున్నారు) అని అన్నాడు. శ్రీరాముని చూడనేలేదని అనడం, వేల సంఖ్యలో శ్రీరాముని రూపాలను చూచారని అనడం, ఒకే రూపాన్ని చూచారని అనడం కద జరిగింది. ఈ విధంగా పరస్పర విరుద్ధాలైన భాషణాలను పలికే రీతిలో కద శ్రీరాముడు మిక్కిలి ఘోరమైన యుద్ధ కృత్యాలను చేశాడు. ఈ ఉదాహరణం ఒక్కటే చాలు, మహావీరధీర ధౌరేయుడైన రఘువీరుని వీర్యగుణ వైభవాన్ని తెలియడం కోసం.

ఇక్కడ, కొందరు ఈ క్రింది విధంగా సందేహపడవచ్చు. ఏమని? అంటే, మహావీర మహాధీర ధౌరేయుడైన శ్రీరాముడు రావణుని అవలీలగా వధించడంలో సమర్థుడైనా, మిక్కిలి ప్రయాసను అనుభవించాడని శ్రీరామాయణం తెల్పుతున్నదే! ఇది ఏ విధంగా పొసగుతుంది? అనేది ఆ సందేహం. సమాధానాన్ని వినండి. శ్రీరామునకు రావణవధ అనేది ఒక కీటకాన్ని చంపడం వంటిది - అనే విషయంలో ఎవరికీ వేఱు అభిప్రాయం ఉండదు. కిష్కింధాధిపతి, వానరేంద్రుడైన వాలి రావణుని కంటే పదిరెట్లు విక్రమాన్ని కలవాడని ప్రసిద్ధి. హనుమంతుడీ విషయాన్ని గూర్చి రావణునితో **"త్వయా విజ్ఞాత పూర్వశ్చ వాలీవానర పుంగవః, రామేణ నిహతః సంఖ్యే శరేణైకేన వానరః"** (శ్రీరామా-యుద్ధ-51-11) (వానర శ్రేష్ఠుడైన వాలి నీకు బాగా తెలుసు కద! అటు వంటి వాలిని రాముడు యుద్ధంలో ఒకే ఒక్క బాణంతో వధించాడు) అని అన్నాడు. ఇదే విధంగా వేఱొక సందర్భంలో కూడ **"ఏకేనబాణేన హతస్తు వాలీ"** (వాలి అయితే ఒకే ఒక్క బాణంతో వధింపబడ్డాడు) అని అన్నాడు. ఇంతేకాక, ఇంకొక విషయం కూడ. వేయి బాహువులను కల కార్తవీర్యార్జునుడు లంకాధిపతి అయిన రావణుని ఉచ్చావచమైన హింసను పెట్టాడని ప్రసిద్ధి చెందాడు. ఆ అర్జునుడు **"క్రోధాగ్నిం జమదగ్ని పీడన భవం సంతర్పయిష్యన్ క్రమాత్, అక్షత్రామపి సంతతక్షయ ఇమాం**

**త్రిస్సప్తకృత్వః క్షితిమ్"** (దశావతార స్తోత్రము-7) (తన తండ్రి అయిన జమదగ్నిని చంపినందున కల్గిన తీవ్రమైన కోపమనే అగ్నిని క్రమంగా ఉపశమింప జేస్తూ, ఈ భూమిని ఇరవై ఒక్కమార్లు అక్షత్రంగా - క్షత్రియులు లేని దానినిగా చేశాడు) అని కీర్తింపబడిన పరశురాముని చేత బాహు వనచ్ఛేదన పూర్వకంగా చిత్రవధ చేయబడ్డాడనే విషయం మిక్కిలి ప్రసిద్ధం. అటువంటి పరశురాముడు సీతారమణుని సమక్షంలో ఎటువంటి దశను పొందాడు? - అనే విషయం లోకానికి తెలియనిది ఏమీ కాదు. అందువల్ల, పరశురాముని, కార్తవీర్యార్జునుని, వాలిని లెక్కించినపుడు లంకాధీశుడైన రావణుడు స్మరణను కూడ రావడానికి యోగ్యుడు కానపుడు, పరశురాముని జయించినవాడు, వాలిని వధించినవాడైన భగవంతుడైన రాఘువునకు అల్పుడైన రావణుడెంతటి వాడు? కీటకం కంటే కూడ తక్కువ వాడనేది నిజం. అయినప్పటికీ, అతనిని వధించడంలో శ్రీరాముడు చాల ప్రయాసపడినట్లు కన్పించే కథాశరీరం వివేకులచేత విమర్శించదగినది.

ఈ విషయాన్ని బాగా విమర్శించి చూచినపుడు, వ్యక్తమయేది ఏమి? అంటే అతి సరళమైన, సరసమైన హృదయాన్ని కల శ్రీరాముడు, రావణుడు ఘోరమైన అపరాధాన్ని చేసినా, అతనిని వధించాలనే అభిప్రాయం వెంటనే కలుగలేదు. ఏ రీతిలో అయినా, అతనికి తనపట్ల ఆభిముఖ్యం కలుగు తుందేమో? అనే బలమైన ప్రత్యాశ శ్రీరామునకు ఉన్నదని స్పష్టంగా తెలుస్తున్నది. ఈ విషయం ఏ విధంగా తెలుస్తున్నది? అని అంటే, వినండి.

వానరసైన్యంతో కూడిన శ్రీరాముడు సముద్రతీరాన్ని చేరినపుడు, రావణుని తమ్ముడు విభీషణుడు **"నివేదయత మాం క్షిప్రం విభీషణ-ముపస్థితమ్, సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** (శ్రీరామా-యుద్ధ-1-17) (సమస్తలోకానికి శరణు పొందదగినవాడు, మహాత్ముడైన

శ్రీరామునితో విభీషణుడనే పేరును కల నేను వచ్చానని వెంటనే నివేదించండి) అని పెద్దగా ఆక్రోశిస్తూ సమీపించాడు. అపుడు, విభీషణుడు అంగీకరించదగినవాడా? కాడా? - అనే విషయాన్ని గూర్చి పలు రీతులలోని వాదాలు జరిగినపుడు, 'విభీషణుడు అంగీకరించదగిన వాడు కాడ'నే వాదం బలంగా సుగ్రీవాదులచే వాదించ బడింది. అపుడు పరమపురుషుడైన శ్రీరాముడు **"మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** (శ్రీరామా-యుద్ధ-18-3) (మిత్ర భావంతో నాదగ్గరికి వచ్చినవానిని నేను ఏ రీతిలోను విడువను) అని ప్రతిజ్ఞ చేసి, అతనిని తన వద్దకు తీసికొని రమ్మని ఆ సుగ్రీవునితోనే **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా"** (శ్రీరామా-యుద్ధ-18-34) (ఓ వానరశ్రేష్ఠా! ఈ విభీషణుని నా దగ్గరకు తీసికొనిరా. అతనికి నేను అభయాన్ని ఇచ్చాను) అని పల్కి ఆదేశించాడు. ఆ శ్లోకంలోని ఉత్తరార్థంలో దృష్టిని సారించి చూడండి. **"విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** (శ్రీరామా-యుద్ధ-18-34) అని కద ఆ శ్లోకంలోని ఉత్తరార్థం ఉన్నది. దీని భావం ఏమంటే ఓ సుగ్రీవా! ఇపుడిక్కడకు శరణాగతుడనే పేరుతో వచ్చి, ఆకాశంలో ఉండేవాడు విభీషణుడో లేక రావణుడో నాకు తెలియదు. విభీషణుడు వచ్చాడని మీరు చెప్పినందున, నేను కూడ విభీషణుడు వచ్చాడని విశ్వసించి, అతనిని అంగీకరించాలని అన్నాను. ఒక వేళ విభీషణుడు రాకుండా, విభీషణుని పేరుతో రావణుడే వచ్చాడని సిద్ధించినా, అపుడైనా, అతనిని అంగీకరించే విషయంలో మళ్ళీ ఇంకొకసారి చర్చించే అవకాశం లేదు. వచ్చినవాడు విభీషణుడు కానీ, లేక రావణుడే కానీ ఏమయినా ఈ విషయంలో నాకు తేడా లేదు. వచ్చినవాడు రావణుడే అయితే, **"మనోరథానా మతటాః ప్రవాహాః"** (కోర్కెల ప్రవాహాలు తీరం లేనివి - అంటే - అంతులేనివి) అనే రీతిలోని నా మనోరథాలు ఫలిస్తాయని సంతోషపడవలసి ఉన్నది. విభీషణుని పరిగ్రహిస్తే, అతని అనుచరులైన నల్గురు

రాక్షసులకు మాత్రమే ఉజ్జీవనం కల్గుతుంది. లంకేశ్వరుడైన రావణుని పరిగ్రహిస్తే మాత్రం లంకలోని రాక్షసులందరికి ఉజ్జీవనం లభిస్తుంది - అనే ప్రత్యాశ శ్రీరాముని మనస్సులో ఉన్నందు వల్లనే అతడు ఈ విధంగా అన్నాడని సారతత్త్వవిదులైన మన పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు. ఇది చాలా పొసగే నిజమైన వివరణం. లేకపోతే, **"యదివా రావణః స్వయమ్"** (వచ్చినవాడు స్వయంగా రావణుడే కానీ) అనే మాటలోని సామంజస్యం ఏమీ ఉండదు కద! ఆ విధంగా పల్కడానికి ప్రసక్తి కూడ ఏమీ ఉండదు. రావణుని సముజ్జీవనాన్ని గూర్చి సదా మనస్సులో ఆలోచిస్తూ ఉండే శ్రీరాముడు ఈ విధంగా పల్కడం చాలా యుక్తం కద!

రావణుని సంహరించడంలో శ్రీరాముడు చాల ఆలస్యాన్ని చేశాడనే కారణం చేత, సాటి మేటి ఏదీ లేని విక్రమాన్ని కల్గిన ఆ స్వామి విక్రమం విషయంలో శంకాకళంకం లేశం అయినా కలిగే అవకాశం లేదని సోపపత్తికంగా పల్కుతాను, వినండి. పంచవటిలో ముక్కు చెవులు కోయబడిన శూర్పణఖ ఎపుడు ఖరదూషణుల వద్దకు వచ్చి విలపించిందో, అపుడు జనస్థానంలో నివసించే పధ్నాలుగు వేల మంది రాక్షసులు శ్రీరామునితో యుద్ధానికి సన్నద్ధులయ్యారు. మహర్షి ఆ సందర్భంలో **"చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమ కర్మణామ్, ఏకశ్చ రామో ధర్మాత్మా కథం యుద్ధం భవిష్యతి?"** (భయంకరమైన కృత్యాలను చేసే రాక్షసుల సంఖ్య పధ్నాలుగు వేలు. కాని, రాముడు ఒక్కడే, ధర్మాత్ముడు కూడ. వీరి మధ్య యుద్ధం ఏ విధంగా జరుగుతుందో కద!) (శ్రీరామా-యుద్ధ-94-14) అని విహ్వలుడై పలికాడు. ఆహా! అపుడేమయినది? **"వితత్య చ ధనుర్భీమం తూణ్యోశ్చోద్ధృత్య సాయకాన్, క్రోధమాహారయత్తీవ్రం వధార్థం సర్వరక్షసామ్"** (శ్రీరామా - యుద్ధ -24-33) (భయాన్ని కలిగించే వింటిని విస్తృతం చేసి (చాచి, నారిని

సంధించి) అక్షయ తూణీరాల నుండి బాణాలను బయటకు తీసి, రాక్షసులను అందరిని సంహరించడం కోసం కోపాన్ని తనలో రాముడు ఆరోపించుకొన్నాడు), **"చతుర్దశ సహస్రాణి రక్షసాం భీమకర్మణామ్, హతాన్యేకేన రామేణ మానుషేణ పదాతినా"** (శ్రీరామ-యుద్ధ- 26-35) (భయంకరమైన పనులను చేసే రాక్షసులు పధ్నాలుగు వేలమంది మానవుడు, పాదచారి, ఒంటరివాడైన శ్రీరామునిచే వధింపబడ్డారు) అనే రీతిలో ఆ గొప్ప యుద్ధం పరిసమాప్తమైనది. ఈ సందర్భంలో శ్రీరాముని అసహాయ శూరత్వం, అనపాయ సాహసత్వం కూడ వ్యక్తమైనది. అటువంటి సాటి లేని మహా బలశాలి అయిన శ్రీరాముని మనస్సుకు రావణుడు గడ్డిపోచకంటే అల్పుడని వేయిసార్లు పల్కినా, ఆ మాట పునరుక్తి కాబోదు. ఆ రావణుని అవలీలగా వధించడంలో నిపుణుడైనా, రఘువీరుడు, ఏ విధంగా నైనా అతనిలో తన పట్ల ఆభిముఖ్యం కల్గుతుందేమోననే ఎదురు చూపు కారణంగానే అతనిని వధించడంలో ఆలస్యం చేశాడు అనే సారవిదులు పలికే సిద్ధాంతం చాల అందమైనది.

ఇక్కడ, రస్యతమమైన ఈ అర్థాన్ని అవధరించండి. యుద్ధ కాండలో **"మరణాంతాని వైరాణి నిర్వృత్తం నః ప్రయోజనమ్, క్రియతామస్య సంస్కారో యథా హ్యేష తథా మమ"** (శ్రీరామా-యుద్ధ-109-25) (వైరికృత్యాలు మరణాన్ని అవధిగా కల్గినవి. మన ప్రయోజనం సిద్ధించింది. విభీషణా! ఇతనికి చరమ సంస్కారాలను నిర్వర్తించు. ఇతడు నీకు ఎటువంటివాడో, నాకు కూడ అటువంటివాడే) అనే శ్లోకం శ్రీరాముడు విభీషణుని ఉద్దేశించి పల్కినది. రావణుడు మరణించాడు. అతనిని చరమ సంస్కారాలను చేసేవాడు విభీషణుడు తప్ప ఇంకొకడు లేడు. రావణుని పుత్రులు, పరిజనం అందఱు అతని కంటే ముందుగానే మరణించారు. విభీషణుడే ఆ కర్తవ్యాన్ని నిర్వహించవలసి ఉన్నది. కాని, విభీషణుడు మహాపాపి అయిన ఇతనికి నేను

చరమ క్రియలను చేయననే పట్టుపట్టుకొని ఉన్నాడు. ఆ సందర్భంలో అతనిని ఉద్దేశించి శ్రీరాముడు - **"మరణాంతాని వైరాణి"** ఇత్యాదిగా అన్నాడు. సంస్కృత భాషతో పరిచయాన్ని కల ప్రాజ్ఞులు ఇంచుమించుగా అందఱు శ్రీరామాయాణ పారాయణ ప్రవణులై ఉంటారు. వారంతా ఈ శ్లోకానికి ఏమని అర్థం తెల్పుతారు? అంటే -

"లోకంలో ఆయా వ్యక్తులను ఆయా జనులతో ఏదో ఒక కారణం వల్ల కలిగిన వైరం వారి మరణం వరకు అనువర్తిస్తుంది కద. వైరం ఎవరి పట్ల కలిగిందో, ఆ వ్యక్తి మరణించిన తరువాత, అతని పట్ల ఇంకా శత్రుత్వాన్ని కొనసాగించడం అసమర్థుని కార్యం కద! ఆ విధంగానే, మాకు రావణుని పట్ల కల్గిన వైరం కూడ అతని మరణం పర్యంతం వరకే కొనసాగడం యుక్తం. అతడు మరణించిన తరువాత కూడ ఇప్పటికీ శత్రుత్వాన్ని కొనసాగించడం మనకు తగినది కాదు. **(నిర్వృత్తం నః ప్రయోజనమ్)** - ఈ పాపి దశవదనుని వధించడం, సీతను తిరిగి సొంతం చేసికోవడం - అనేవి మాకు అభిమతప్రయోజనం. ఆ ప్రయోజనం ఇపుడు మాకు సిద్ధించింది. అందువల్ల ఓ విభీషణా! ఇక మేము ఇతని విషయంలో మాత్సర్యాన్ని కల్గి ఉండడం అనావశ్యకమే కద! మాత్సర్యాన్ని కొనసాగించి కద, నీవు 'ఇతనికి నేను చరమ క్రియలను, చేయ'నని అంటున్నావు. ఇది ఎంతమాత్రం తగినది కాదు. తగని వైరాన్ని వీడి, చేయవలసిన, చరమ క్రియలను ఓ విభీషణా! నిర్వర్తించు" అని శ్రీరాముడు అంటున్నాడని ఇంచుమించుగా అందఱు పౌరాణికులు పురాణ మండపాలలో వివరిస్తారు. సంస్కృత భాషా విదులైన వారందరి మనస్సులో ఈ శ్లోక భావం ఈరీతిలోనే భాసిస్తుంది. ఏ మాత్రం తగని ఈ వ్యాఖ్యానం శ్రీరామచంద్రుని అభిప్రాయానికి విరుద్ధమేనని తలచిన మన పూర్వాచార్యులలో ఒకరైన నంబిళ్ళై అనే మహాచార్యులు భగవద్విషయమనే తిరువాయ్ మొழி

దివ్యప్రబంధ వ్యాఖ్యానంలో ఈ శ్లోకానికి పారమార్థికమైన, అత్యంత మధురమైన అర్థాన్ని అనుగ్రహించారు. ఆ వ్యాఖ్యానం ఇక్కడ వివరింపబడుతున్నది

గడచిన కాలంలో, రావణుడే శ్రీరాముని పట్ల వైరాన్ని కల్గి ఉండేవాడు తప్ప, రావణుని పట్ల శ్రీరాముడు కొంచెం కూడ శత్రుత్వాన్ని కలవాడు కాదు. **"త్వాం తు ధిక్! కులపాంసనమ్"** (శ్రీరామ-యుద్ధ-16-16) అని ఈ రీతిలో రావణునిచే ధిక్కరింపబడిన విభీషణుడు ఎపుడు శ్రీరాముని శరణు వేడాడో, అపుడు ఇతనిని పరిగ్రహించడం న్యాయమా? కాదా? అని విమర్శించి చూచి, ఇతనిని పరిగ్రహించడమే న్యాయమని నిశ్చయించుకొని, **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్త మస్యాభయం మయా"** (శ్రీరామ-యుద్ధ-18-34) (ఓ వానర శ్రేష్ఠా! ఈ విభీషణుని తీసికొనిరా. ఇతనికి నేను అభయం ఇచ్చాను) అని అంటూ సుగ్రీవుని శ్రీరామచంద్రుడు ఆజ్ఞాపించాడు. **"విభీషణో వా సుగ్రీవ! యది వా రావణః స్వయమ్"** (శ్రీరామా-యుద్ధ-18-34) (సుగ్రీవా! వచ్చినవాడు విభీషణుడు కానీ, లేక, స్వయంగా రావణుడే కానీ) అని శ్రీరాముడన్నాడని పూర్వం వివరింపబడిన విషయాన్ని మఱువకూడదు. రావణుని తమ్ముడైన విభీషణుడు శరణాగతుడై ఇచటకు వచ్చాడని మీరు చెప్పినందున, ఆ కారణంగా, విభీషణుని తీసికొని రమ్మని నేను అనలేదు. ఒకవేళ రావణుడే మారువేషంలో విభీషణుని రూపంలో వచ్చి ఉండవచ్చు. అయినా, అతడు పరిగ్రహింప దగినవాడా? కాదా? అనే మళ్ళీ ఇంకొక చర్చను చేయనక్కరలేదు. ఒక వేళ రావణుడే అయినా, ఏ అడ్డు లేకుండా, ఏ విచారణ చేయకుండా అతనిని తీసికొని రండి - అని కదా శ్రీరాముడన్నాడు. అటువంటి శ్రీరాముని అభిప్రాయానికి తగినట్లుగా కద వ్యాఖ్యానించాలి. ఆ వ్యాఖ్యానం అయితే, ఇది.

"ఓ విభీషణా! ఈ రావణుడు జీవించి ఉండగానే ఇతనికి కొన్ని

ఉపకారాలను చేయాలని నేను చాల కుతూహలపడ్డాను. కాని, ఇతడు అయితే అటువంటి అవకాశాన్ని నాకు ఏమాత్రం ఇవ్వలేదు, సరికద!, ద్వేషకార్యాలనే చేస్తూ వచ్చాడు. ఋషుల విషయంలో చాల అపచారపడ్డాడు. వైదేహిని దొంగిలించాడు. నాకు ప్రాణసమానుడైన, భగవానుడైన జటాయువును వధించాడు. ఇటువంటి శత్రుకార్యాలను ఇతడు తన మరణం వరకు చేయగలిగాడు. కాని, ఇకపై ఇటువంటి వానిని చేయలేడు**"** అనే అర్థాన్ని కల్గినది **"మరణాంతాని వైరాణి"** అనే ఈ సూక్తి. **'వైరాణి'** - అంటే వైరికృత్యాలని అర్థం. ఈ విధంగా అర్థం చెప్పకపోతే, **'వైరాణి'** అనే పదంలోని బహువచనానికి స్వారస్యం ఉండదు.

ఇక, **"నిర్వృత్తం నః ప్రయోజనమ్"** అనేదే ఇక్కడ ఈ శ్లోకంలో జీవిత సర్వస్వమైనది. దీనిలోని అర్థతత్త్వాన్ని యథాతథంగా తెలియాలి. "ఈ రావణుని వధయే మాకు ప్రయోజనం, అది సిద్ధించింది" అనే అర్థాన్ని పల్కడం మనస్సులో కూడ స్మరించదగినది కాదు. పూర్తిగా అనవసరమైన అర్థమిది. ఇక, ఆచార్యాభిమతమైన అర్థమేమంటే - ఇది వినండి.

రావణ విషయంలో మేము చేయగోరిన ఉపకారాలకు అతడు అడ్డుపెట్టకుండా ఉండడం మాత్రమే మేము కోరినది. దానినే మేము ఎదురు చూచాము. కాని, ఆ ప్రయోజనం ఇంత వరకు సిద్ధించలేదు. ఇపుడు సిద్ధించింది - అనేది పై సూక్తి భావం.

దీనిని కొంచెం వివరిస్తాను. భగవానుడు జీవులకు హితాన్ని మాత్రమే కల్గించాలనే దీక్షను కల్గి ఉంటాడు. తాను చేయగోరిన హితాలను నిర్హేతుకంగానే చేయగలిగినవాడితడు. **"సర్వజ్ఞోపి హి విశ్వేశః సదా కారుణికోపి సన్, సంసార తంత్రవాహి త్వాత్ రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే"** (లక్ష్మీతంత్రమ్-17-78) (సర్వేశ్వరుడు సర్వజ్ఞుడైనా, సదా సహజమైన కరుణను కలవాడైనా,

సంసారమనే తంత్రాన్ని - వ్యవస్థను - నిర్వహించే వాడైనందున రక్ష్యభూతుడైన జీవుని నుండి రక్షాపేక్ష కోసం ఎదురు చూస్తాడు) అని శాస్త్రంలో చెప్పబడిన రీతిలో జీవుని వద్ద నుండి ఏదో కొంచెం అపేక్షిస్తాడని భాసిస్తుంది. అయితే, భగవంతుడు అపేక్షించే వస్తువు ఏది? - అని అంటే, దానిని విచారించి ఇదమిత్థంగా చెప్పగలిగిన నిపుణులం కాము మనం. కర్మజ్ఞాన భక్తియోగాదులలో దేనినైనా అపేక్షించవచ్చు. అప్రతిషేధాన్ని మాత్రమే ఆశించవచ్చు. భగవత్కృపా ప్రవాహం మనపై పడకుండా ఉండేటట్లుగా మనం స్వచ్ఛందంగా వర్తిస్తే, అదే ప్రతిషేధం అంటే. మన వంటి చేతనుల ప్రతికూల కార్యాలను చూచి భగవంతుడు చాల దుఃఖిస్తాడు. "అయ్యో! ఈ పాపి నా కరుణ ప్రవేశించడానికి కూడ అవకాశం ఇవ్వకుండా అడ్డుపెడుతున్నాడు కద" - అని బాధ పడతాడు. అనుకూల ప్రవృత్తిని కొంచెం కూడ చేయకపోయినా, జీవుడు, ప్రతికూలంగా ప్రవర్తించడం విరమిస్తే, అపుడు భగవదనుగ్రహ ప్రవాహం అప్రతిహతంగా, యథేచ్ఛగా ప్రసరిస్తుంది.

శ్రీవైకుంఠస్తవంలో కూరేశులు **"యద్బ్రహ్మ కల్పనియుతాను భవేప్యనాశ్యం తత్ కిల్బిషం సృజతి జంతు రిహ క్షణార్ధే, ఏవం సదా సకల జన్మసు సాపరాధం క్షామ్యస్యహో! తదభిసంధివిరామ మాత్రాత్"** (శ్రీవైకుంఠ స్తవం -61) (స్వామీ! కోట్లాది బ్రహ్మ కల్పాల కాలం అనుభవించినా తీరని పాపాలను జీవుడు ఒక క్షణంలో సగం కాలంలో చేస్తున్నాడు. ఈ విధంగా సదా సకల జన్మలలో చేసే అపరాధాలను, నీవు కేవలం వారు ఆ పాపాలను చేయకూడదని నిశ్చయించుకొన్న మాత్రంలోనే క్షమిస్తావు కద! ఆహా!) అనే మిక్కిలి మనోహరమైన సూక్తిని పలికారు. ఈ శ్లోకంలోని నాల్గవ పాదంలోని అర్థం మిక్కిలి గమనించదగినది. చేతనుడు పుణ్యాలను చేయవచ్చు, లేక, చేయకపోవచ్చు. పాపకృత్యాలను చేయకపోతే చాలు. తావన్మాత్రంతో

సర్వేశ్వరుడు అనుగ్రహిస్తాడు - అనేది పై కూరేశుల సూక్తిలోని తాత్పర్యం. మనం ఏ విధమైన మంచిని చేయము - అనే విషయం అటు ఉండనివ్వండి. ఆ విషయంలో ఏ చింత లేదు. నారాయణుడైన భగవంతుని కరుణా రసప్రవాహానికి అడ్డుగా ఆ స్వామితో మనం విరోధించి వర్తిస్తే, అపుడు అతడు చాల నిర్వేదాన్ని పొందుతాడు. అటువంటి దుష్ప్రవృత్తిని విరమించినంత మాత్రంతో అమందానందసందోహకందళితాంత స్వాంతుడవుతాడు. అనుకంపావివశుడవుతాడు. రావణుడు సీతను హరించడం, జటాయువును హింసించడం వంటి విపరీత కార్యాలను చేయడంలో నిరతుడై ఉన్నా, ఆ దుష్కార్యాలలో భగవంతుడైన శ్రీరాముడు దృష్టి పెట్టలేదు. **"యో వజ్ర పాతాశని సంనిపాతాన్న చుక్షుభే నాపి చచాల రాజా, న రామ బాణాభిహతో భృశార్తః చచాల చాపం చ ముమోచ వీరః''** (శ్రీరామ-యుద్ధ-59-137) (వజ్రాయుధం దెబ్బకు, పిడుగు పాటుకు కూడ ఏ రావణుడు క్షోభను పొందలేదో, చలించలేదో, ఆ రావణుడు శ్రీరాముని బాణాలతో కొట్టబడినవాడై చాల ఆర్తిని పొంది చలించిపోయాడు. వీరుడైన అతడు తన చేతిలోని వింటిని కూడ విడచివేశాడు) అనే శ్లోకంలో తెలుపబడినట్లుగా, అతడు తన చేతిలో ఉండే వింటిని చేజార్చడాన్ని మాత్రమే చాల గొప్ప మంచి పనిగా తలచిన వాడైన శ్రీరాముడు **"గచ్ఛ అనుజానామి" (శ్రీరామా-యుద్ధ-59-143)** (ఓ రావణా! వెళ్ళు. నీకు అనుమతి నిస్తున్నాను) ఇత్యాదిగా అమృతం వంటి మాటలతో తనదైన దయను ప్రదర్శించాడు. కాని, అయ్యో! ఆ రావణుడెంత మూర్ఖుడు! శ్రీరాముని హృదయాన్ని అర్థం చేసికోలేక పోయాడు కద!

**'గచ్ఛానుజానామి'** అని శ్రీరామునిచే అనుమతించబడి ఇంటికి చేరిన రావణుడు, ఒక వేళ మళ్ళీ యుద్ధానికి సిద్ధమై వచ్చి ఉండకపోతే, అపుడు

దీనదయాళువైన శ్రీరామచంద్రుడు,ఆ రావణునే లంకకు అధిపతిగా చేసి ఉండేవాడు, కాని అటువంటి భాగ్యానికి రావణుడు నోచుకోలేదు. దానికి కారణం మళ్ళీ అతడు రణానికి సిద్ధం కావడమే. కద! ఆ విధంగ అతడు యుద్ధానికి తిరిగి రావడం అనేది భగవానుడైన శ్రీరాముడు చేయగోరిన కృత్యానికి ఆటంకమైనది. ఆ రావణుడే ఇపుడు మరణించినందున ప్రాతికూల్యాన్ని లేశం కూడ ప్రదర్శించలేడు కద! భగవత్ప్రవృత్తికి విరోధి అయిన స్వప్రవృత్తి నుండి ఇపుడు దశాననుడు నివృత్తిని పొందాడు. ఇటువంటి నివృత్తినే పరమ ప్రయోజనంగా తలచే శ్రీరామ చంద్రుడు **"నిర్వృత్తం నః ప్రయోజనమ్"** (శ్రీరామా-యుద్ధ-111-100) (నా ప్రయోజనం సమకూడింది) అని అన్నాడు. నేను చేయగోరిన దయను అడ్డుకోవడానికి ఇపుడు ఏ మాత్రం శక్తి లేనివాడై ఉండే ఈ రావణుని విషయంలో, ఇక మేము చేయదగిన మంచిపని అనేది ఇదే. అది ఏమంటే - ఇతని చరమ శరీరం కాకులు, గద్దలు, రాబందులు తినకుండా ఉండేటట్లుగా, దీనికి చరమ సంస్కారాలను నిర్వహించడం. అందువల్ల ఓ విభీషణా! ఆ సత్కార్యాన్ని నీవిపుడు అనుష్ఠించు. ఒకవేళ నీవు ఈ పనిని చేయకపోతే, నేను ఇతనిని నా సోదరునిగా భావించాను కనుక, నీవు నాకు సోదరుడవు. నీకు సోదరుడైన వాడు నాకు కూడ సోదరుడే, కనుక, నేనే ఈ కార్యాన్ని అనుష్ఠించడానికి సిద్ధమవుతాను - అని పల్కడమే **"మరణాంతాని వైరాణి"** (శ్రీరామా-యుద్ధ-109-25) అనే శ్లోకం ద్వారా సిద్ధిస్తుంది. ఈ విధమైన ఆర్ద్ర హృదయాన్ని కలవాడైనందున, శ్రీరాముడు రావణుని ఒకే బాణంతో క్షణంలో చంపగల్గినవాడైనా, ఆ విధంగా వధించకుండా ఆలస్యం చేశాడు అనేది అతని శౌర్యవీర్య పరాక్రమాలలో తక్కువదనం వల్లకాదు. మఱి ఎందువల్ల? అంటే అతనిలో మార్పు వస్తుందేమోననే ప్రత్యాశ వల్లనే అనేది సిద్ధం. విశ్వామిత్ర మహర్షి, తాను నిర్వహించగోరిన యాగం సుసంపన్నం కావాలనే ఉద్దేశ్యంతో శ్రీరాముని అర్థించేవాడై, దశరథుని వద్దకు వచ్చి **"అహం**

**వేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్"** (శ్రీరామా-బాల-19-14) (నేను, శ్రీరాముని మహాత్మునిగా, సత్యమైన పరాక్రమాన్ని కలవానినిగా తెలిసికొంటున్నాను) అని అన్నాడనేది ప్రసిద్ధం. ఇక్కడ **'సత్య పరాక్రమమ్'** అనే మాటలోని తాత్పర్యాన్ని గమనించాలి. శత్రువులు యుద్ధానికి అనవహితులు (సన్నద్ధులు) కాని సమయంలో వారిని వధించడమనే కుత్సితమైన మార్గాన్ని విడచి, యావచ్ఛక్తి ఆశత్రువు యొక్క ఆభిముఖ్యం కోసం ఎదురు చూచి, అది ఏవిధంగాను లభించనపుడు, చివరకు అతనిని వధించడమే సత్యపరాక్రమమంటే. అటువంటి సత్యపరాక్రమ శాలిత్వం భగవానుడైన శ్రీరామచంద్రునిలో ఏలోటు లేకుండా నిరపాయంగా ఉన్నది. ఈ విషయం ఇంతటితో విరమింపబడుతున్నది.

## శ్రీరామచంద్రుని సౌశీల్యగుణానుభవం

ఇంతకు ముందు శ్రీరామచంద్ర భగవానుడు గొప్ప వీర్య గుణాన్ని కలవాడని నిరూపిస్తూ, ఆ స్వామి వీర్యగుణ కార్య విశేషాలను వివరించడం జరిగింది. అతడు మహా వీరుడైనందున ఎవరూ అతని ఆ గుణాన్ని చూచి భయపడనక్కరలేదు - అని భక్తుల మనస్సును ప్రసన్నం చేయడం కోసం ఇపుడు అతని సౌశీల్య సంపదను అనుసంధించి అనుభవించడానికి ప్రయత్నం చేద్దాం.

శ్రీపరాశర భట్టపాదులు **శ్రీరంగ రాజస్తవం - ఉత్తర శతకంలో "ఆస్తాంతే గుణ రాశివత్ గుణ పరీవాహాత్మనాం జన్మనాం సంఖ్యా"** (శ్రీరంగ రాజస్తవం-ఉత్తర శతకం-74) (నీ గుణ సమూహాలు అసంఖ్యాకాలు అయినట్లే, ఆ గుణ పరీవాహరూపాలైన నీ అవతారాల సంఖ్య కూడ అపరిమితం) అని అంటూ భగవదవతారాలు భగవద్గుణాల ప్రవాహరూపాలని అన్నారు. **"పూరోత్పీడే తటాకస్య పరీవాహః పరిక్రియా"** (ఉత్తర రామచరితమ్ -3-29) (చెఱువులోని నీరు నిండి ఒడ్డు ఒరసి కొని పొంగి పోర్లేటపుడు, నీటిని తూముల ద్వారా ప్రవహింపజేయడమే పరిష్కారం) అనే భవభూతి వచనంవల్ల పరీవాహ శబ్దార్థం బుద్ధిమంతులకు అవగతమే. పెద్ద చెరువులో నీరు నిండిపోయి, పొంగిపొర్లినపుడు, ఆ చెఱువు కట్ట (గట్టు) తెగి పోతుందేమోననే భయంతో వెంటనే అధికంగా ఉండే నీటిని చెఱువు నుండి బయటకు విడిచిపెడతారు. ఇదే పరీవాహ ప్రక్రియ - అనేది అందరికీ విదితమే.

ఈ రీతిలోనే, అఖిలహేయ ప్రత్యనీకుడు, సమస్త కల్యాణ గుణాలకు నిలయుడు అయిన భగవానుడు పరీవాహ ప్రక్రియ అపేక్షించే తన గుణగణాలను బయటకు వ్యక్తం చేయకపోతే తన ఆత్మను (ప్రాణాలను) ధరించడం దుశ్శకమని నిశ్చయించుకొని, భూతలానికి వచ్చి, పలు

అవతారాలను ఎత్తి, తద్ద్వారా తన కల్యాణ గుణ పరంపరను వెలువరిస్తూ ఆత్మధారణను చేయగల్గుతున్నాడు - అనేది వస్తు స్థితి.

ఇక్కడ ఒక ప్రశ్న అడుగవచ్చు. కల్యాణ గుణ గణాలను వెలువరించడానికి అవతారాలను ఎత్తడం ఆవశ్యకమా? అని ప్రశ్నించవచ్చు. నిస్సందేహంగా ఆవశ్యకమే. భూతలానికి వచ్చి అవతరించిన భగవానుడు ఏయే గుణాలను భక్తానుగ్రహ వ్యాజంతో ప్రకాశింపజేశాడో, వాటిలో ఒక్క గుణాన్ని కూడ శ్రీవైకుంఠ దివ్యధామంలో ప్రకాశింపజేయలేడు కద! దయ, క్షాంతి, వాత్సల్యం, మార్దవం, ఔదార్యం మొదలైన గుణాలు పరమ పదంలో ఏ విధంగా ప్రకాశింపజేయడానికి వీలవుతుంది? కొంచెం ఆలోచించండి. అపరాధాలను చేసిన వారిపట్ల, దోషాలను పూర్ణంగా కల్గిన వారిపట్ల, కౌటిల్యం (కుటిల స్వభావం) కల్గిన వారిపట్ల, యాచకుల పట్ల ప్రదర్శించవలసినవి కద పైన పేర్కొన్న గుణ విశేషాలు. రజస్తమస్సులు దూరమైన ఆ లోకంలో అపరాధం చేసిన వారు, దుష్టులు, కుటిలురు, అభ్యర్థులు ఉంటారనేది ఏమాత్రం ప్రసక్తి లేనిది కద! అటువంటి వారి విషయంలోనే అవకాశాన్ని పొంది జీవించి, ప్రకాశిస్తాయి, క్షాంతి మొదలైన కల్యాణ గుణాలు. వారు పరమపదంలో లేనపుడు, అక్కడ క్షాంత్యాది గుణాలు ఏ రీతిలో ప్రకాశాన్ని పొందుతాయి? ఎంతమాత్రం పొందవు.

అందువల్ల, క్షాంత్యాదులైన ఆయా గుణాలు భగవానుని లోపల సాంద్రమైన స్థితిని పొందినవై, పరీవాహ ప్రక్రియ సంభవించక పోతే, తనకు ఆత్మ శైథిల్యం కల్గుతుందేమో? - అనే శంక కల్గడానికి కారణభూతాలై, భగవానుని భూమిపై అవతరించేటట్లు చేస్తాయి. అందువల్లనే భట్టర్ అనే గురుసార్వభౌములు **"గుణపరీ వాహాత్మనాం జన్మనామ్"** అని మిక్కిలి సమంజసంగా వచించారు.

ఒక వైద్యుడు వైద్య శాస్త్రంలో పాండిత్యాన్ని గడించాడు. ఎక్కడో ఒక అగ్రహారంలో స్థిరపడి నివాసాన్ని ఏర్పాటు చేసుకోవాలని తలచి అన్వేషించగా, ఒక అగ్రహారంలో సమర్ధుడైన వైద్యుడెవరూ లేరని తెలిసింది. ఆ అగ్రహారానికి వెళ్ళి అక్కడ నివాసాన్ని ఏర్పరచుకొని, "అన్ని విధాలైన రోగాలకు చికిత్స చేయగల్గినవాడను నేను. ఈ గ్రామంలోని ఈ వీథిలోని ఈ ఇంటిలో నివాసం చేస్తున్నాను. మీకు కల్గిన రోగాలను నా దగ్గరకు వచ్చి నయం చేసికోండి" అని కరపత్రాలను అంతటా పంచాడు. నెల్లాళ్ళు గడిచినా ఒక్క రోగి కూడ అతని దగ్గరకు రాలేదు. అపుడు వైద్యుని మనస్సులో పెద్ద సందేహం కల్గింది. "ఈ అగ్రహారంలో రోగాన్ని కలవారెవరూ లేరా? లేక, వేఱొక వైద్యుడైవడైనా ఉన్నాడా?'' అనే సందేహం ఆ వైద్యుని మనస్సులో మెదిలింది. విచారించగా, ఆ ఊరిలో వైద్యుడెవ్వడూ లేడని దృఢంగా తెలిసింది "అయితే మఱి, ఎందువల్ల రోగులెవరూ నా దగ్గరకు రావడం లేదు?'' అనే వ్యాకులాన్ని పొందిన వైద్యుడు స్వయంగా ప్రతి ఇంటికి వెళ్ళి, అక్కడ ఉండే వారిని "మీ కెవరికీ ఏ విధమైన రోగం లేదా?'' అని అడగడం ప్రారంభించాడు. అందఱు ముక్తకంఠంతో "మహాత్మా! సదాచార్యునిచే సంస్కరింపబడిన అంతః కరణాన్ని కల్గిన మేము శాస్త్రీయమైన మార్గాన్ని అతిక్రమించకుండా వర్తిస్తున్నాము. అందువల్లనే మాకు ఏమాత్రం కూడ రోగం కల్గడం లేదు'' అని బదులిచ్చారు. "ఇక ఇక్కడ నాకు బ్రతుకు తెరువు దొరుకదు'' అని నిశ్చయించుకొన్న ఆ వైద్యుడు వేఱొక గ్రామాన్ని అన్వేషించి, అక్కడకు వెళ్ళిపోయాడు. అక్కడ ఒకటి రెండు నెలల వ్యవధిలోనే చాలా ధనాన్ని గడించి, పలు వైద్యశాలలను నిర్మించి, మహాధనికుడయ్యాడు.

ఈ రీతిలోనే భగవానుడు దివ్యధామమైన పరమపదంలో తనకు గల దయ, క్షాంతి, ఔదార్యం మొదలైన గుణాలను ప్రకాశింపజేసే అవకాశాన్ని

కొంచెం కూడ పొందలేని వాడై ఈ లీలావిభూతిలో అవతరించి, ఒక్కసారిగా అన్ని గుణాల ప్రకాశానికి అవకాశాన్ని మిక్కిలిగా పొంది, తన కల్యాణగుణ ప్రకటనానికి తగిన చోటు ఇదే అని తలచేవాడై, హర్షప్రకర్షతో నిండిన మనస్సు కలవాడై, మాటిమాటికి ఎన్నో అవతారాలను ఎత్తాడు. ఆ విధంగా ఈ లోకంలో భగవానుడవతరించి ప్రకాశింపజేసిన పలు కల్యాణ గుణాలలో సౌశీల్యమనే మంగళకరమైన గొప్ప గుణం ఒకటి. దీనికే శీలమని కూడ ఇంకొక పేరున్నది. **"మహతో మందైః సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్"** (గొప్పవాడు తనకంటే చాల తక్కువ వానితో ఏ విధమైన సంకోచం లేకుండా కలసి వర్తించడం - సౌశీల్యం) అనే నిరుక్తిని సౌశీల్య గుణానికి పూర్వాచార్యులు పలికారు. **"తదా విద్వాన్ పుణ్యపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి"** (పరమ పురుషుని సాక్షాత్కరించుకొన్నపుడు బ్రహ్మజ్ఞాని పుణ్య పాపాలను విదల్చుకొని ప్రకృతి సంబంధం తీరినవాడై, పరమాత్మతో గొప్పదైన సామ్యాన్ని పొందుతున్నాడు) (ముణ్డకోపనిషత్ 3-1-3) అని వేదంలో పల్కిన రీతిలో పరమాత్మతో పరమసామ్యాన్ని పొందే చోటు అయిన దివ్యధామంలో అధముడు ఒక్కడు కూడ ఉండడు కనుక, అధమునిలోనే ప్రకాశింప జేయవలసిన శీలగుణానికి ఆ పరమపదంలో ప్రకాశావకాశం ఏ మాత్రం లేదు అని ప్రత్యకించి చెప్పాలా?

శ్రీమద్వేదాంత దేశికులు అనుగ్రహించిన దయాశతకంలో - **"నిషాదానాం నేతా కపికులపతిః కాపి శబరీ కుచేలః కుబ్జాసా వ్రజయువతయో మాల్యకలదితి, అమీషాం నిమ్నత్వం వృషగిరిపతేరున్నతి మపి ప్రభూతైః స్రోతోభిః ప్రసభ మనుకంపే! నమయసి"** (బోయవానికి నాయకుడైన గుహుడు, వానర ప్రభువు సుగ్రీవుడు, సాటిలేని శబరి, కుచేలుడు, కుబ్జ, రేపల్లెలోని యువతులు, మాలాకారుడు -

అనే వీరి తక్కువ దనాన్ని (పల్లాన్ని), వేంకటాచలపతి యొక్క ఉన్నతిని (మిట్టను) ఓ దయాదేవీ! పుష్కలంగా ఉండే నీ ప్రవాహంతో ముంచెత్తి సమం చేస్తున్నావు. ఉన్నతుడైన స్వామిని, అధములైన వారిని వేగంగా కలుపుతున్నావు) అనే రీతిలో నిజంగానే ఈ లోకంలో నిమ్న జనులు విరివిగా ఉన్నారు. అందువల్ల ఇక్కడే కద సౌశీల్య గుణం మిక్కిలి ప్రకాశించే అవకాశం ఉన్నది. ఆ గుణాన్ని ఇపుడు దర్శించి ఆనందించడానికి ప్రయత్నిద్దాం.

తన, లెక్కకట్టలేని మహిమను గమనించకుండా, జన్మ, గుణం, వృత్తం మొదలైన వానిలో చాల తక్కువగా ఉండే వారితో కలసి వర్తించడంలో ఉత్సుకతను కలవాడు - శ్రీరామచంద్ర భగవానుడు. ఇటువంటి సౌశీల్య గుణ విశేషాలకి అనుగుణంగా ఇక్కడ మనం అనుసంధించు కోదగిన శ్రీరామచరిత్ర విశేషాన్ని ఇక వివరిస్తాను. శ్రీమన్నారాయణుడు ఈ భూమిలో దశరథ నందనుని రూపంలో అవతరించాడు - అనే ఈ విషయమే శీలగుణ పరీవాహ రూపంగా ప్రకాశిస్తున్నది. శ్రీ కూరనాథ గురువరులు తమ **అతిమానుష స్తవంలో**ని పదవశ్లోకంలో **"శీలః క ఏష తవ హంత! దయైకసింధో! క్షుద్రే పృథక్ జనపదే జగదండ మధ్యే, క్షోదీయసోపి హి జనస్య కృతే కృతీ త్వ మత్రావతీర్య నను లోచన గోచరోభూః"** (ఓ దయకు సాటిలేని సముద్రమా! ఆహా! నీ శీల గుణం ఎంత గొప్పదో కద! క్షుద్రమైన ఈ బ్రహ్మాండం లోపల ఎక్కడో హీన జనుల జనపదంలో ఒక క్షుద్రుడైన వాని కోసం ఇక్కడ అవతరించి, ఈ లోకంలోని జనుల నేత్రాలకు కృతకృత్యుడవైన నీవు గోచరుడవయ్యావు) అని అన్నారు. **"నిత్య మింద్రియ పథాతిగం మహః"** (వరదరాజస్తవం-5) (నిత్యం ఇంద్రియాలకు గోచరం కాని జ్యోతిస్సు) ఇత్యాదిగా అతీంద్రియుడుగా కీర్తింపబడే భగవంతుడు ఆసుర స్వభావాన్ని కల సంసారులైన నీచజనుల మధ్యకు వచ్చి, మానవులందరి కన్నులకు గోచరించే స్థితిని పొందాడు - అనేది ఆహా! ఎంత గొప్ప సౌశీల్యానికి స్థానం- అని అంటూ కూరేశులు



శ్రీ హేమాంబుజవల్లీ సమేత కోలవల్లి రామర్ - తిరుప్పుల్లంబూదంగుడి

విద్ధులవుతున్నారు.

అవతారమనే పదం ఉన్నత స్థానం నుండి నీచ స్థానానికి దిగి రావడమనే ప్రసిద్ధమైన అర్థాన్ని కల్గినది. **''రథాదవతరతి, ప్రాసాదాదవతరతి''** (రథం నుండి కిందకు దిగుతున్నాడు, మేడ నుండి కిందకు దిగుతున్నాడు) మొదలైన ప్రయోగాలలో ఈ అర్థం సుగమం. శ్రీవైకుంఠమనే ఉన్నతమైన స్థానం నుండి సంసారమనే అధమాధమ స్థానానికి రావడం వల్ల అవతారమనే పేరు వచ్చిందని - ఇంత మాత్రమే భావించరాదు. ఉత్తుంగమైన స్థితిని విడచి, అధమ స్థితిని స్వీకరించమనేది కూడ అవతరణమని చెప్పబడుతున్నది. భగవానుని ఉత్తుంగ స్థితి ఏది? - అని అంటే, బాహ్యచక్షువులకు భాసించకుండా ఉండడం, అన్ని ప్రదేశాలలో సన్నిహితుడై ఉండడం, అన్ని కాలాలలో ఉండడం, సమస్త వస్తువుల రూపంలో ఉండడం - అనే ఇవి అన్నీ భగవానుని ఉత్తుంగ స్థితులు. వీటిని విడచి పెట్టి, వీటికి సాక్షాత్తు విరుద్ధంగా ఉండే స్థితులను భగవానుడు అవతారావస్థలో పొందుతాడు. **"న మాంస చక్షుభిరభివీక్షతే తమ్"** (తైత్తిరీయ-నారా -11) (ఈ పరమాత్మను మాంస చక్షువులతో దర్శించడం లేదు), **"న చక్షుషా పశ్యతి కశ్చనైనమ్"** (తైత్తిరీయ-నారా-11) (ఎవడూ ఈ పరమాత్మను చక్షువులతో దర్శించడం లేదు) అని ఉపనిషత్తులలో కీర్తింపబడిన ఈ పరమాత్మ అసురులకు, రాక్షసులకు కూడ నేత్ర గోచరుడయ్యాడు. అన్ని దేశాలలో ఉండే ఇతడు "ఇపుడు అయోధ్యలో ఉన్నాడు. ఇపుడు చిత్రకూటంలో ఉన్నాడు, ఇపుడు పంచవటిలో అధివసించి ఉన్నాడు, ఇపుడు కిష్కింధ పరిసరాలలో ఉన్నాడు. ఇపుడు సాగర తీరంలో ఉన్నాడు" అని ఈ విధంగా - పల్కడానికి వీలుగా ఉండేవాడై, ఒకచోట ఉండే సమయంలో ఇంకొక చోటలేడు - అనే జ్ఞానానికి విషయమైనవాడై ఉన్నాడు. అన్ని కాలాలలో ఉండే భగవానుడు "కొంతకాలమే శ్రీరాముడై ఉన్నాడు, కొంత కాలమే శ్రీకృష్ణుడై ఉన్నాడు, **"కృత్వా భారావతరణం గతః**

**సంస్థానముత్తమమ్"** (భూభారాన్ని తీర్చి, తన గొప్పదైన సంస్థానాన్ని చేరాడు), ఇపుడు రాముడు లేడు, కృష్ణుడు లేడు'' - అని మాటకు యోగ్యుడయ్యాడు. భగవానుడు దేశ పరిచ్ఛేద - కాల పరిచ్ఛేదాలను లేనివాడు అని చెప్పబడేటట్లే, వస్తు పరిచ్ఛేదాలను లేనివాడుగా కూడ చెప్పబడుతున్నాడు. వస్తు పరిచ్ఛేద రాహిత్యమంటే - సర్వవస్తు సామానాధికరణ్యానికి అర్హుడై ఉండడమే. ఘటం (కుండ) కూడ భగవానుడే, పటం (వస్త్రం) కూడ భగవానుడే, భిత్తి (గోడ) కూడ భగవానుడే, శుక్తి (ముత్యపు చిప్ప) కూడ భగవానుడే - అని ఈ విధంగా చెప్పడానికి అర్హతను కల్గి సర్వవస్తువుల రూపంలో ఉండే ఇతడు రామకృష్ణాదుల రూపంలో కొన్ని నామాలకు మాత్రం వాచ్యుడై విరాజిల్లాడు. ఈ రీతిలో భగవానుడు తన ఉత్తుంగ స్థితులను విడచి, తక్కువ స్థితులను పొందు రూపంలోని అవతారాన్ని అనుసంధించి కూరేశులు **"శీలః త ఏష తవ హంత! దయైక సింధో!"** (అతిమానుష స్తవం-10) అని హృదయంలో విద్ధులై పల్కడం యుక్తం కద!

శ్రీరామచంద్రునిలోని శీలగుణానికి గహన గోచరుడైన గుహుడు విశేషంగా లక్ష్యమయ్యాడు. అందు వల్లనే ఇంతకు ముందు ఉట్టంకించిన దయా శతకశ్లోకంలో **''నిషాదానాం నేతా''** అని ముందుగా గుహుడు ప్రస్తావింపబడ్డాడు. ఈ గుహుడు గంగాతీరం లోని శృంగి బేరపురానికి అధిపతి. నావికాగ్రేసరుడు. జన్మ వృత్తాదులలో చాల తక్కువ వాడు. సీతతో, లక్ష్మణునితో కలిసి శ్రీరాముడు గుహుని సమీపానికి వెళ్ళినపుడు, ఆ బోయరేడు శ్రీరామ చంద్రుని దివ్యమంగళ విగ్రహ సౌందర్యానికి పరవశుడై, శ్రీరామునకు చేసిన అంగరక్ష చాల ఆశ్చర్యకరమైనది. **శ్రీవచనభూషణ** దివ్య గ్రంథంలోని 147వ, 148వ చూర్ణికలలో ఈ విషయం ప్రస్తావించబడింది. ఆ చూర్ణికలకు ఛాయానువాద రూపాలైన, అస్మదీయ శ్లోకాలు రెండు ఇక్కడ

ఉదాహరింప బడుతున్నాయి.

**సౌమిత్రావతిశంకాఢ్యే శ్రీగుహేప్యతి శంకయా।**
**వ్యాధాః పరికరా స్తస్య రరక్షుః కిల రాఘవమ్॥**
**కదాచిత్తన్ముఖాంభోజే దత్తదృష్టిర్మహాత్మనః।**
**భగవద్దత్త సౌందర్యమేవా కులయత్యహో॥**

అనేవి ఆ శ్లోకాలు. వీటిని కొంచెం వివరిస్తాను.

శృంగి బేరపురంలో లక్ష్మణుని చేత చక్కగా నిర్మింపబడిన పర్ణశయనంలో సీతతో పాటు శ్రీరాముడు శయనించాడు. ఆ స్థితిలో ఏమి అపాయం కలిగే అవకాశమున్నది కనుక. కాని, ఏదో అపాయం కల్గుతుందనే అతిశంక లక్ష్మణునికి కల్గి, చాల జాగరూకుడై, ధనుర్బాణాలను ధరించి, జంగమ ప్రాకారంగా రక్షణ తత్పరుడై, సదా సంచరిస్తూ ఉన్నాడు. ఆ విధంగా చుట్టూ తిరిగే లక్ష్మణుని చూసి గుహుడు "రాముని ఒక భ్రాత తన తల్లి ద్వారా నగరం నుండి గెంటి వేశాడు. ఇంకొక ఈ భ్రాత నిద్రించే దశలో ఏమయినా అపాయాన్ని తలపెట్టవచ్చు.'' అనే అతిశంకతో ఆయుధాలను సిద్ధం చేసికొని లక్ష్మణుని వైపే చూస్తూ, కాపలా కాశాడు. ఈ గుహుని పరివారం అయిన వ్యాధులు "ఈ గుహుడు వనచరుడు; బోయవాడు. శ్రీరాముని విషయంలో ఏమైనా అపాయాన్ని తలపెడితే, ఇతనిని వధిద్దాం'' అని సావధానులై గుహుని గమనిస్తూ, అతనిని వెంబడించారు. ఈ సంఘటన ఎపుడు జరిగిందో, శ్రీరామాయణంలో అపుడు వాల్మీకి దీనిని ప్రస్తావించ లేదు. ఆ తరువాత చిత్రకూటానికి భరతుడు వచ్చినపుడు గుహుడు దీనిని అంతటిని భరతునితో పలికాడు. ఆ రీతిలోనే శ్రీరామాయణం లోని శ్లోకాలు గోచరిస్తున్నాయి.

**నియమ్య పృష్ఠే తు తలాంగుళిత్రవాన్**
**శరైః సుపూర్ణావిషుధీ పరంతపః।**

**మహద్దను స్సజ్యముపోహ్యా లక్ష్మణో**
**నిశామతిష్ఠత్ పరితోస్య కేవలమ్॥** (శ్రీరామా-అయో-87-23)

(శత్రువులను తపింపజేసే శౌర్య పరాక్రమాలను కల లక్ష్మణుడు చేతివేళ్ళకు అల్లెతాడు దెబ్బతగలకుండా ఉండే రక్షణ కవచాలను ధరించినవాడై, వీపు వెనుక అంబులపొదులను రెండింటిని ధరించి, సంధించి గొప్ప ధనస్సును దాల్చి సీతారాములను పరిక్రమిస్తూ ఆ రాత్రి గడపాడు)

**"తతస్త్వహం చోత్తమ చాపబాణ ధృత్ స్థిత్వో భవం తత్ర స యత్ర లక్ష్మణః, అతంద్రిభిః జ్ఞాతిభిరాత్త కార్ముకైః మహేంద్రకల్పం పరిపాలయం స్తదా"** (శ్రీరామా-అయో-83-24) (అపుడు నేను గొప్ప ధనుస్సును, బాణాలను ధరించినవాడనై, లక్ష్మణడున్న చోట నేను కూడ ప్రదక్షిణను చేస్తూ, జాగరూకతతో ఉన్న వారు, సంధించిన ధనుస్సును కలవారైన సహచరులతో పాటు మహేంద్రునితో సమానుడైన శ్రీరాముని అపుడు రక్షిస్తూ ఉన్నాను) అనేవి ఆ శ్లోకాలు.

ఇక్కడ గోవిందరాజీయ వ్యాఖ్యానం గమనించదగినది. **"బాల్యాత్ ప్రభృతి సుస్నిగ్ధః"** (బాల్యం నుండి శ్రీరాముని పట్ల లక్ష్మణుడు మిక్కిలి స్నేహాన్ని కలవాడు) (శ్రీరామా-బాల-18-28) అని శ్లాఘింపబడిన సౌహార్దాన్ని కల లక్ష్మణుని పట్ల కూడ అతిశంకను పొంది గుహుడు శ్రీరామచంద్రుని రక్షించాడు అంటే, అతనికి (గుహునికి) శ్రీరామచంద్రుని పట్ల ఉండే ప్రేమాతిశయాన్ని వాక్కులతో వర్ణించడం సాధ్యమా? ఈ విధమైన, సహజమైన ప్రేమ సంపదను గమనించినందు వల్లనే భగవంతుడైన శ్రీరామచంద్రుడు అతని విషయంలో తన సౌశీల్య గుణాన్ని విశేషంగా ప్రవహింప జేశాడు. వాస్తవానికి గుహుని అన్ని రీతులలోని తక్కువదనం వాచామగోచరం. జ్ఞాన గంధాన్ని ఏమాత్రం లేనివాడు, ప్రాణి హింసాతత్పరుడు, తక్కువ జాతిలో

పుట్టినవాడు - అని చెప్పవలసిన వాడు కద, గుహుడు. ఈ దోషాలలో ఏ ఒక్క దోషాన్ని గమనించినా చాలు, అతనిని అల్లంత దూరంలో పరిహరించాలి కద శ్రీరాముడు. అయినా, ఆ విధంగా చేయకుండా తన పరమ వాత్సల్యగుణంతో దగ్గర చేర్చుకొని, అతని పట్ల గొప్ప సౌహార్దాన్ని కలవాడయ్యాడు. క్షత్రియజాతిలో, సూర్యకులంలో ఇక్ష్వాకు వంశంలో దశరథ చక్రవర్తికి కుమారుడుగా పుట్టినవాడు, సకలైశ్వర్య సంపన్నుడు, సర్వ విద్యా విశారదుడు, మహామనీషి, శత్రువుల విషయంలో కూడ వాత్సల్యాన్ని ప్రదర్శించే వాడు కద, శ్రీరామచంద్రుడు. ఏ అంశలోను శ్రీరామచంద్రునితో సామ్యాన్ని కల్గి ఉండడానికి ఎంతమాత్రం గుహునకు అర్హత లేదు - అనేది నిస్సందేహం. ఇటువంటి గుహుని పట్ల శ్రీరామునకు కల్గిన సౌహార్దం అతి విలక్షణమైనదని భక్త గోష్ఠిలో ప్రసిద్ధమైన విషయం. ఆళ్వారుల దివ్యప్రబంధ వాఙ్మయంలో మొదటి సహస్రంలో ***పెరియాళ్వార్ తిరుమొళి*** (భట్టనాథ సూక్తం)లో హనుమంతుని మాట రూపంలో ఒక పాశుర దశకం ఉన్నది. అశోకవనంలో జానకిని చూచి మారుతి అంగుళీయకాన్ని సమర్పించి, ఆమెకు నమ్మకం కల్గడం కోసం కొన్ని వృత్తాంతాలను చెప్పిన క్రమం అందులో గోచరిస్తుంది. అందులోని నాల్గవ పాశురంలో ఈ మహాసౌహార్ద వృత్తాంతం ప్రస్తుతింపడింది. "గంగానదీ తీరంలో వ్యాధ ప్రభువుతో గొప్పదైన మైత్రిని పొందిన వృత్తాంతాన్ని గమనించు'' అని సీతాదేవితో మారుతి పల్కినట్లుగా ఆ పాశురంలో కన్పిస్తుంది. ఆ మైత్రిలోని శ్లాఘ్యత సహృదయులు భావించగలరు.

గుహుని సాటి లేని ప్రీతిని చూసి శ్రీరాముడు తనపట్ల స్నేహాన్ని పొందాడా? లేక, శ్రీరాముడు తనతో చేసిన స్నేహాన్ని చూచి గుహుడు ప్రేమను కలవాడయ్యాడా? అని కొందరు ప్రశ్నిస్తారు. భగవానుని అంతరంగానికి మాత్రమే గోచరమైన ఈ విషయంలో ఏ సమాధానాన్ని మనం చెప్పగలం?

శ్రీరామచంద్రుడు గంగాతీరానికి వచ్చి చేరాడని విని గుహుడు తన జాతివారితోపాటు అతని దగ్గరకు వచ్చాడనే వృత్తాంతాన్ని వాల్మీకి మహర్షి పల్కుతూ **"తత్ర రాజా గుహో నామ రామస్యాత్మసమ స్సఖా"** (శ్రీరామా-అయో-50-33) (అక్కడ శ్రీరాముని ప్రాణ స్నేహితుడైన గుహుడనే రాజు) అని అన్నాడు. గుహుని విషయంగా మొట్టమొదటి ప్రస్తావన సమయంలోనే **"రామస్య ఆత్మసమః సఖా"** అని ఏ విధంగా అన్నాడు? అనేది ఆశ్చర్యకరమైన విషయం. "శ్రీరాముని ప్రాణస్నేహితుడైన గుహుడు అతని రాకను విని అతని దగ్గరకు వచ్చాడు." అని అనడం వల్ల ఈ ఇద్దరి మధ్య స్నేహం ఇంతకు ముందే ఏర్పడిందని, నవీనం కాదని చెప్పవలసి ఉన్నది. గుహుడు వచ్చి, శ్రీరాముని ఆలింగనం చేసి కొన్నాడని కూడ వాల్మీకి మహర్షి అన్నాడు. **"త మార్త స్సంపరిష్వజ్య గుహో రాఘవ మబ్రవీత్"** (ఆర్తిని పొందిన గుహుడు ఆ శ్రీరాముని ఆలింగనం చేసికొని, అతనితో ఈ విధంగా అన్నాడు) అనేది ఆ సూక్తి. దీని వల్ల కూడ ఈ ఇద్దరి మధ్యలో గల స్నేహం పురాతనమైన దేనని తెలియడం సులభం. కాని, దివ్యసూరుల (ఆళ్వార్ల) సూక్తి వల్ల, కంబ మహాకవి సూక్తి వైఖరివల్ల ఆ మైత్రి అపుడే ఏర్పడినదని తెలుస్తున్నది. ఇతః పూర్వం ప్రస్తావింపబడిన భట్టనాథ సూక్తిలో 'గంగాతీరంలో' అని కద ప్రత్యేకంగా నిర్దేశం చేయబడింది. ద్రావిడ దివ్య కవులలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన కంబకవి తాను రచించిన రామాయణంలోని విభీషణ శరణాగతి ప్రకరణంలో విభీషణునితో శ్రీరాముడు పల్కిన ఒక అపూర్వమైన సూక్తిని ప్రస్తావించాడు. అక్కడ "గొప్ప ప్రేమను, స్నేహాన్ని కల్గిన విభీషణా! దశరథుడు నన్ను అరణ్యానికి ఎందుకు పంపించాడో తెలుసునా? నేను తెలుపుతాను విను. అతడు తనకు కల్గిన నల్గురు కుమారులతో తృప్తిని పొందనివాడై, ఇంకాకొంతమంది పుత్రులను పొందాలని ఆశించి, "నీవు ఇంకా కొంత మంది సోదరులను సంపాదించి తిరిగిరా"అని నన్ను లక్ష్మణునితో పాటు అరణ్యానికి

పంపాడు. మహాత్ముడైన ఆ దశరథుని సంకల్పం చక్కగా నెరవేరింది. గంగా తీరంలో గుహుడు అయిదవ కుమారుడయ్యాడు. అదే విధంగా పంపాతీరంలో సుగ్రీవుడు ఆఱవ కుమారుడయ్యాడు. ఈనాడు నీవు సాగర తీరంలో ఏడవ తనయుడవయ్యావు. ఆహా! ఇటువంటిది కద దశరథ సంతాన సమృద్ధి'' - అని శ్రీరాముడు అన్నట్లుగా కంబ మహాకవి పలికాడు. ఈ విధంగా వర్ణించడం వల్ల ఏమి తెలుస్తున్నది? గుహ, సుగ్రీవ, విభీషణుల పట్ల శ్రీరాముడు భ్రాతృవాత్సల్యాన్ని కల్గిన వాడని కద తెలుస్తున్నది. అటువంటి వారిలో మొదటి వాడుగా కద గుహుడు లెక్కింపబడ్డాడు.

శాస్త్రజ్ఞులకీ సందర్భంలో ఒక సందేహం కలుగవచ్చు. **"హీనప్రేష్యం హీన సఖ్యం హీనగేహనిషేవణమ్"** (హీనులను సేవించడం, హీనులతో స్నేహం చేయడం, హీనుల ఇంటిలో నివసించడం తగనివని తెలుపబడుతున్నాయి) అనేది ఉపపాతకాలుగా పరిగణింపబడుతున్నాయి! ఆ విధంగా ఉన్నప్పుడు, చాల తక్కువ వాడైన గుహునితో ఏ విధంగా కాకుత్థ్సకులతిలకుడైన శ్రీరామచంద్రుడు స్నేహం చేశాడు? ఒకవేళ చేసినా, అది గుణంగా ఏ విధంగా పరిగణింపబడుతుంది? - అనేది ఆ సందేహం. ఇక్కడ సమాధానం వినండి. మనవంటి తక్కువ వారు ఇటువంటి నిషిద్ధ కృత్యాలను చేస్తే అవి పాతకాలే కాగలవు. "తగని పనులను చేశారు. వీరు అయోగ్యులు'' అని పెద్దల చేత నిందింపబడతాము. ఎందుకంటే, మన గొప్పతనం అంతా ఆగంతుకమైనది, అపాయ బహుళమైనది. నిరుపాధికమైన మాహాత్మ్యాన్ని కల్గిన భగవంతుడు చేసే హీన సఖ్యం, హీన దాస్యం, హీనగేహనిషేవణం మొదలైనవి అతని గొప్పతనానికి ఎంత మాత్రం తక్కువ దనాన్ని కల్గించవు, సరికదా, పర్వతాగ్రంపై పెట్టిన గొప్పదీపం వలె గొప్ప ప్రకాశాన్ని కల్గిస్తాయి. హీనులకు దూత్యాన్ని చేయడం, సారథ్యాన్ని చేయడం వల్ల భగవంతునకు పాండవదూత అని,

పార్థసారథి అనే ప్రసిద్ధమైన బంధాలను పొందడమే కాక, ఆ పేర్లతో దివ్యాలయాలలో ఆ స్వామి విరాజిల్లుతున్నాడు; ఆరాధింపబడుతున్నాడు. అందువల్ల **"మహతో మందైస్సహ నీరంధ్రేణ సంశ్లేషః శీలమ్"** (శీలం అంటే - గొప్పవాడు తన కంటే చాల తక్కువ వానితో ఏ విధమైన సంకోచం లేకుండా కలిసి పోవడం) అని చెప్పబడే గుణ విశేషం భగవంతునిలోనే చక్కగా సమన్వయిస్తుంది. శ్రీరామచంద్ర భగవానుడు తన శీలగుణాన్ని పలు చోట్ల పలు సందర్భాలలో ప్రకాశింప చేసినా, గుహ-సుగ్రీవ-విభీషణులనే ముగ్గురు వ్యక్తులలో అతడు చూపిన ఆ గుణవిశేషం ఆర్ద్ర చిత్తాన్ని కల ఆచార్యులచే పలుమార్లు అనుసంధింప బడుతున్నది. వేదాంత దేశికులు దయాశతకంలో **"నిషాదానాం నేతా కపికులపతిః కాపి శబరీ"** (దయాశతకం-65) (బోయరాజు అయిన గుహుడు, వానరాజు సుగ్రీవుడు, గొప్ప ఆచార్య నిష్ఠను కల శబరి) ఇత్యాది శ్లోక రత్నంలో శబరిని కూడ ప్రస్తావించారు. ఆమెను గూర్చి కూడ ఇక్కడ కొంచెం ప్రస్తుతించ దలచాను.

శబరి విషయంలో శ్రీరామచంద్రుడు ప్రకాశింపజేసిన గుణ విశేషం వాల్మీకి రామాయాణంలో విస్తృతంగా తెలుపబడలేదు. అయినా, ఇతర రామాయణాలను ఆధారంగా చేసికొని గాని, వాల్మీకి రామాయణాన్ని గాఢంగా పరికించి గాని మన పూర్వాచార్యులు దీనిని గూర్చి విశేషంగా అనుగ్రహించారు. **శ్రీవచన భూషణ** దివ్య శాస్త్రంలో **"దాశరథి శ్రీశబరి కైయాలే అముదు శెయ్‌దార్"** (దాశరధి శబరి చేతి ద్వారా ఆరగించాడు) అనే చోట వ్యాఖ్యానంలో శ్రీమద్వరవర మునులు ఈ రీతిలో అనుగ్రహించారు. "రఘుకుల తిలకుడు, ఆచార ప్రధానుడైన **"శ్రీరామచంద్ర భగవానుడు శబర్యా పూజిత స్సమ్యక్ రామో దశరథాత్మజః"**(శ్రీరామా-బాల-1-58) (దశరథ కుమారుడైన శ్రీరాముడు శబరి చేత చక్కగా ఆరాధింపబడ్డాడు) అనే సూక్తి క్రమంలో

జాతిలో చాల తక్కువది అయినా, ఆచార్య సేవ అనే పరమధర్మంలో నిష్ఠను కల్గినది, జ్ఞానాధికురాలు, తన జిహ్వతో రుచి చూచి పరీక్షించిన మధుర ఫలాలు, దుంపలు మొదలైన వానిని శ్రీరామునకు సమర్పించాలనే ఆసక్తితో అతని రాకకై నిరీక్షిస్తూ ఉన్నది అయిన శబరి తన ఆదరానికి అనుగుణంగా స్వయంగా తన చేతితో సమర్పించిన ఫలాలను శ్రీరాముడు సాదరంగా స్వీకరించాడు'' అనేది అచటి వ్యాఖ్యానంలోని సూక్తి. ఇక్కడ 'తన జిహ్వతో పరీక్షించిన, మాధుర్యాన్ని కల్గిన' అనే సూక్తిని శ్రీవరవరమునులు మూల ప్రమాణం లేకుండా అనుగ్రహించి ఉండరు. **''శబర్యావూజిత - స్సమ్యక్''** అనే ఈ సంక్షేపరామాయణ వచనంలోని **"సమ్యక్"** అనే పదం ద్వారా ఈ అర్థ విశేషం గ్రహింప బడిందని ప్రాజ్ఞశేఖరులు పల్కుతారు. కానివ్వండి. శ్రీరామచంద్ర భగవానుడు శబరి విషయంలో ఎందు కోసం ఇంతటి శీల గుణాన్ని ప్రకాశింపజేశాడు?- అని కొందరు విమర్శించి పల్కుతారు. వినండి. గుహునితో శ్రీరాముడు కలసినపుడు, గుహుడు కొంత భోజ్య వస్తు సముదాయాన్ని తీసికొని వచ్చి, "దానిని కృపతో నీవు స్వీకరించాలి'' అని అర్థించాడు. అపుడు శ్రీరాముడు పల్కిన ప్రత్యుక్తి ఈ విధంగా ఉన్నది. **"యత్త్విదం భవతా కించిత్ ప్రీత్యా సముప కల్పితం, సర్వం తదనుజానామి న హి వర్తే ప్రతిగ్రహే, అశ్వానాం ఖాతనేనాహ మర్థీ నాన్యేన కేనచిత్, ఏతావతాత్ర భవతా భవిష్యామి సుపూజితః"** (శ్రీరామ-అయో-50-43, 44,45) (నీవు ప్రీతితో తీసికొని వచ్చి సమర్పించిన దీనిని అంతటిని నేను అంగీకరిస్తున్నాను కాని, నేను వానిని స్వీకరించను. నా గుఱ్ఱాలు బడలిక తీరడం వరకే అనే అభిలషిస్తున్నాను తప్ప, అంతకంటే వేఱేమీ కోరను. ఇంత మాత్రం నీవు సమకూరిస్తే నేను నీచే చక్కగా ఆరాధింపబడినవాడను అవుతాను. ఈ వనవాస కాలంలో నేనేమీ ప్రతిగ్రహంగా స్వీకరించను అనే వ్రత నియమం నాకున్నది. ఇక్కడ చూడు. ఆ రథాశ్వాలు చాల దాహాన్ని పొందాయి. వాటి దాహం తీర్చడం కోసమే నేను

ఏమయినా కోరుతున్నాను) అని పల్కి, గుహుడు సమర్పించిన భోజ్యవస్తువులను ఏమీ కూడ శ్రీరాముడు స్వీకరించలేదు. ఈ సందర్భంలో శ్రీరాముడు పల్కిన **"న హి వర్తే ప్రతిగ్రహే"** (నేను ప్రతి గ్రహాన్ని దేనినీ స్వీకరించను) అనే మాట తప్పక అనవలసినదేనా? - అని విద్వాంసులు విమర్శించి చూడండి. గుహుడు మధుపర్కాదులను మాత్రమే తీసికొని వచ్చాడు. అంతకు మించి ధనధాన్యాది వస్తు జాతాన్ని ఏమీ తీసికొని రాలేదు. ఒకవేళ గుహుడు ధనధాన్య వస్త్రాది వస్తు సమూహాన్ని సమర్పించాలనే ఉత్సుకతను ఉన్నవాడైతే, అపుడు శ్రీరాముడు **"నహి వర్తే ప్రతి గ్రహే"** అనే మాటను పల్కడం యుక్తం అవుతుంది. గుహుడు చేసిన మధు సమర్పణాన్ని కూడ శ్రీరాముడు అంగీకరిచలేదంటే ఇది తప్పక విమర్శించవలసిన విషయం. గుహుని సకాశంలో ఈ విధంగా పల్కిన శ్రీరాముడు శబరి వద్ద ప్రతిషేధాజిధాక్షరలేశం కూడ పలుకకుండా, **''అర్చితోహం త్వయా భక్త్యా'' (శ్రీరామా ఆరణ్య-73-26,27)** (నీ చేత నేను భక్తితో సేవింపబడ్డాను) అని అంటూ ఆమె సమర్పించినదానిని సాదరంగా స్వీకరించాడు కద! ఆహా! ఎందుకు ఈ విధంగా చేశాడు? అని అంటే, ఇంతకు ముందు ఉదాహరింపబడిన **శ్రీవచన భూషణ** వ్యాఖ్యాన సూక్తులలో "గురు శుశ్రూష అనే గొప్ప ధర్మంలో నిష్ఠకల్గినది, జ్ఞానాధికురాలు'' అనే సూక్తిని వివరిస్తాను. గురుసేవ అనే గొప్ప ధర్మం శబరిలో ఉన్నది. దీనిని కబంధుడు శ్రీరామునకు తెలిపాడు. **"శ్రమణీ శబరీ నామ కాకుత్థ! చిరజీవినీ, త్వాం తు ధర్మే స్థితా నిత్యమ్"** (శ్రీరామా-ఆరణ్య -74-26,27) (శ్రీరామా! శబరి అనే సన్న్యాసిని ఉన్నది. ఆమె చిరంజీవిని. ఆచార్య నిష్ఠ అనే గొప్ప ధర్మాన్ని కల్గినది. నిన్ను దర్శించాలని కోరుతున్నది) అని, **"శబరీం ధర్మ నిపుణామభిగచ్ఛ"** (గొప్ప ధర్మమైన ఆచార్యసేవలో నిపుణురాలైన శబరి దగ్గరకు వెళ్ళు) అని గల కబంధ వచనాలలోని ధర్మశబ్దం ద్వారా తెలుపబడినది గురుశుశ్రూష అనే పరమ ధర్మమే.

శబరి దగ్గరకు వెళ్ళి, కుశల ప్రశ్నలను అడిగే శ్రీరామచంద్రుడు కూడ **"కచ్చిత్తే గురు శుశ్రూషా సఫలా చారు భాషిణి"** (శ్రీరామ -అరణ్య-74-9) (చక్కగా పలికే ఓ శబరీ! నీ ఆచార్య సేవ సఫలమైనదా?) అని అడిగాడు. ఆమె కూడ తాను చేసే ఆచార్యసేవను గూర్చి ఆనందంగా పల్కింది. **"చక్షుషా తవ సౌమ్యేన పూతాస్మి రఘునందన!, పాదమూలం గమిష్యామి యానహం పర్యచారిషమ్"** (రఘునందనా! నీ చల్లని చూపులతో నేను పవిత్రురాలను అయ్యాను. నేను పరిచర్య చేసిన నా ఆచార్యుల పాద సన్నిధికి నేను వెళ్ళగలను) అనే ఈ శ్లోకం శబరి పల్కిన ప్రతివచనం. ఇక్కడ **"యానహం పర్యచారిషమ్ తేషాం పాదమూలం గమిష్యామి"** (నేనెవరికి పరిచర్య చేశానో వారి పాద సన్నిధిని చేరగలను) అనే మాట చాల గమనించదగినది. ఇటువంటి ధర్మవిశేషం గుహునిలో కొంచెం కూడ లేనందువల్లనే అతడు సమర్పించిన భోజ్యవస్తువులను శ్రీరాముడు స్వీకరించలేదు - అని వివేకాన్ని కల పండితులు చేసిన అర్థనిర్వాహం. ఇక్కడ కొందరు ఇంకొక విధంగా అంటారు. "గుహుడు కూడ శబరి వలె ఫలాదులను ఇచ్చి ఉంటే, అపుడు వానిని శ్రీరాముడు స్వీకరించి ఉండే వాడు. కాని, గుహుడు ఫలాదులను సమర్పించలేదని ఆ సందర్భంలో స్పష్టపడు తున్నది. అందువల్ల గుహుని వద్ద భోజ్య వస్తువులను స్వీకరించపోవడంలోను, శబరి వద్ద భోజ్య వస్తువులను గ్రహించడంలోను ఇంతకు ముందు పల్కిన హేతువు సరికాదు''- అనేది వారి వాదం. ఈవిధంగా వాదించేవారొక విషయాన్ని గమనించాలి. గుహుని వద్ద శ్రీరాముడు పల్కిన మాట ఏమంటే **"న చ వర్తే ప్రతి గ్రహే** అనేది. "ఓ గుహా! నీవు ఫలాలను ఇచ్చి ఉంటే వానిని నేను యథేష్టంగా స్వీకరించి ఉంటాను'' అని ఒకవేళ శ్రీరాముడు పల్కి ఉంటే, అపుడు వారు పలికిన దానికి పస ఉంటుంది. కాని, శ్రీరాముడు ఆ విధంగా పలుకలేదే! **"న చ వర్తే ప్రతిగ్రహే"** అని కద అన్నాడు. ఈ మాటలు గుహుడు సమర్పించిన

వస్తువులను స్వీకరించిటానికి తగిన అధికార పూర్తి అతనిలో లేదు అని శ్రీరాముని తాత్పర్యం.

అయితే, **"ఋజుబుద్ధితయా సర్వమాఖ్యాతు ముపచక్రమే"** (శ్రీరామా-అరణ్యా -17-15) (శ్రీరాముడు ఋజుబుద్ధితో అంతటిని చెప్పడానికి ఉపక్రమించాడు) ఇత్యాదులలో పొగడబడే ఋజుబుద్ధిని కల్గిన స్వభావాన్ని కల్గినవాడైన శ్రీరామభద్రుడు ఏ విధంగా ఋజుత్వం లేని స్వభావాన్ని ఆవిష్కరిస్తూ పలికాడు? ప్రతిగ్రహాన్ని స్వీకరించ కూడదనే నియమాన్ని ఒకచోట ఆవిష్కరించడం, వేరొక సందర్భంలో ఆ నియమాన్ని పరిపాలించాలనే శ్రద్ధ లేకుండా పరిగ్రహణం అనేది కౌటిల్య కృత్యమే కద! శుభగుణ గణనిధి అయిన శ్రీరామచంద్రభగవానునిలో ఇటువంటి దోషం ఏ విధంగా సంభవించే అవకాశం ఉన్నది? - అనే చోద్యం (సందేహం) కల్గుతుంది. ఇక్కడ సమాధానం ఏమంటే - గుహుని వద్ద **"నచ వర్తే ప్రతిగ్రహే"** అని పల్కిన మాటలకు పూర్తిగా నేను ఏ పరిగ్రహాన్ని స్వీకరించను అనే అర్థాన్ని గ్రహించ రాదు. అటువంటి అర్థాన్నే గ్రహించాలనే నిర్బంధం ఆ మాటకు లేదు కద! "గుహా! నీ నుండి ప్రతిగ్రహాన్ని స్వీకరించడానికి నాకు ఆసక్తి లేదు'' అనే అర్థాన్ని ఆ మాటకు గ్రహించడంలో ఏ విధమైన బాధలేదు. గుహుని వద్ద నుండి భోజ్యపదార్థాలను గ్రహించడంలో శ్రీరామునకు ఆసక్తి లేకపోవడానికి ఏమి కారణం? అనే దానికి బదులు ఇతఃపూర్వమే సువిశదంగా తెలుపబడింది. వేదాంత దేశికులు **సంకల్ప సూర్యోదయ**మనే రూపకంలోని ఆఱవ అంకంలో వివేకుని ఆనందమయమైన గానాన్ని ఒక అద్భుతమైన శ్లోకంలో నిబంధించారు. ఆ శ్లోకం ఏమంటే.

**భగవతి భరద్వాజే భుక్తిః తథా శబరీకరే।**

**ప్రభు రనుస్సృతో విశ్వామిత్రః ప్లవంగమ పతిస్తథా।**

**భృగుపతి తపోలూనం దృష్టి ఖగస్య చ దక్షిణా**
**జయతిలలితోత్తుంగా వృత్తిర్దశాస్యరిపోరితి॥**

(రావణుని సంహరించిన శ్రీరాముని వర్తనం సౌమ్య గుణాన్ని, పరత్వ గుణాన్ని ప్రకాశింపజేసేదై సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నది. ఏ విధంగా అంటే - ఒక పర్యాయం భగవానుడైన భరద్వాజ మహర్షి ఆశ్రమంలో భుజించాడు. ఇంకొకసారి శబరి చేతుల మీదుగా భుజించాడు. ఒకసారి ప్రభువైన విశ్వామిత్రుని అనుసరించి వెళ్ళాడు. అదే విధంగా ఇంకొసారి సుగ్రీవుని అనుసరించాడు. ఒకసారి భార్గవ రాముని తపస్సును పోగొట్టాడు. ఇంకొకసారి కాకాసురుని దక్షిణ నేత్రాన్ని పోగొట్టాడు.)

ఈ శ్లోక రత్నంలో ప్రస్తావింపబడిన మూడు విషయాలు చాలా అందమైనవి. శ్లోకంలోని రెండవ, మూడవ విషయాలు అటు ఉండ నివ్వండి. మొదటి విషయం ప్రకృతంలో చాల భోగ్యమైనది. భగవానుడైన దాశరథి పరమ పవిత్రమైన భరద్వాజాశ్రమంలో భుజించాడు. అని ఏ విధంగా మనం వింటున్నామో, ఆ విధంగానే చాల తక్కువ స్థితిని కల్గిన శబరి సమీపంలో కూడ భుజించాడని వింటున్నాము. ఆహా! ఏమి సౌశీల్యగుణ ప్రకాశకమైన వృత్తి - అని అంటూ దేశికులు విద్ధులవుతున్నారు.

శీలగుణనిధి అయిన శ్రీరామునకు చెందిన ఇంకొక వృత్తాంత విశేషం ఇక్కడ స్మరణకు వస్తున్నది. అది ప్రకృతంలో అనుసంధించదగినది. శ్రీవత్సాంక గురువరులు అతిమానుష స్తవంలో - **"కోయం గుణః? కతరకోటిగతః? కియాన్వా? కస్య స్తుతేః పదమహో! కస్య భూమిః"** (అతిమానుష స్తవం -27) ఏమి ఈ గుణం? ఏ గుణ ప్రకారంలో అంతర్భవిస్తుంది? ఎంతటిది? ఎవరు స్తుతించగలరు - అని శ్రీకూరేశులు భావిస్తున్నారు. జగత్పితరులైన దివ్య దంపతులను విడదీయాలని ప్రయత్నించిన రావణుని వెనువెంటనే

వధించవలసి ఉన్నా, పరమకృపతో "ఈ వేళకు వెళ్ళి, రేపు తిరిగిరా'' అని వదలి పెట్టడం నిజానికి ఆశ్చర్యకరం కద! "ఈ గుణం దయాగుణం ప్రకారమే కద! లేక, శీలగుణ ప్రభేదమా?'' అనే వాదం వద్దు. ఈ గుణం **"కతరకోటి గతః"** (ఏ గుణ భేదంలో అంతర్భవిస్తుంది?) అని కూరేశులు స్వయంగా వ్యామోహాన్ని పొంది పలికారు కద! శీలగుణ ప్రకారంలో దీనిని అనుసంధించడం కూడ సముచితమే.

భగవానుడైన శ్రీరామచంద్రుడు వానర ప్రభువైన సుగ్రీవుని విషయంలో కూడ ప్రదర్శించిన శీలగుణం చాల విస్మయాన్ని కల్గిస్తుంది. శ్రీరాముని ప్రతినిధిగా లక్ష్మణుడు హనుమంతుని సమీపంలో పల్కిన వాక్యాలు ఇవి.

**ఏష దత్వా చ విత్తాని ప్రాప్యచానుత్తమం యశః।**
**లోకనాథః పురా భూత్వా సుగ్రీవం నాథ మిచ్ఛతి॥**
**పితా యస్య పురా హ్యాసీత్ శరణ్యో ధర్మవత్సలః।**
**తస్య పుత్రః శరణ్యశ్చ సుగ్రీవం శరణం గతః॥**
**సర్వలోకస్య ధర్మాత్మా శరణ్యః శరణం పురా।**
**గురుర్మేరాఘవ స్సోయం సుగ్రీవం శరణం గతః॥**
**యస్య ప్రసాదే సతతం ప్రసీదేయురిమాః ప్రజాః।**
**స రామో వానరేంద్రస్య ప్రసాదమభికాంక్షతే॥**

(శ్రీరామా-కిష్కంధ-4-18–21)

(ఈ శ్రీరాముడు తన సంపదలను దానం చేసి గొప్పకీర్తిని పొంది, లోకనాథుడై, ప్రస్తుతం సుగ్రీవుని ప్రభువుగా ఆశపడుతున్నాడు. ఇతని తండ్రి, దశరథుడు ధర్మవత్సలుడు, అతడు శరణాగతులకు గొప్ప శరణం. అటువంటి

అతనిని ఎవరు స్తుతించగలరు? ఆహా!)

ఈ మాటలలో మొదట **"అహంచైవ చ రామశ్చ సుగ్రీవం శరణం గతౌ"** (శ్రీరామా-కిష్కింధ-4-17) (నేను, శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందాము) అని అంటూ, తాను కూడ సుగ్రీవుని శరణు పొందినట్లు పల్కిన మాట అటు ఉండనివ్వండి. సౌమిత్రి సుగ్రీవుని మాత్రమే కాక, వానరవీరులందరిని శరణు పొంద నివ్వండి. ఆ విషయంలో ఎవరికీ ఏ విధమైన విచారణ కాని, సంశయం కాని కలుగదు. **"రామః సుగ్రీవం శరణం గతః"** (శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందాడు) అనే మాటను, ఆహా!, మాటిమాటికి లక్ష్మణుడు అన్నాడు కద! ఇంత మాత్రమే కాదు, **"శోకాభిభూతే రామే తు శోకార్తే శరణం గతే, కర్తు మర్హతి సుగ్రీవః ప్రసాదం సహయూధపః"** (శ్రీరామా-కిష్కింధ- 4-24) (శ్రీరాముడు శోకం చేత బాధపడినవాడై, శోకంచే ఆర్తిని పొందినవాడై సుగ్రీవుని శరణు పొంది నపుడు, సుగ్రీవుడు తన సైన్యంతో పాటు సహాయాన్ని చేయడం తగినది) అని పలికాడు. ఆహా! సర్వలోక శరణ్యుడైన శ్రీరాముడీ మాటను విని ఏ విధంగా ఓర్చుకోగలడు? అని ఆలోచించవలసి ఉన్నది కద! వాస్తవానికి శ్రీరాముడు తన వాక్కుతోనే ఈ విధంగా పల్కడానికి గొప్ప ఉత్సాహాన్ని కల్గి ఉన్నాడు. అంటే ఇక ఆలోచించే అవకాశం ఏమున్నది? హనుమంతుని దగ్గర లక్ష్మణుడు పల్కిన అటువంటి ఆయా మాటలను, చెవులతో వింటూ, శ్రీరాముడు అపుడే వికసించిన తామర పూవు వికాసానికి మించిన గొప్ప వికాసాన్ని కల్గిన ముఖాన్ని కలవాడై ప్రకాశించి ఉండి ఉండాలి కద! ఈ విషయంలో మనకు విచారాన్ని కల్గించేది ఏమంటే - లక్ష్మణుడు పల్కిన ఈ మాటలను ఆలకించిన హనుమానుడు "ఆ! సర్వలోక శరణ్యుడైన రాఘవుడు ఏ విధంగా కపి కులంలో ఉద్భవించిన సుగ్రీవుని నాథునిగా కోరుతున్నాడు? పూర్తిగా అనుచితమైన భాషణం కద అది? ఈ

విధంగా నీవు పల్కడం తగదు'' అని కద అనాలి. ఈ రీతిలో అనకుండా, పలకాలనే ప్రయత్నించకుండా, ఈ శరణాగతిని సత్యమైనదిగా, తగినదిగా భావిస్తూ, హనుమంతుడు **"కరిష్యతి స సాహాయ్యం యువయోః భాస్కరాత్మజః సుగ్రీవస్సహా చాస్మాభిః సీతాయాః పరిమార్గణే"** (శ్రీరామా-4-28) (మీ ఇద్దరికి సూర్యపుత్రుడు సుగ్రీవుడు మాతో కలసి సీతను అన్వేషించడంలో సహాయం చేయగలడు) అని అన్నాడు. ఈ మాటలను విని లక్ష్మణుడు శ్రీరామునితో **''కపిః కథయతే హృష్టో యథాయం మారుతాత్మజః, కృత్యవాన్ సోపి సంప్రాప్తః కృతకృత్యోసి రాఘవ! ప్రసన్నముఖవర్ణశ్చ వ్యక్తం హృష్టశ్చ భాషతే, నానృతం వక్ష్యతేవీరో హనూమాన్ మారుతాత్మజః''** (శ్రీరామా-కిష్కింధ-4-31,32) (ఈ వానరుడైన హనుమంతుడు సంతోషించినవాడై నిజం పల్కుతున్నాడు. సుగ్రీవుడు కూడ కార్యార్థియై వచ్చాడు. శ్రీ రామా! నీవు కృతకృత్యుడవయ్యావు. ఈ సుగ్రీవుడు ప్రసన్నమైన ముఖాన్ని, వర్ణాన్ని కలవాడు. స్పష్టంగా పల్కుతున్నాడు. వీరుడు, వాయుపుత్రుడైన హనుమంతుడు అసత్యాన్ని పలుకడు) అని అన్నాడు. ఇక్కడ **"కృతకృత్యోసి"** అనే లక్ష్మణుని మాట నిజంగా మర్మస్పర్శి, సీతాన్వేషణమనే కృత్యం సిద్ధించినట్లేననే అభిప్రాయంలో **"కృతకృత్యోసి"** అని పలుక లేదు. సౌశీల్యగుణా విష్కరణం ద్వారా అవతార ప్రయోజనాన్ని పొందిన వాడవయ్యావు - అనే తాత్పర్యం లోనే **"కృతకృత్యోసి"** అని అనబడింది - అని అనడంలోనే సందేహగంధం లేదు.

ప్రసంగవశాత్తు ఈ విషయాన్ని ఇక్కడ విమర్శించాలి. సీతా విరహంతో చాలా వ్యాకులాన్ని పొందిన శ్రీరామచంద్రునకు సీతాలాభమే కద ఉద్దిష్ట ప్రయోజనం. దాని కోసం వారిని అనుసరించడం అనే ఉపాయం మంచి ఉపాయం కద! **"యామోషధిమి వాయుష్మన్! అన్వేషసి మహావనే!, సా**

**దేవీ మమ చ ప్రాణా రావణేనోభయం హృతమ్"**(శ్రీరామా-అరణ్య-67-15) (ఆయుష్మన్! ఔషధినివలె ఏ సీతను నీవు ఈ అరణ్యంలో అన్వేషిస్తున్నావో, ఆ సీతాదేవిని, నా ప్రాణాలను రావణుడు హరించాడు) అని జటాయువు వల్ల విన్న శ్రీరామచంద్రుడు లంకాప్రభువైన రావణుడే తన భార్యను అపహరించాడని తెలియగలడు. ఆ రావణుడు వాలి చేతిలో అనాయాసంగా పరాజయాన్ని పొందాడని కూడ శ్రీరామునకు తెలుసు. సుగ్రీవుడు పూర్తిగా హీనబలుడని కూడ తెలుసు. ఈ విధంగా ఉన్నప్పుడు, వాలిని విడిచిపెట్టి, దీనులలో అగ్రేసరుడైన సుగ్రీవుని ఎందుకోసం శ్రీరాముడు శరణువేడాడు అని విమర్శించవలసి ఉన్నది. ఇక్కడ చేయవలసిన విపులమైన విచారణను వేరొక ప్రకరణంలో చేస్తాను. **"రామః సుసమర్థః"** అనే శీర్షికలో ఈ విషయం విశదంగా తెలుపబడగలదు. ఇక్కడ సంక్షేపంగా ఒక మాటను పల్కుతాను వినండి. మహాకవివరుడైన వేంకటాధ్వరి **'విశ్వగుణా దర్శచంపూ'** కావ్యంలో వాలిని **"బలోర్మిమాలిని జాగ్రతి సుగ్రీవ మగ్రహీద్య దయమ్, తేన శ్రుతి శత సిద్ధం సువ్యక్తం తస్య దీనబంధుత్వమ్"** (విశ్వగుణా దర్శచంపూ మ-47) (గొప్పబలాన్ని కల్గిన వాలి ఉండగా, శ్రీరాముడు సుగ్రీవుని సహాయంగా పరిగ్రహించి నందున, వందల కొలది శ్రుతులచే సిద్ధమైన శ్రీరాముని దీనబంధుత్వమనే గుణం సువ్యక్తమైనది) అని అన్నాడు. ఇది వాస్తవ వచనం కద! అసహాయశూరుడు, సంకల్పమాత్రంతోనే సమస్త కార్యజాతాన్ని నిర్వహించగల్గిన వాడైన రామచంద్ర భగవానునకు సహాయంగా ఎవరినీ వరించవలసిన అక్కర లేదు. దీనబంధువు, దీనదయాళువు అని ప్రసిద్ధిచెందిన ఇతడు ఆ గుణాన్ని ప్రకాశింపజేయటం కోసమే సుగ్రీవుని నాథునిగా అభిలషించాడు. అంతే.

శ్రీరాముని సౌశీల్య గుణానుభవం సంపూర్ణం. ఇకపై శ్రీరాముని సత్యవాదిత్వమనే గుణం యొక్క అనుభవాన్ని ఆస్వాదిద్దాం.

## శ్రీరామచంద్రుని సత్యవాదిత్వ గుణానుభవం

దశరథ నందనుడైన శ్రీరామచంద్రుని సత్యవాదిత్వం జగత్ ప్రసిద్ధం. దశరథుని సత్యవాదిత్వం కంటే అతని కుమారుడైన శ్రీరాముని సత్యవాదిత్వం అతిశయించి ఉంటుంది. కేవలం నామమాత్రమే దశరథుడు సత్యవాది అనే మాట. ఆ విషయాన్ని గూర్చి తరువాత ప్రస్తావించడం జరుగుతుంది. ఈ సత్యవాదిత్వమనే గుణం మనుష్యగుణాలలో నిస్సమాభ్యధికమైనది. ఈ గుణాన్ని గూర్చి ప్రస్తావిస్తాను. **"అసతి బాధకే సర్వం వాక్యం సావధారణమ్"** (అర్థంలో బాధలేనపుడు వాక్యం అంతా అవధారణంతో కూడినది) అనే న్యాయంలో సత్యాన్ని ఎవడు పల్కుతున్నాడో, అతడు సత్యవాది. పలు అసత్యాల మధ్య ఏదో ఒక సత్యవచనాన్ని పల్కినవాడు సత్యవాది అని అనిపించుకోడు. అయితే, సత్యమంటే ఏమి? అనే విషయాన్ని ముందు గమనించాలి. **"యథాదృష్ట యథాభూతార్థవచనం సత్యమ్"** (వస్తువు ఏ విధంగా చూడబడిందో, ఏ విధంగా ఉన్నదో, ఆ వస్తువును ఆ విధంగా పల్కడమే సత్యం) అని పలువురు నిర్వచిస్తారు. కాని, మహామతులు దీనిని ఆదరించరు. యథాభూతార్థ వచనమంటే - ఏ వస్తువు ఏ విధంగా ఉన్నదో, దానిని ఆ విధంగానే చూచి, ఆ విధంగా దానిని గూర్చి పల్కడమని చెప్పాలి. కాని, పుట్టుకను కలవారికి అన్యథాజ్ఞాన, విపరీతజ్ఞానాదులు సహజంగా కలిగే దోషాలు. ఒక వ్యక్తి రజ్జువును (దారాన్ని) చూచి, అది సర్పమని భ్రమించి, "పాము! పాము!" అని అరుస్తాడు. ఇంకొక వ్యక్తి తెల్లని శంఖాన్ని చూచి కంటి దోషం వల్ల అది పచ్చగా ఉన్నదని తలచి, ఇతరులతో అది పచ్చగా ఉన్నదని అంటాడు. ఈ సందర్భాలలో యథాదృష్టార్థ కథనం - ఏ విధంగా చూచాడో, ఆ రీతిలోనే పల్కడం - అనే దానికి లోటు లేకపోయినా, యథాభూతార్థకథనం - ఏ విధంగా ఉన్నదో ఆ విధంగా పల్కడం అనేది లేదు. అంత మాత్రంలో, తాడును

చూచి పాముగా భ్రమించి "పాము" అని అన్నవానికి, శంఖం పచ్చగా ఉన్నదని భ్రమించి, ఆ విధంగా పల్కినవానికి అసత్యాన్ని పల్కిన దోషం వస్తుందా? వాస్తవానికి ఇక్కడ అసత్యవాదిత్వమనే దానికి అవకాశలేశం కూడ లేదు. భ్రమ అనే దోషం వేరు, అసత్యవాదిత్వమనే దోషం వేరు. ఇంతకు ముందు ప్రస్తావించిన సందర్భాలలో భ్రమరూపమైన దోషం ఉన్నదని చెప్పగలమే తప్ప, అసత్య వాదిత్వ దోషమున్నదని అనలేము. భగవద్గీత - దశమాధ్యాయంలోని నాల్గవ శ్లోకంలో **"క్షమా సత్యందమశ్శమః"** ఇత్యాదిగా ప్రస్తావింపబడింది. ఇక్కడ నిర్దేశింపబడిన సత్యమంటే ఏమి? అనే విషయాన్ని వివరించే రామానుజుల భాష్యం, దానిని విశదం చేసే తాత్పర్య చంద్రికా సూక్తి గమనించదగినవి. సత్యమంటే యథాభూతార్థ కథనం కాదు, యథాదృష్టార్థ కథనమే అనేది భాష్యకారుల భాష్యంలో, దానిని వివరించే తాత్పర్య చంద్రికలో చేయబడిన నిష్కర్షం.

ఇక, యథాదృష్టార్థ కథనమనే విషయంలో కూడ నిష్కర్షించవలసినది ఉన్నది. ఈ యథాదృష్టార్థ కథనం కూడ, ఒక వేళ అది ప్రాణులకు అరుంతుదం (అంటే మర్మచ్ఛేది) అయితే అది సత్యమని పరిగణింపబడదు. వ్యాసస్మృతిలో **"సత్యం భూతహితం ప్రోక్తమ్"** (సత్యమంటే ప్రాణులకు హితమైనదని చెప్పబడినది) అని ఆ రీతిలోనే నిర్వచింపబడింది. చూచిన దానిని చూచినట్లుగా పలికిన వాడొకడు ఒకవేళ ఇతరులకు హితం కల్గించే వాడు కాకపోతే, అంతకుమించి అనర్థాన్ని కల్గించేవాడయితే అతడు అపుడు సత్యవాదిగా పరిగణింపబడడు. **"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్య మప్రియమ్"** (సత్యాన్ని పలుకాలి, ప్రియాన్ని పలుకాలి. ప్రియం కాని సత్యాన్ని పలుకకూడదు) అనే మాట సుప్రసిద్ధమైనది కద! ఇతరులకు ఉద్వేగాన్ని కల్గించనిది ఏదో అదే సత్యం. ఉద్వేగాన్ని కల్గించేది

అయితే అది అసత్యం - అనేది సర్వశాస్త్ర ఘంటాపథం. గీతలోని పదిహేడవ అధ్యాయంలో తపస్సు అనేది శారీరం, వాచికం, మానసం - అని మూడు విధాలైనదిగా పరిగణింపబడుతున్నది; వాటిలో, అనుద్వేగకరమైన మాటను పల్కడమే వాఙ్మయ తపస్సుగా చెప్పబడుతున్నది.

ఇక్కడ పలు సందేహాలు కల్గుతాయి. కొన్నిటిని ప్రస్తావిస్తాను. న్యాయస్థానంలో వ్యవహారాలు జరిగేటపుడు, జరిగిన సంగతిని యథాతథంగా తెలిసి కోవడం కోసం కొందరు యోగ్యులైన మహాత్ములు సాక్షులుగా నిలుప బడతారు. వారు మనస్సాక్షికి అవిరుద్ధంగా యధార్థాన్ని పల్కడం తగినది. ఆ విధంగా వారు పల్కుతారు కూడ. ఆ విధంగా వారు యథార్థాన్ని పల్కడం వల్ల వ్యవహారంలో వాది వైపులో గాని, లేక ప్రతివాది పక్షంలోగాని అనర్థం సంభవించవచ్చు. ఇతరులకు ఉద్వేగాన్ని కల్గించే మాట సత్యమైనా, దానిని పలుక కూడదు - అనేది శాస్త్రార్థమైతే, ప్రామాణికులైన సాక్షులు తప్పక యథార్థాన్ని మరుగుపరచే వారై ఉండవలసి వస్తుంది అని కద పర్యవసిస్తుంది. కాని, ఇది యుక్తం అని చెప్పవచ్చునా? ప్రామాణికులైన సత్పురుషుల ప్రక్రియ ఈ విధంగా కన్పించడం లేదు. మఱి, ఇక్కడ ఏమి సమాధానం? అని అంటే, సమాధానం తెలుపబడుతున్నది.

**"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్యమప్రియమ్"** - అనే వచనం ఈ కాలానికి చెందిన మన వంటి వారిచేత కల్పింపబడినది కాదు. ఇది ఏ విధంగాను అప్రమాణం కాబోదు. కాని, ఇక్కడ ఈ రీతిలో భావించాలి. శాస్త్రార్థాలన్నింటికి అందరు అర్హులు కాలేరు. వాచిక వ్యవహారాలలో స్వాతంత్ర్య - పారతంత్ర్య భేదంలో రెండు రీతులున్నాయి. ఎవరు స్వాతంత్ర్యంతో వాచిక వ్యవహారాలను చేస్తారో, వారు అయితే భూతహిత వచనాన్ని పలికే వారుగా అయినపుడే సత్యవాదులు కాగలరు.

న్యాయస్థానాదులలో సాక్షి స్థానంలో ఉండి వ్యవహారం చేసేవారు స్వతంత్రులు కారు, పూర్తిగా పరతంత్రులే. వాస్తవాన్ని పల్కడం కోసమే కద వారు అక్కడకు పిలువబడతారు. అటువంటి వారు తప్పక యథాదృష్టార్థ వాదులు, యథా భూతార్థవాదులు కావాలి. అక్కడ ఆ విధంగా పల్కడంలో ఏమీ ప్రత్యవాయం లేదు. ఆ విధంగా పలుకకపోయినపుడే గొప్ప ప్రత్యవాయం సంభవిస్తుంది.

ఈ విషయాన్ని గమనించండి. మత ప్రతిష్ఠాపన పరులైన, మహామతులైన మహాత్ములు శాస్త్రార్థ తత్త్వాలను వ్యక్తం చేసే సందర్భాలలో, "ఈ విధంగా పల్కితే ఇతరులకు కంటకంగా ఉంటుంది. మర్మభేది అవుతుంది"- అని తలచి వాస్తవార్థాన్ని దేనినీ దాచిపెట్టరు. వాద ప్రతివాదాలలో, జయించాలనే ఇచ్ఛతో ప్రవర్తించే పండితోత్తములు, ఇతరులకు ఉద్వేగాన్ని కల్గించే మాటలను విడచి పెట్టాలని వివరించారు. **"తన్న, తత్ తుచ్ఛమ్, తత్ అసత్, తత్ పామరాణా మప్యహాస్యమ్"** (అది కాదు, అది తుచ్ఛం, అది వాస్తవం కాదు, అది పామరులు కూడ పరిహసించేది) ఇత్యాదులను పల్కడం ద్వారా ప్రశస్తిని సంపాదించే పండితోత్తముల దగ్గర **"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్ న బ్రూయాత్ సత్యమప్రియమ్"** ఇత్యాది వచనాలు, అయ్యో! ఏ విధంగా పనికివస్తాయి! ప్రాణహింసను చేయకూడదనే శాస్త్రార్థంలో ఎవరికీ వేఱే అభిప్రాయం లేదు. అయినా, శస్త్రం ద్వారా, క్షారం ద్వారా, అగ్ని ద్వారా చికిత్సను చేసే వైద్యుని విషయంలో, పశుమారణ కర్మదారుణుడైన (యాగాలలో పశుమేధాన్ని చేసే) శ్రోత్రియుని విషయంలో, అవినీతుడైన పుత్రుని శిక్షించే తండ్రి విషయంలో, అపరాధాన్ని చేసిన వారిని శిక్షించడానికి సిద్ధపడే ప్రభువు విషయంలో ఆ శాస్త్రార్థం ఏమి చేయగలదు? ఏమీ చేయలేదు కద! ఉత్సర్గాపవాద న్యాయ సంచారం అంతటా సుకరమనే విషయాన్ని తెలియాలి. ఈ విధంగ సత్యవాదులు అప్రియవచనాన్ని విడువడం,



శ్రీ సీతా సమేత శ్రీ రామచంద్ర పెరుమాళ్ - తిరు అయోధ్య

అప్రియ వచనాన్ని గర్జించడం (గట్టిగా పల్కడం) అనే రెండు వ్యవస్థిత విషయాలేనని సిద్ధిస్తున్నది. సామాన్యంగా సత్యాన్ని పల్కడం ద్వారా ఇతరులకు అనర్థాన్ని కల్గించే జనులను సత్యవాదులని ప్రశంసిచరని మాత్రం గ్రహించాలి. ఇక్కడ అయితే, ఎన్నో ఇతిహాస విశేషాలు ఉదాహరించదగినవి ఉన్నాయి. కాని, విస్తరభీతి చేత ఒకే ఒక ఇతిహాసాన్ని ఉదాహరిస్తాను. అది **వీతహవ్య వృత్తాంతం.**

మహాభారతంలోని ఆనుశాసనిక పర్వంలో అష్టమాధ్యాయంలో వీతహవ్యుడనే క్షత్రియుని కథ ప్రసిద్ధం. ఇతడు తన పుత్రులు నూర్గురుతో కలసి యుద్ధంలో శత్రు సమూహంతో పోరాడేటపుడు తన పుత్రులను అందరిని పోగొట్టుకొన్నాడు. తన ప్రాణాలను కాపాడుకోవడం కోసం అతడు పరుగు తీసి భృగుమహర్షి ఆశ్రమంలోకి ప్రవేశించాడు. ఆ మహర్షిని శరణు వేడాడు. దీనదయాళువైన ఆ మహర్షి పరమకృపతో ఆ ప్రభువును అభయాన్ని ఇచ్చి ఆదరించి, ఆసనంలో కూర్చోపెట్టాడు. ఆ వీతహవ్యుని వెంబడిస్తూ ప్రత్యర్థి భూపతి భృగువు ఆశ్రమ పరిసరాలను చేరి, ఆ భృగుమహర్షి శిష్యులను చూచి "ఇక్కడ ఎవరెవరున్నారు? నేను తెలిసికోవాలి. అంతేకాక, భృగుమహర్షిని చూడాలని కోరుకొంటున్నాను. ఈ విషయాన్ని ఆయనికి తెలుపండి'' అని అన్నాడు. ఈ సంగతిని శిష్యుల వల్ల తెలిసికొన్న ముని బయటకు వచ్చి ప్రత్యర్థి ప్రభువును ఆదరించి అర్చించి నీకేమి కావాలని అడిగాడు. అపుడతడు - "ఓ మహా తపస్వీ! నా శత్రువు ఒకడు వీతహవ్యుడనే వాడు ఇక్కడ ఎక్కడో దాగి ఉన్నాడు. అతనిని వెంటనే బయటకు రప్పించాలి. అతనిని నేను వధించాలని అనుకుంటున్నాను'' అని అన్నాడు. అపుడా మహర్షి ఈ విధంగా బదులిచ్చాడు. "ఇక్కడ ఎవ్వరూ క్షత్రియులు లేరు. అందరూ ద్విజులే''. దీని వల్ల ఇక్కడ ఉన్న వారంతా బ్రాహ్మణులే. క్షత్రియుడెవడూ లేడు - అని మహర్షి

చెప్పినట్లయినది. ఈ మాటలను విని శత్రురాజు అక్కడ నుండి వెళ్ళి పోయాడు. వీతహవ్యుడు కూడ ఆపదనుండి రక్షింపబడ్డాడు. ఇంత మాత్రమే కాదు, వీరు అందరూ ద్విజాతులే అనే మహర్షి వచనం చేత ద్విజాతిత్వం వీతహవ్యునకు కల్గింది కూడ. ఆ విషయం అటు ఉండనివ్వండి. ఇక్కడ, "క్షత్రియులెవ్వరూ ఇక్కడ లేరు" అని పల్కిన మహర్షి సత్యవాది అవుతాడా? లేక, అసత్య వాదియా? అని విచారిస్తే అతడు అసత్య వాదియే - అని సామాన్యంగా చెప్పవలసి ఉంటుంది. శరణాగత రక్షణం పరమధర్మం కనుక, శరణాగతునకు ఆపద కల్గించడం మహాపాతకమనే విషయాన్ని గ్రహించిన మహర్షి ఆ విధంగా ప్రత్యుత్తరమిచ్చాడు. "వీతహవ్యుడిక్కడ లేడు" అని సుస్పష్టమైన అబద్ధాన్ని పలుకకుండా, "ఇక్కడ ఉండే వారందరూ ద్విజులే" అని పల్కడం మహర్షి యొక్క గొప్ప చాతుర్యం. ఆ విధంగా పల్కడం నిజానికి పాతకం కాదు. వీతహవ్యునకు ఆపద తొలగి పోవడంతో పాటు, బ్రాహ్మణ్య ప్రాప్తిరూప సంపద్విశేషం కూడ కలగాలని కోరిన మహర్షి పల్కిన వాక్యంలోని చాతుర్యం అసమానం. తైత్తిరీయ యజుస్సంహితలో షష్ఠకాండలో **'తస్మాదపి వధ్యం ప్రపన్నం ప్రతి ప్రయచ్ఛంతి"** అని రెండు మార్లు అధ్యయనం చేయబడుతున్నది. దాని ఉపబృంహణంగానే ఈ ఇతిహాసం ప్రవృత్తమైనది. దీనివల్ల సత్యాసత్యాల స్వరూపం స్పష్టంగా అవగతమైనది.

సత్య స్వరూపం మనవంటి మితమతులచే నిర్ణయించడానికి సాధ్యం కానిది. **"ధర్మస్య తత్త్వం నిహితం గుహాయామ్"** (మహాభారతం-అరణ్య పర్వం-22-6-7) (ధర్మ స్వరూపం చాల రహస్యంగా నిక్షిప్తమై ఉన్నది) అని మహాభారతం పల్కింది. **"సూక్ష్మః పరమ దుర్జ్ఞేయః సతాంధర్మం ప్లవంగమ!"** (శ్రీరామా-కిష్కింధా-18-15) ఓ వానరా! సత్పురుషుల ధర్మం సూక్ష్మమైనది. సులభంగా సాధ్యం కానిది) అని శ్రీరామాయణం అన్నది. ఇక,

శ్రీరామచంద్రుడు తన మాటల ద్వారా వ్యక్తం చేసిన తన సత్య వాదిత్వాన్ని గూర్చి సంగ్రహంగా తెలుపబడుతున్నది.

**"రామో ద్విర్నాభి భాషతే"** (రాముడు రెండు మాటలు పలుకడు) అనే మాట సర్వ విదితం. ఈ సూక్తిలో **రామః** అనే పదం ప్రథమ పురుషలో కన్పిస్తున్నందున ఇది శ్రీరాముని ఉద్దేశించి ఎవరో అన్యులు పలికారని తోస్తుంది. కాని ఆ విధంగా కాదు. ఈ మాట సాక్షాత్తు రాముని మాటయే. **"అహం ద్విర్నాభిభాషేయ"** (నేను రెండు మాటలను పలుకను) అని పలుక వలసి ఉండగా, **"రామో ద్విర్నాభి భాషతే"** అని అనడం ఆ విధమైన ప్రసిద్ధిని వ్యక్తం చేయడం కోసమని తెలియాలి. అయోధ్యా నగరంలో, ఇంకా అంతటి జనులంతా **"రామో ద్విర్నాభి భాషతే"** (అని పల్కుతున్నారని రాముడే స్వయంగా పలికాడని తాత్పర్యం. వనవాసానికి బయలుదేరడానికి ముందు కైకేయి సమక్షంలో శ్రీరాముడు - **"తత్ బ్రూహి వచనం దేవి! రాజ్ఞో యదభికాంక్షితమ్, కరిష్యే ప్రతిజానేచ రామో ద్విర్నాభి భాషతే"** (శ్రీరామా-అయోధ్యా-18-30) (దేవీ! ప్రభువుకు ఏది అభిమతమో దానిని తెలియజేయి. దానిని నేను నిర్వర్తిస్తాను. ప్రతిజ్ఞ చేస్తున్నాను. రాముడు రెండు మాటలను పలుకడు) అని అన్నాడు. తరువాత, కిష్కింధా కాండలో కూడ సుగ్రీవుని ఉద్దేశించి శ్రీరాముడు - **"అనృతం నోక్త పూర్వంమే న చ వక్ష్యే కదాచన, ఏతత్తే ప్రతి జానామి సత్యేనైవ చ తే శపే"** (శ్రీరామా- కిష్కింధా-7-22) (ఇంతకు ముందు నేను అసత్యాన్ని పలుకలేదు. ఇకపై పలుకబోను. దీనిని నీకు ప్రతిజ్ఞ చేస్తున్నాను. నిజంగా నీకు శపథం చేస్తున్నాను) అని పలికాడు. ఇదే రీతిలో మళ్ళీ ఇంకొక సందర్భంలో అతనితోనే పలికాడు.

ఈ సందర్భంలో ఒక సందేహం కల్గుతుంది. శ్రీరాముడు ఈ విధంగా వచించడం ఆత్మ ప్రశంసలోకి రాదా? **"అమర్యాదః క్షుద్రశ్చలమతి**

**రసూయా ప్రసవభూః కృతఘ్నో దుర్మానీ స్మర పరవశో వంచన పరః, నృశంసః పాపిష్ఠః కథమహమితో దుఃఖ జలధే రపారా దుత్తీర్ణస్తవ పరిచరేయం చరణయోః"** (స్తోత్ర రత్నం-62) (మర్యాద లేనివాడను, క్షుద్రుడను, చలించే మనస్సు కలవాడను, అసూయకు పుట్టుక చోటు, కృతఘ్నుడను, దురహంకారం కలవాడను, కామ పరవశుడను, వంచన పరుడను, దయలేని వాడను, పాపిష్ఠి వాడను. ఏ విధంగా నేను ఈ అపారమైన దుఃఖ సముద్రం నుండి దాటిన వాడనై, నీ శ్రీ చరణాలను సేవించ గలను?) ఇత్యాదిరీతిగా నైచ్యాన్ని అనుసంధించడమే కద ఆత్మకు తగిన స్వరూపం. దానికి విరుద్ధంగా తనగుణాన్ని తానే ప్రకటించుకోవడం దోషమే కద! - అనేది ఆ సందేహం. దీనికి సమాధానం ఏమంటే - స్వస్వరూపాన్ని ఆవిష్కరించు కోవడమనేది కొన్ని కొన్ని సందర్భాలలో మాత్రమే అందంగా ఉంటుంది. **'అమర్యాదః క్షుద్రః''** అని అనుసంధించిన శ్రీ యామునాచార్యుల వారే **'మీమాంసా శాస్త్ర యుగ్మ శ్రమ విమలమనా మృగ్యతాం మాదృశోన్యః''** (యామున ముక్తకమ్) (పూర్వ మీమాంస-ఉత్తర మీమాంసా శాస్త్రాలలో పరిశ్రమ వల్ల విమలమైన బుద్ధిని కలవాడు నా వంటి వానిని ఇంకొకనిని అన్వేషించండి) అని అన్నారు. **"న వయం క వయస్తు కేవలం న వయం కేవల తంత్రపారగాః, అపి తు ప్రతివాది వారణ ప్రకటా టోపవిపాటన క్షమాః"** (యామున ముక్తకమ్) (మేము కేవలం కవులము మాత్రమే కాదు; కేవలం శాస్త్రాలలో పాండిత్యాన్ని కలవారము కాదు. ప్రతి వాదులనే మదగజాల ఆర్భాటాన్ని బద్దలు చేయడంలో సామర్థ్యం కల్గిన వారము) అని గర్జించారు కద! శ్రీరామాయణం లోనే గమనించండి - మారుతి అశోకవనంలో సీతాదేవిని చూచి, ఆమెతో మాటలాడి తరువాత లంకాధిపతి వద్దకు బయలుదేరి వెళ్ళి, అతనితో - **"మద్విశిష్టాశ్చ తుల్యాశ్చ సంతి తత్ర వనౌకసః, మత్తః ప్రత్యవరః కశ్చిత్ నాస్తి సుగ్రీవ సన్నిధౌ, అహం తావదిహ ప్రాప్తః కిం**

**పునస్తే మహాబలాః, న హి ప్రకృష్టాః ప్రేష్యంతే హీతరేజనాః"** (శ్రీరామా-కిష్కింధా-39-38,39) (నాకంటే గొప్పవారు, నాతో సమానులైన వానరులు కిష్కింధలో ఉన్నారు. సుగ్రీవుని వద్ద నా కంటే తక్కువ వాడేవడూ లేడు. నేనే నీ దగ్గరకు వచ్చానంటే, ఇక మహా బలులైన వారిని గూర్చి చెప్పవలసిన దేమున్నది? దూతలుగా గొప్పవారు పంపబడరు కద! ఇతరులు, అంటే సామాన్యులే కద పంపబడతారు) అని అన్నాడు. దీని వల్ల ఇక్కడ మారుతి తన నైచ్యాన్ని మిక్కిలిగా వ్యక్తం చేశాడనేది స్పష్టం. ఈ హనుమంతుడే కిష్కింధాకాండ చివరలో **"పన్నగాశన మాకాశే పతంతం పక్షిసేవితే, వైనతేయ మహంశక్తః పరిగంతుం సహస్రశః"** (శ్రీరామా కిష్కంధా67-14) (పక్షులు సంచరించే ఆకాశంలో వచ్చే గరుత్మంతుని నేను నూరుమార్లు ప్రదక్షిణం చేయడంలో శక్తిని కలవాడను) అని, సుందరకాండ చివరలో **"యథా రాఘవనిర్ముక్తః శరః శ్వసన విక్రమః, గచ్ఛేత్త ద్వద్గమిష్యామి లంకాం రావణ పాలితామ్, న హి ద్రక్ష్యామి యది తాం లంకాయాం జనకాత్మజామ్, అనేనైవ తు వేగేన గమిష్యామి సురాలయమ్"** (శ్రీరామా-సుందర-1-37,38,39) (శ్రీరామునిచే ప్రయోగింపబడిన బాణం ఏవిధంగా వాయు వేగాన్ని కల్గినదై వెడుతుందో, ఆ విధంగానే నేను రావణుడు పాలించే లంకకు వెళ్ళ గలను. అక్కడ నేను ఒకవేళ ఆ జనకాత్మజను చూడలేక పోతే, అదే వేగంతో స్వర్గాన్ని చేరగలను) అని అన్నాడు. రావణుని వద్ద తన నైచ్యాన్ని పల్కడం, వానర వీరుల దగ్గర తన గొప్పతనాన్ని పల్కడం మారుతికి మిక్కిలి తగినది అని తెలియాలి. "నికృష్టతముడైన ఈ వానురుడే ఇటువంటి దుస్సహాలైన, దారుణాలైన పనులను చేస్తే, ఇక, ఇతని కంటే గొప్పవారైన వానర వీరుల చేష్టితాలు ఏవిధంగా ఉంటాయో? అయ్యో!" అని రావణునకు ఎక్కువ భీతి కల్గడం కోసం అతని దగ్గర తన నైచ్యాన్ని మారుతి పలికాడు. "ఎంతో శ్రమపడి సముద్ర తీరాన్ని చేరిన వారమైనా, మనము ఈ సాగర తరణం,

అయ్యో! సాధ్యం కానిదిగా కన్పిస్తున్నదే! - అని మిక్కిలి శోకాన్ని పొందిన వానర వీరుల ఈ శోకాన్ని తీర్చడం కోసం **"పన్నగాశన మాకాశే"** ఇత్యాదిగా తన బలాతిశయోత్కర్షను ప్రస్తావించాడు - అనే ఇచటి విషయ వివేకం ఎంతో సుందరమైనది. ఈ విధంగానే శ్రీరామచంద్ర భగవానుడు కూడ తన సత్యావాదిత్వాన్ని యుక్తంగా ప్రకాశింప జేశాడనే విషయాన్ని గ్రహించాలి. అంతే తప్ప, ఇక్కడ ఆత్మ ప్రశంస అనే దోషశంకకు అవకాశం లేదు. నిజానికి, అసత్యవాది అయినవాడు తనను సత్యవాదిగా పల్కితే అపుడు అది చాల దోషం అవుతుంది. వస్తుతః, ఆవశ్యకమైన, సందర్భాలలో వైభవ ప్రకాశనమనేది మిక్కిలి తగినది, దోషం లేనిది అనేది శాస్త్రార్థ సర్వస్వం. ఇక్కడ చెప్పవలసినది చాల విస్తరభీతి చేత విడువడినది.

ప్రాసంగికంగా, దశరథుని సత్యవాదిత్వాన్ని గూర్చిన విమర్శనం కొంచెం చేయబడుతున్నది. శ్రీరాముని సత్యవాదిత్వం ఇతరుల వచనాల ద్వారా కూడ ప్రకాశింపజేయబడడం, ఆ సత్యవాది యొక్క ప్రభావం వల్ల కల్గిన ఫల విశేషం ముందు ముందు వివరింపబడతాయి. దానికంటే ముందు, దశరథ చక్రవర్తి యొక్క సత్యవాదిత్వాన్ని గూర్చి విచారించడంలో మనకు ముందు ఆసక్తి కల్గుతున్నది. "సత్యవాదులలో అగ్రేసరుడుగా ప్రఖ్యాతి పొందిన వాడు దశరథుడు. అతని కుమారుడైన కారణం చేత రాముడు కూడ సత్యవాది కావడంలో ఏమి ఆశ్చర్యం ఉన్నది?'' అని పలువురు భావిస్తారు. ఆ విధంగా పల్కుతారు కూడ. ఆ దశరథుని సత్యవాదిత్వాన్ని గూర్చి కొంచెం పరిశీలంచవలసి ఉన్నది. దశరథునకు కల్గిన సత్యవాదిత్య ప్రఖ్యాతి **"పుణ్యైః యశో లభ్యతే"** (పుణ్యం చేసిన వారికి యశస్సు లభిస్తుంది) అనే రీతిలోనే కల్గింది అని చెప్పాలి. ఆ విషయాన్ని కొంచెం వివరిస్తాను.

దండకారణ్యంలో వైజయంత మనే పేరును కల పట్టణంలో

నివసించేవాడు, ఇంద్రుని జయించిన వాడు, తిమిరధ్వజుడనే ఇంకొక పేరును కలవాడైన శంబరాసురుని ఇంద్రుని ప్రార్థనపై జయించడం కోసం దశరథుడు కైకేయిని వెంట బెట్టుకొని బయలుదేరాడు. ఆ అసురునితో ప్రబలమైన, తుములమైన యుద్ధం చేస్తూ ఉండే సమయంలో, అతనిచే తీవ్రంగా కొట్టబడి మూర్ఛిల్లాడు. అపుడు దశరథునకు ఏవిధమైన అపాయం కలుగకుండా తన సారథ్య సామర్థ్యంతో వేఱొక చోటుకు తీసికొనిపోయి కైకేయి రక్షించింది. కొంత సేపటికి మూర్ఛనుండి తేరుకొన్న దశరథుడు కైకేయి తనకు చేసిన గొప్ప ఉపకారాన్ని తెలిసికొని, మనస్సులో ప్రసన్నుడై, ఆమెకు రెండు వరాలను ఇస్తానని మాట ఇచ్చాడు. (ఆ సమయంలో దశరథుడు కైకేయిచే రెండుమార్లు రక్షింపబడినందున రెండు వరాలను ఇచ్చినట్లు తెలుస్తున్నది) కైకేయి ఆ వరాలను రెండింటిని తనకు అక్కరకు వచ్చినపుడు కోరతానని పల్కినందున, అపుడు వాటిని కోరలేదు. తరువాత, దశరథుడు శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేకం చేయాలని యత్నించినపుడు కైకేయి మంథర చేసిన దురుపదేశం వల్ల మనస్సులో కాలుష్యాన్ని పొంది, గతంలో దశరథుడు తనకు మాట ఇచ్చిన, తాను కోరడానికి వీలున్న రెండు వరాల రూపంగా తన కుమారుడైన భరతునకు రాజ్యాభిషేకాన్ని, కౌసల్యా నందనునకు వనవాసాన్ని కోరింది. ఆ తరువాత జరిగిన సంగతి జగద్విదితం. అయితే, దశరథుడు గతంలో కైకేయికి మాట ఇచ్చిన ప్రకారం జరిగినది కనుక ప్రసిద్ధమైన దశరథుని సత్యసంధత్వ కీర్తి సముచితం అవునా? కాదా? అని విమర్శించవలసి ఉన్నది. కైకేయికి రెండు వరాలను ఇస్తానని దశరథుడు ఏ యుగంలో మాట ఇచ్చాడు? అనే విషయం తెలియదు. వరాల నిర్ధారణ మాత్రం అపుడు జరుగ లేదనే విషయం నిస్సందేహం. ఆ విషయం అటు ఉండనివ్వండి. ఆ దశరథ చక్రవర్తి శ్రీరామచంద్రుని స్వయంగా పిలిచి, "రేపు నీకు పట్టాభిషేకం జరుగనున్నది" అని పల్కిన మాట లోకానికి అంతటికి తెలుసు. ఆ విధంగా అతడు పల్కడం

ఒకసారి కాదు, రెండుమార్లు జరిగింది. ఈ విధంగా పల్కిన మాటను నిష్ఫలం చేసిన, కామినీవశుడైన ఆ ప్రభువు ఏ విధంగా సత్యవాది కాగలడు?

కైకేయికి చాలాకాలం క్రితం చేసిన వరదాన ప్రతిజ్ఞను అయితే అతిక్రమించవచ్చు. ఏ విధంగా? అంటే, అయిదు విధాలైన అసత్యాలు పాతకాలు కాదని శాస్త్రాలలో చెప్పబడింది. కొన్ని కొన్ని సమయాలలో పలికే అసత్యాలు అపాతకాలుగా లెక్కించబడు తున్నాయి. **"వివాహకాలే రతి సంప్రయోగే ప్రాణాత్యయే సర్వధనాపహారే, విప్రస్య చార్థేవ్యనృతం వదంతి"** (వివాహ సమయంలో, సంభోగ సమయంలో, ప్రాణహాని సమయంలో, సమస్త ధనం అపహరింపబడినపుడు, బ్రాహ్మణుని కోసం అసత్యాన్ని పల్కుతున్నారు.) అనే శ్లోకంలో ప్రాణాలు పోయే సమయం కూడ ప్రస్తావించబడింది కద! ప్రాణాపాయ సమయంలో కద దశరథుడు వరదానాన్ని ఇచ్చాడు. ఆ విధమైన సమయంలో ఇచ్చిన మాటను పరిపాలించాలనే నిర్బంధం అనేది ఏమీ లేదు. శ్రీరాముని రాజ్యాభిషేకాన్ని గూర్చి దశరథుడు రెండుమార్లు తన నోటితో పల్కినట్లుగా, కైకేయికి కంఠతః వరదాన ప్రతిజ్ఞ చేసినట్లు కన్పించదు. విశేషంగా చేసిన ప్రతిజ్ఞను సామాన్య రూపంగా చేసిన ప్రతిజ్ఞ నిరోధించలేదు. "ఓ కైకేయీ! చాల కాలానికి ముందు నీకు నేను రెండు వరాలను ఇస్తానని మాట ఇచ్చిన మాట నిజమే. కాని, వరప్రదాన నిర్ణయం అయితే ఇంత వరకు చేయబడలేదు. శ్రీరామపట్టాభిషేకం గూర్చి అయితే స్పష్టతః కంఠరవంగా నాచే ప్రతిజ్ఞ చేయబడింది. నీవు యాచించే వరాలు నేను చేసిన శ్రీరాముని రాజ్యాభిషేక ప్రతిజ్ఞకు అవిరోధంగా ఉండాలి. ఆ ప్రతిజ్ఞకు విరుద్ధంగా ఈ నాడు నీవు చేసే వర ప్రార్థన న్యాయం కాదు. నీ ప్రార్థనను నేను నిర్వర్తించలేను'' అని దశరథుడు పల్కి ఉంటే, అపుడు అతని సత్యవాదిత్వం తొలగి ఉండేది కాదు. తగని రీతిలో కద అతడు అసత్యవాదిత్వ

భయాముషిత హృదయుడయ్యాడు.

వేరొక ప్రధాన విషయం కూడ ఇక్కడ గమనించదగినది ఉన్నది. వాల్మీకి భగవానుడు మారీచ వాక్యాల ద్వారా **"రామో విగ్రహవాన్ ధర్మః"** (రామా ఆరణ్య 37-13) (రాముడు మూర్తీభవించిన ధర్మం) అని వ్యక్తం చేశాడు. ధర్మమే స్వయంగా శ్రీరాముని రూపాన్ని ధరించిందనేది నిజం. భగవద్గీతలోని చతుర్థాధ్యాయంలో **"ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే"** (4-8) (ధర్మాన్ని సంస్థాపించడం కోసం నేను ప్రతి యుగంలో అవతరిస్తాను) అని పల్కిన శ్రీకృష్ణుడు, తరువాత అష్టాదశాధ్యాయంలో **"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ"** (18-66) (ధర్మాలను అన్నిటిని విడచి పెట్టి నన్ను ఒక్కని మాత్రం శరణు పొందు) అని సర్వధర్మ పరిత్యాగాన్ని ఆదేశించడం అనేది విరుద్ధం. ధర్మా సంస్థాపనార్థం అవతరించిన భగవంతుడు సర్వధర్మ పరిత్యాగాన్ని ఆదేశించడం తగదు కద! అయితే మరి ఎందుకు ఈ విధంగా విరుద్ధంగా ఆదేశించాడు - అనే సందేహాన్ని పరిహరించే పూర్వాచార్యులు "దీనివల్ల శ్రీకృష్ణుని సాక్షాద్ధర్మత్వం విశదీకరింపబడిందని పలికారు. భగవంతుడు సిద్ధ ధర్మపదంతో వ్యవహరింపబడుతున్నాడు.

శ్రీకృష్ణుడు సంస్థాపించదగినదిగా అభిమతమైన ధర్మం సిద్ధ ధర్మమే. శ్రీకృష్ణ చరమశ్లోకంలో పరిగ్రహింపబడినదిగా చెప్పబడినది కూడ సిద్ధ ధర్మమే. విడువదగినదిగా చెప్పబడిన ధర్మాలు అయితే సిద్ధధర్మం కంటే వేఱయినవి, ధర్మాభాసాలు చెప్పదగినవి ఏవి ఉన్నాయో, అవే - అని తెలియాలి. ఈ విధంగా సిద్ధధర్మ పదంచే వ్యవహరింపబడే భగవంతుడైన శ్రీరామచంద్రునితో కలసి జీవించడంలోని రుచిని కాదని, ధర్మాభాస రూపమైన సత్యవచన శ్రద్ధను దశరథుడు కల్గి ఉండడం అనేది అంతా అతనికి దోషంగానే పర్యవసిస్తుంది. ఈ విషయం పూర్వాచార్యులచే కంఠతః స్పష్టంగా చెప్పబడింది.

**ముముక్షుప్పడి** - అనే దివ్య గ్రంథంలోని చరమశ్లోక ప్రకరణంలో శ్రీపిళ్ళైలోకాచార్యుల వారు "ధర్మాభాసంలోని అభినివేశం, దశరథ చక్రవర్తికి వలె ఫలాన్ని కోల్పోవడానికి హేతువు కాగలదు'' అని అనుగ్రహించారు. ఈ సూత్రాన్ని వ్యాఖ్యానించే శ్రీమద్వరవరమునులు "ముందుగానే వరదాన ప్రతిజ్ఞను చేసి, ఇపుడు దానిని విఫలం చేయడం తగదనే భావనతో ఆభాస ధర్మ నిష్ఠను అవలంబించి, **"రామో విగ్రవాన్ ధర్మః"** (రామా-ఆరణ్య-37-13) (రాముడు మూర్తీభవించిన ధర్మం) అని మూర్తీభవించిన ధర్మంగా ప్రసిద్ధుడైన రాముని వనానికి పంపి, అతనితో కలిసి జీవించే భాగ్యాన్ని దశరథుడు కోల్పోయాడు కద'' అని అనుగ్రహించారు.

మధ్యలో దధిభాండుని కథ కూడ వినండి. ఇది ఆశ్చర్యకరమైన వృత్తాంతం. శ్రీకృష్ణశిశువు రూపంలోని భగవంతుని దివ్యలీలా విశేషానుభవమిది. తన తల్లి యశోద అన్యకార్య నిమగ్నురాలై ఉండగా శ్రీకృష్ణుడు వెన్న మొదలైన వానిని దొంగిలిస్తూ వాటిని ఆనందంగా తింటూ ఉండేటపుడు అతనిని యశోద గమనించింది. మిక్కిలి కోపంతో అతనిని బంధించాలని దారం తీసికొని వచ్చే యశోదను చూచి అతడు ఇంటి నుండి బయటకు పారిపోయాడు. యశోద అతనిని వెంబడించింది. ఆమె, తన వయస్సు కారణంగా, మెల్ల మెల్లగా వెంబడించింది. ముందు పరుగెత్తే శ్రీకృష్ణుడు చాల దూరం పారిపోయి, అక్కడ ఒకచెట్టు కింద పెద్ద పెరుగు బానను తలదిండుగా చేసికొని పరుండి, మిక్కిలి శ్రమవల్ల పరవశుడై గాఢ నిద్రావివశుడైన ఒక ముసలి గొల్లవానిని చూచాడు. ఆ కుండ లోపల దూరి తల్లికి కనబడకుండా దాగికోవాలని శ్రీకృష్ణ శిశువు భావించాడు. ఆ వృద్ధ గోపాలుని తట్టి నిద్ర లేపాడు. అతడు తొంభై ఆఱు సంవత్సరాల ముదుసలి; చదువు లేని వాడు; భగవత్కథల శ్రవణ గంధాన్ని ఏ మాత్రం లేనివాడు. శ్రీకృష్ణుని చేతి అదరింపుతో నిద్రలేచిన అతడు ఆ

స్వామి దివ్యమంగళ విగ్రహాన్ని దర్శించినంత మాత్రంతోనే అతని పట్ల అనిర్వచనీయానురాగాన్ని పొందాడు. అతడే పరమ పురుషుడని నిశ్చయించు కొన్నాడు. ఈనాడు ఏ రీతిలో అయినా సరే ఇతని వల్ల ముక్తిని పొందాలనే కుతూహాలన్ని పొందాడు. ఇంత కాలంగా దేవతా ప్రతిపత్తి గంధ విహీనుడు, ముక్తిని గూర్చిన విజ్ఞానం ఏ మాత్రం లేనివాడు అయిన అతడు గోపాలడింభకుని దర్శన మాత్రంలో మోక్ష కుతూహలాన్ని ఏ విధంగా పొందాడు? అతడే పరమ పురుషుడనే నిశ్చయాన్ని ఏ విధంగా పొందాడు?''- అని కొందరు సందేహించవచ్చు. ఈ విషయంలో ఏమని బదులివ్వగలం? **"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తేన లభ్యః తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్"** (కఠోపనిషత్-2-23) (ఈ పరమాత్మ ప్రవచనం వల్ల పొందడానికి వీలయిన వాడు కాడు, బుద్ధితో తెలియడానికి సాధ్యమయే వాడు కాడు, పలు శ్రుతులను అధ్యయనం చేసినంత మాత్రంతో పొందడానికి వీలయిన వాడు కాడు. ఆ పరమాత్మ ఎవరిని వరిస్తాడో, అతని చేతనే పొందడానికి వీలయిన వాడు) అనే శ్రుతియే సమాధానించ గలదు. స్వగత స్వీకారం యొక్క అంకిచిత్ కరత్వం, పరగత స్వీకారం యొక్క పరమ శ్రేయః ప్రయోజకత్వం - అనే ఈ రెండింటిని ఈ శ్రుతి ప్రతిపాదిస్తున్నది కద! పరగత స్వీకారమంటే భగవానుడే స్వయంగా బలత్కారంగా పరిగ్రహించడమే కద! దానిని ఎవరో కొద్ది మంది భాగ్యవంతులు మాత్రమే పొందగలరు. అది ప్రాప్తిస్తే, ఇక అసంభావిత మనేది ఏదీ లేదు. **"నాసౌ పురుషకారేణ న చాప్యన్యేన హేతునా, కేవలం స్వేచ్ఛయైవాహం ప్రేక్ష్యే కంచిత్ కదాచన"** (ఈ జీవుడు పురుషకార మాత్రంతో గాని, లేక, వేరొక ఏకారణం వల్ల గాని నన్ను పొందలేడు. కేవలం నా ఇచ్ఛతోనే నేను ఎవనినో ఒక జీవుని ఎపుడో ఒక సమయంలో కటాక్షిస్తాను) అని పల్కిన

భగవానుడిపుడు ఈ వృద్ధుని వద్దకు స్వయంగానే వచ్చి అనుగ్రహించాడు. కనుక అతడు ఉత్తమాధికారి అయినాడు. వెంటనే తత్త్వహిత పురుషార్థాలలో విపులమైన, విశదమైన విజ్ఞానాన్ని పొందాడు. నిద్ర నుండి లేచిన అతడు కృష్ణునిచూచి, "బాలకా! ఎవరు నీవు? ఇక్కడికి ఎందుకు వచ్చావు? నన్నెందుకు నిద్ర లేపావు?" అని ప్రశ్నించాడు. శ్రీకృష్ణుడు యధార్థాన్ని ఈ విధంగా తెలిపాడు. "ఇంటిలో నేను వెన్నను దొంగలించాను. అపుడు నన్ను నా తల్లి గమనించింది. కోపంతో నన్ను కొట్టాలని ప్రయత్నించింది. నేనిక్కడకి కాందిశీకుని వలె పరుగెత్తి వచ్చాను. ఆమె నన్ను వదలకుండా వెంట తరుముతూ ఏ విధంగా అయినా నన్ను పట్టు కోవాలనివస్తున్నది. శీఘ్రంగా ఇక్కడకు రాగలదు. ఆమె నన్ను పట్టుకొంటే, తప్పక నేను ఆమె విధించే సహించరాని శిక్షను అనుభవించవలసి ఉంటుంది. ఓ వృద్ధ మహాశయా! నీ పాదాలపై పడుతున్నాను. నీవే నన్ను కాపాడాలి. ఇంకొకరు ఎవరూ రక్షకులు లేరు. నన్ను రక్షించే ఉపాయాన్ని కూడ నీకు తెల్పుతాను విను. ఈ పెరుగు బాన లోపల నన్ను దాచిపెట్టు, నా తల్లి ఇక్కడకు వచ్చి నన్ను గూర్చి ఏమయినా ప్రశ్నిస్తే, 'నాకేమీ తెలియద'ని నీవు దృఢంగా బదులు పల్కు. మళ్ళీ మళ్ళీ నీకు దండం పెడతాను నాయనా! ఇక ఆలస్యం చేయకు".

శ్రీకృష్ణుడు పల్కిన ఈ మాటలను ఆలకించిన వృద్ధ గోపాలుడు ఇదే ముక్తి లాభానికి చక్కని అవకాశమని నిశ్చయించుకొని, అపరిమితమైన ఆనందాన్ని మనస్సులో పొందుతూ, "బాలకా! ఈ విధంగానే కానీ, భయపడకు" అని పల్కి నంద కుమారుని పెరుగు బాన లోపల దాచి, ఆ బానపై తాను కూర్చుని, అన్యమనస్కంగా ఉన్నట్లు అభినయిస్తూ ఉన్నాడు. తరువాత కొద్దిసమయంలోనే యశోద అక్కడకు వచ్చి, "మహాత్మా! మా కుఱ్ఱవాడు ఎవడైనా ఇక్కడకు రావడం నీవు చూచావా? ఇక్కడ నుండి ఎక్కడకు

వెళ్ళాడో నీకు తెలుసునా?'' అని ప్రశ్నించింది. "నా కేమీ తెలియదు. వెళ్ళు'' అని విముఖంగానే ఆ వృద్ధుడు సమాధానం పలికాడు. ఆమె నిరాశగా వెనుతిరిగి పోయింది. తరువాత కొద్ది సేపటికి శ్రీకృష్ణుడు వృద్ధుని ఉద్దేశించి, "మహాభాగా! నా తల్లి ఇంటికి చేరి ఉంటుంది. ఇక నాకు ఏ భయం లేదు. అబ్బా! ఇక ఎంత సేపు ఈ బానలోపల ఉంటాను? నాకు ఇక్కడ ఊపిరి ఆడక బాధగా ఉన్నది. దయతో ఆలస్యం చేయకుండా బాన నుండి బయటకు తీయి'' అని అన్నాడు. శ్రీకృష్ణరూపి అయిన ఈ భగవానుడే **"ప్రాణాదీన్ సన్నియమ్య ప్రణిహిత మనసాం యోగినా మంత రంగే, తుంగం సంకోచ్య రూపం విరచిత దహరాకాశకృచ్ఛ్రాకోస్తి"** (ప్రాణవాయువు మొదలైన వానిని స్తంభింప చేసి ధ్యానం చేసే యోగుల అంతరంగంలో తన ఉన్నతమైన రూపాన్ని సంకోచింప చేసి, చాల సంకుచితమైన దహరా కాశంలో అతిక్లేశంతో వేంచేసి ఉండే స్థితిని కల్గిఉన్నాడు)

వృద్ధుడు అయితే "బాలకా! నిన్ను దీని నుండి బయటకు తీయను'' అని అన్నాడు. శ్రీకృష్ణుడు బాన లోపల క్లేశపడుతున్నాడు. "మహాత్మా! నీ వెందుకు నన్ను విముక్తుని చేయవు? నేను నా తల్లి చేతికి దొరికి ఉంటే ఏదో నాలుగు అయిదు కర్ర దెబ్బలను తిని అంతటితో బయటపడి ఉండేవాడను. తావన్మాత్రమైన దండనకు భయపడిన నేను 'నన్ను రక్షించ'మని నీ శరణు పొందాను. నన్ను నీవు ఈ బానలోనే పెట్టి అంతం చేయాలని అనుకుంటున్నావా? ఇది న్యాయం కాదు మహాత్మా! ఇక, రెండు నిమిషాలు గడిస్తే నేను ప్రాణాలను కోల్పోవడం తథ్యం. వృథాగా నన్ను వధించకు. బానపై నుండి త్వరగా లే. నన్ను వెంటనే బయటకు తీయి. నీకు దండం పెడుతున్నాను. నీకు చాల పుణ్యం ఉంటుంది" అని ఈవిధంగా పల్కి శ్రీకృష్ణుడు వృద్ధుని మిక్కిలిగా ప్రార్థించాడు. కాని, వృద్ధుడు బానపైనుండి లేవలేదు. "నంద నందన!

ఈనాడు నిన్ను నేను గట్టిగా పట్టుకోగలిగాను. ఇక నిన్ను విడువను, విడవనే విడవను. నీవు భక్తులకు ఏమయినా ఇస్తావు కద! దానిని నాకు కూడ ఇస్తే నిన్ను విడచిపెడతాను. లేకపోతే, ఇపుడు నిన్ను నీ తల్లి దగ్గరకు తీసికొని పోయి, నిన్ను ఆమె దండించేటట్లు చేస్తాను'' అని అన్నాడు. దానిని విని శ్రీకృష్ణుడు "మహాశయా! నా వద్ద ఏమున్నది. చెప్పు. నేను ఎవనికి ఏమి ఇవ్వగలను? అకించనుడను నీకేమి ఇస్తాను? నీకేమి కావాలో చెప్పు" అని పలికాడు. వృద్ధుడపుడు "శ్రీకృష్ణా! నిన్ను గూర్చి నాకు బాగా తెలుసు. నీవు ముకుందుడవు కద! నీవే కద ముక్తిని ఇచ్చేవాడవు. ముక్తి అనేది నీచేతిలోనే ఉన్నది అనే విషయం నాకు తెలియదా? ముక్తిని నాకు ప్రసాదించానని నీవు పలికినపుడే నీవు ముక్తుడవు కాగలవు. నాకు ముక్తి లేకపోతే నీకు కూడ ముక్తి లేదు సుమా'' అని గట్టిగా అన్నాడు.

బానలోపల క్లేశపడే శ్రీకృష్ణుడు తన మనస్సులో ఈ విధంగా చింతించాడు- "ఆహా! నేను పూర్వం దశరథ కుమారుడై అవతరించి, నా ప్రభావాన్ని బహుముఖంగా ప్రకాశింప జేశాను. **"విశ్వామిత్ర మహర్షి ద్వారా అహంవేద్మి మహాత్మానం రామం సత్య పరాక్రమమ్, వశిష్ఠోపి మహాతేజా యే చేమే తపసి స్థితాః"** (రామా బాల 19-14,15) (నేను శ్రీరాముని మహాత్మునిగా, సత్యమైన పరాక్రమాన్ని కల వానిగా తెలిసికొంటున్నాను. నేనే కాదు, గొప్ప మహిమను కల వశిష్ఠుడు, తపోనిష్ఠులైన ఈ మునులు కూడ తెలిసికొంటున్నారు) ఇత్యాదిగా వ్యక్తం చేశాను. తాటకను, తాటకేయుడైన సుబాహుని నిర్జించడం ద్వారా విశ్వామిత్ర యాగ సంరక్షణాన్ని చేసి, అహల్య శాప విమోచనాన్ని చేసి, రుద్ర ధనుస్సును భంజించి - ఈ విధంగా పలు అతి మానుష లీలలను తెలియిపరచాను. పరశురామ గర్వనిర్వాపణాన్ని ప్రత్యక్షంగా చేశాను. ఇటువంటి కృత్య విశేషాలను ప్రదర్శించినా దశకంఠుడు నన్ను

పరమపురుషునిగా తెలిసికొనలేదు. కైకేయీ వచనాలనే వలలో చిక్కికొని అసత్య కథనం వల్ల నరకపాతం సంభవిస్తుందని భయపడి దశరథుడు నన్ను విడచి స్వర్గాన్ని చేరాడు. కాని, ఈ వృద్ధుడు, ఎవరి వల్ల కూడ **"అహం వేద్మి మహాత్మానమ్"** వంటి సూక్తులను విన్నవాడుకాదు. నేను కూడ ఇతనికి నా లీలా విశేషాన్ని దేనినీ ప్రదర్శించి చూపలేదు. దానికి విరుద్ధంగా, నా ఆశక్తినే మిక్కిలిగా చేశాను. అయినా, ఇతడు నన్ను యథాతథంగా తెలిసికొన్నాడు. "భయపడి పరుగెత్తి వచ్చినవాడు, నా పాదాలను ఆశ్రయించిన వాడు ఏ విధంగా ముక్తిని ఇస్తాడు?" - అనే భావనను కల్గించే కృత్యాన్ని కద నేను చేశాను. అయినప్పటికీ, ఇతడు మాయా మానుష చేష్టితునిగా గ్రహించినవాడై, దృఢంగా నన్ను పరమాత్మగా నమ్మినవాడై, ముక్తిని అర్థిస్తున్నాడు. ఆహా! ఇతడు నా దయకు ఉత్తమోత్తమమైన పాత్రుడు. **"తత్త్వజ్ఞానాన్ముక్తిః"** (తత్త్వజ్ఞానం వల్ల ముక్తి లభిస్తుంది) అనే మాట ఇతని విషయంలో సఫలం కాకపోతే, ఇక ఎవరి విషయంలో ఫలిస్తుంది? ఇతడే తత్త్వవేత్తలలో అగ్రగణ్యుడు. ఇతడే ముక్తి ప్రదానానికి అర్హుడు".

ఈ విధంగా తన మనస్సులో తలచిన శ్రీకృష్ణుడు అతనిని కొంచెం - పరీక్ష చేయదలచి, బానలోనే ఉండి "ఓ వృద్ధ మహోదయా! నీవు నన్ను ముక్తిని ఇమ్మని అర్థిస్తున్నావు. ముక్తి శబ్దార్థమనేది ఏమో కూడ నాకు తెలియదు. తల్లివల్ల భయపడి పరుగెత్తి వచ్చినవాడను, నిన్ను శరణు పొందినవాడను, నీ వల్ల ప్రాణాలను దక్కించుకొన్న వాడనైన నన్ను చూచి ముక్తిని ఇమ్మని అడిగే నీ మూర్ఖత్వాన్ని చూస్తే జాలివేస్తుంది. నన్ను నీవు వేళాకోళం చేస్తున్నట్లున్నావు. ఈ బాన నిండుగా పెరుగును తాగి, మిక్కిలి మత్తెక్కిన నీవు పలికే పరిహాసోక్తులకు నేను ఏ విధంగా లక్ష్యం కాగలను? పరిహాసానికి సమవయస్కులు కద తగినవారు. మహాత్మా! నా ప్రాణాలు పోతున్నాయి.

వ్యర్థంగా ఆలస్యం చేసి నా ప్రాణాలను తీయకు. నన్ను విడచిపెట్టు విడచిపెట్టు" అని అన్నాడు.

వృద్ధుడపుడు "శ్రీకృష్ణ భగవాన్! నీ ప్రాణాలు ఉండనీ, వెళ్ళిపోనీ, నేను దృఢంగా ప్రమాణం చేసి పల్కుతున్నాను. నేను నా కోరిక తీరకుండా నిన్ను విడచిపెట్టను. ముక్తిని ఇచ్చాను - అని నీవు పల్కిన తరువాతనే నిన్ను నేను విడచి పెడతాను. లేకపోతే నీ అమ్మవల్ల నీకు దండన తప్పదు. నేను ఆ విధంగానే చేస్తాను'' అని పలికాడు. వాసుదేవుడపుడు ''ఈ విధమైన ఉత్తమాధికారి నా గొప్ప అదృష్టం వల్ల నాకు లభించాడు'' అని గొప్ప హర్షంతో నిండిన హృదయాన్ని కలవాడై; "మహాత్మా! నీవు కోరిన శరీరంలోనే నీకు ముక్తిని ఇచ్చాను'' అని అన్నాడు. వృద్ధుడపుడు- "శ్రీకృష్ణా! ఇంతటితో చాలదు సుమా! నీ దయను నాకు లభింపజేసిన ఘటానికి కూడ ముక్తిని ఇవ్వాలి" అని అన్నాడు. శ్రీకృష్ణుడు సరే అని అన్నాడు. "ఇంతటితో కూడ చాలదు. నా గ్రామంలో ఇరవై మంది కుటీరాలలో నివసించేవారున్నారు. వారికి కూడ ముక్తిని అనుగ్రహించాలి'' అని మళ్ళీ వృద్ధుడు యాచించాడు. దీనికి కూడ శ్రీకృష్ణుడు సరే అన్నాడు అపుడా మహాత్ముడు "శ్రీకృష్ణ భగవన్! నిన్ను విడచి పెడుతున్నాను. యథేచ్ఛగా వెళ్ళు'' అని పల్కుతూ బానపై నుండి లేచాడు. అపుడు పెరుగుకుండ నుండి బయటకు వచ్చిన శ్రీకృష్ణుడు. **"జాతోసి దేవ దేవేశ! శంఖచక్ర గదా ధర!"** అని యశోదాదేవి స్తుతించిన రూపాన్ని అతనికి సాక్షాత్కారింపజేసి క్షణంలో అంతర్ధానమయ్యాడు. వృద్ధ గోపాలుడు కూడ ముక్తిని పొందాడు. దధిభాండం వల్ల ముక్తిని పొందినందున ఈ గొల్లవానికి దధిభాండుడనే పేరు ప్రసిద్ధి చెందింది. ఈ ఇతిహాసంలో ప్రధానంగా గమనించ వలసిన విషయం ఒకటి ఉన్నది. అనృతం వల్ల భయపడిన దశరథుడు సత్య వచనంలో శ్రద్ధను కలవాడైనా, ముక్తి సామ్రాజ్యానికి దూరమయ్యాడు. కాని,

దధిభాండుడు యశోదకు అసత్యాన్ని పల్కినా శీఘ్రంగా ముక్తిని పొందాడు. అతడు అనృతాన్ని పల్కినందువల్ల తగిన శిక్షను దధిభాండునకు శ్రీకృష్ణుడు స్వయంగా ఇచ్చి, వెంటనే అతనికి ముక్తిని కూడ కల్గించాడు. దశరథుడు అయితే, సత్యవాది అనే వ్యర్థమైన కీర్తిని పొంది ముక్తి వైదేశికుడయ్యాడు. స్వర్గాన్ని మాత్రమే పొందగలిగాడు.

ప్రసక్తానుప్రసక్తంగా వచ్చిన దశరథ - దధిబాండుల వృత్తాంతాన్ని ఇంతటితో ముగించి, ఇక, దాశరథి యొక్క సత్యవాక్యప్రభావ వివరణాన్ని చేస్తాను. శ్రీరామచంద్రుని సత్యవాదిత్వాన్ని రెండు రీతులలో వివరిస్తాను. ఏ చరితం వల్ల శ్రీరాముని సత్యవాదిత్వం సుప్రతిష్ఠితమవుతుందో, ఆ చరిత్రలను ఉపపాదించడం అనేది ఒక విధమైన వివరణం. ఆయా చరిత్ర విశేషాలలో శ్రీరాముని సత్యవాదిత్వంలో శంకను ఉద్భావించి, దానిని నిరసించడం ద్వారా సత్య వాదిత్వ ప్రతిష్ఠాపనం అనేది ఇంకొక విధమైన వివరణం. ఇపుడు మొదటి ప్రకారాన్ని గమనించండి.

కౌసల్యానందనుని యౌవరాజ్యాభిషేకం జరుగబోతున్నదని తెలిసిన కైకేయి మంధర మాటల వల్ల కలుషితచిత్తయై, కోపానికి, శోకానికి వశంవదయై, రాముని వనవాసాన్ని, భరతుని పట్టాభిషేకాన్ని గూర్చి దశరథుని వద్ద ఎప్పుడు ప్రస్తావన చేసిందో, అపుడతడు మూర్ఛిల్లాడు. చాల సేపటికి తెలివిని పొందిన అతడు కైకేయితో చాల దీనంగా మాటలాడాడు. రాముని వనవాసానికి పంపించడానికి కారణాలు కాదగిన దోషాలు ఏమీ లేకపోవడాన్ని గూర్చి, సకల కల్యాణ గుణాలను కల్గి ఉండడాన్ని గూర్చి అతడు పలికే సందర్భంలో **"సత్యేన లోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః, గురూన్ శుశ్రూషయా ధీరో ధనుషా యుధి శాత్రవాన్, సత్యం దానం తపస్త్యాగో మిత్రతా శౌచ మార్జవమ్, విద్యా చ గురుశుశ్రూషా ధ్రువా ణ్యేతాని రాఘవే"**

(రామా-అయోధ్యా-12-29,30) (శ్రీరాముడు తన సత్య గుణంతో లోకాలను స్వాధీనం చేసికొంటున్నాడు. దాన గుణంతో దీనులను, గురువులను శుశ్రూషతో, ధీరుడైన అతడు యుద్ధంలో ధనుస్సుతో - శత్రువులను వశం చేసికొంటున్నాడు. సత్యం, దానం, తపస్సు, త్యాగం, మైత్రి, శౌచం, ఋజుత్వం, విద్య, గురుశుశ్రూష అనేవి శ్రీరామునిలో నిశ్చయంగా ఉన్నాయి) అని అన్నాడు. ఇక్కడ **"సత్యేన లోకాన్ జయతి"** అనే మాట శ్రీరామగుణాలలో మూర్ధన్యం అని భావించాలి. శ్రీరాముని సత్యవాదిత్వ గుణం శ్రీరామాయణంలో పలు చోట్ల పలువురిచే ప్రశంసింపబడినా, **"సత్యేన లోకాన్ జయతి"** అనే ఈ రీతిలోని ప్రశంస అనర్ఘమని పూర్వాచార్య గోష్ఠిలో ప్రసిద్ధమైన విషయం. తిరువాయ్మొ**ழி** ప్రబంధానికి భగవద్విషయమనే వ్యాఖ్యానాన్ని అనుగ్రహించిన వ్యాఖ్యాతృసార్వభౌములైన, **నంబిళ్ళై** అనే సాంప్రదాయిక నామాన్ని కల శ్రీకలివైరి గురువర్యుల దివ్యచరితంలో **"సత్యేన లోకాన్ జయతి"** అనే శ్లోకాన్ని వారు నిర్వహించిన వృత్తాంతం మిక్కిలి మనోహరమైనది. ఆ కథ వివరం ఈ విధంగా ఉన్నది.

శ్రీ పరాశర భట్టార్యుల వంశంలో జన్మించిన **నడువిల్ తిరువీధిప్పిళ్ళై భట్టర్** అనే ఆచార్యులు నంబిళ్ళై కాలంలో శ్రీరంగంలో నివసించేవారు. అక్కడ ఎక్కడో ఒక మూల సాంప్రదాయిక గ్రంథ ప్రవచనాన్ని చేస్తూ ఉండేవారు. ఇంచుమించుగా శ్రీరంగ నగరంలోని శ్రోతలందఱు నంబిళ్ళై గోష్ఠిలోనే అన్వయించేవారు. ఎవరో ఇద్దఱు, ముగ్గురు మాత్రం నడువిల్ తిరువీధిప్పిళ్ళై భట్టర్ గోష్ఠిలో అన్వయించేవారు. ఇందువల్ల భట్టర్‌కు నంబిళ్ళై పట్ల అసూయ కల్గి, అది క్రమంగా వృద్ధి చెందింది. భట్టర్ విద్వాంసులైనందున, ఆ దేశాన్ని పాలించే మహావివేకి అయిన ప్రభువు వారిని ఒకానొక సమయంలో తన సభకు ఆహ్వానించాడు. బహుశ్రుతుడైన ఆ రాజు నడువిల్ తిరువీధిపిళ్ళై

భట్టర్‌ను ఉద్దేశించి శ్రీరామాయణంలో ఒకానొక విషయాన్ని గూర్చి సందేహాన్ని ప్రశ్నించాడు. ఆ సందేహం ఏమంటే - శ్రీరామచంద్రుడు వాస్తవంగా నారాయణుడైనా, మానుషవేషంతో తన దివ్యత్వం ఆవరింపబడినవాడై, భువిలో అవతరించి, **"ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్"** (శ్రీరామ-బాల-6-7-22) (నన్ను ఒక మానవునిగా, దశరథ కుమారునిగా భావిస్తున్నాను) అని స్వయంగా పలికాడు. మనుష్యులకు సహజంగా ఉండే అశక్తి, అజ్ఞత్వం పూర్తిగా ప్రదర్శిస్తూ, అతడు ఆయా కార్యాలను చేశాడు. ఇటువంటి మానుషవేష భూషితుడైన దాశరథి గృధ్రరాజు జటాయువుకు **"మయా త్వం సమనుజ్ఞాతః గచ్ఛ లోకాననుత్తమాన్"** (రామా-ఆరణ్య-68-30) (నీవు నాచే అనుమతింపబడిన వాడవై ఉత్తమ లోకాలను పొందు) అని పల్కి మోక్షాన్ని ఇచ్చాడు. ఇది అయుక్తం కద!

శ్రీవత్సాంక మిశ్రులచే రచింపబడిన అతిమానుష స్తవంలో **"పృచ్ఛామి కించన యదా కిల రాఘవత్వే మాయామృగస్య వశగో మనుజత్వ మౌగ్ధ్యాత్, సీతావియోగవివశో న చ తద్గతిజ్ఞః ప్రాదాస్తదా పరగతిం హి కథం ఖగాయ"** (17వ శ్లోకం) (స్వామీ! నిన్నొకటి అడుగుతాను. బదులు చెప్పు. నీవు శ్రీరాముడవై, అవతరించినపుడు, మాయామృగమైన మారీచునిచే ఆకర్షింపబడిన వాడవై, మానవ సహజమైన అజ్ఞానంతో సీతా వియోగం వల్ల కల్గిన దుఃఖానికి వశుడవయ్యావు. ఆమె ఎక్కడికి వెళ్ళిందో తెలిసికోలేక పోయావు. ఆ స్థితిలో నీవు అపుడు జటాయువునకు మోక్షం ఏ విధంగా ఇచ్చావు?) అని, **"అక్షుణ్ణ యోగపథ మగ్ర్యహతం జటాయుం తిర్యంచ మేవ బత! మోక్షపథే నియోక్తుమ్! శక్నోషి వేత్సి చ యదా స తదా కథం త్వం దేవీ మవాప్తుమనలో వ్యథితో విచిన్వన్"**(18వ శ్లోకం) (ఏమాత్రం యోగాభ్యాసాన్ని చేయనివాడు, ఉత్తమ జాతిలో పుట్టిన రావణునిచే

వధింపబడినవాడు, తిర్యగ్జాతికి చెందినవాడైన జటాయువును నీవు మోక్ష మార్గంలో పయనించేటట్లు చేయగల్గిన వాడవైతే, మఱి, సీతాదేవిని తిరిగి పొందలేనివాడవై, వ్యథను పొంది, ఆమె కోసం ఎందుకు అన్వేషించావు! నీ లీల అతిమానుషం ఆహా!) అనే ఈ రెండు శ్లోకాలలో ఈ ప్రశ్న వ్యక్తం చేయబడింది. సమాధానం ఆ శ్లోకాలలో లేదు.

ప్రభువు ఈ రెండు శ్లోకాలను తెలిసికొని ప్రశ్నించాడా? లేక, స్వబుద్ధితోనే ఊహించి అడిగాడా? అంటే, దానికి సమాధానం భగవంతునికే తెలియాలి. ప్రశ్నను మాత్రం రాజు అందంగా విద్వత్సన్నిధిలో వ్యక్తం చేశాడు. ఈ ప్రశ్నను ఆలకించిన భట్టరు, రాజు అడిగిన ప్రశ్న చాలా సుసమంజసమైనదని భావించి, దానికి తగిన సమాధానాన్ని గూర్చి ఆలోచించడం ఆరంభించారు. దైవ వశం వల్ల అపుడు రాజు వేరొక కార్యంలో నిమగ్నుడై అన్యమనస్కుడవడం తటస్థించింది. భట్టరు యదృచ్ఛగా సభలో అటుఇటు గమనించ చూడగ, అక్కడ నంబిళ్ళై (కలివైరి గురువు) శిష్యులలో ఒకరు కన్పించారు. అతనిని దగ్గరకు పిలిచిన భట్టర్ "సహృదయా! కలివైరి గురువరుల కాలక్షేప గోష్ఠిలో ఎపుడైన ఇటువంటి సందేహం కల్గి ఉంటుంది, దానికి సమాధానాన్ని కూడ వారు చెప్పి ఉంటారు. ఆ సమాధానమేమో మీకు తెలుసా!'' అని రహస్యంగా చెవిలో అడిగారు. అపుడతడు వెంటనే **"సత్యేనలోకాన్ జయతి"** (తన సత్యవాదిత్వ గుణంతో శ్రీరాముడు లోకాలను వశీకరించుకొన్నాడు) అనే శ్లోకాన్ని ఆధారంగా చేసికొని నమ్బిళ్ళై అవలీలగా ప్రశ్నను సమాధానించారని తెలిపాడు. భట్టర్ సహజం గానే విద్వాంసులైనందున, తమ వివేకంతో అతడు తెల్పిన సమాధానాన్ని చక్కగా గ్రహించి, పరిశీలించి, "నిజమే! ఈ ప్రశ్నకు ఇదే కద తగిన సమాధానం. వేఱొక తగిన సమాధానం ఏమీ లేదు'' అని తలచి, రాజు వద్ద ఆ సమాధానాన్ని తెలుపడానికి సిద్ధమయ్యారు.

ఇంతలో రాజు కార్యాంతరాన్ని పూర్తి చేసికొని, భట్టర్ వైపు తిరిగి "స్వామీ! నేనడిగిన ప్రశ్నకు సమాధానాన్ని ఏమైనా ఇవ్వగలరా? ఏమయినా స్ఫురించిందా?'' అని అడిగారు. భట్టరు వెంటనే "రాజా! ఎందుకు స్ఫురించ లేదు? అపుడే నేను నీకు సమాధానాన్ని ఇవ్వడానికి సిద్ధమయ్యాను. నీవు ఇంకొక పనిలోని నిమగ్నుడవైనందున నేను అన్యపరుని వలె నీకోసం వేచి ఉన్నాను'' అని అంటూ తాము గ్రహించిన సమాధానాన్ని రాజుకు తెలివి, ''రాజా! శ్రీమహావిష్ణువుకు మాత్రమే మోక్ష ప్రదాన శక్తి ఉన్నది. వేరొకరికి లేదు. పరిపూర్ణమైన మనుష్యభావనలో అవతరించిన శ్రీరాముడు జటాయువుకు ఏ విధంగా ముక్తిని ఇచ్చాడు? అనే నీ ప్రశ్న నిజంగా చాల బాగున్నది. ఇక్కడ గ్రహించవలసిన తత్త్వమేమంటే - శ్రీరాముడు తన విష్ణుత్వ మహిమతో జటాయువునకు ముక్తిని ఇవ్వలేదు. శ్రీరామాయణం లోనే **"సత్యేనలోకాన్ జయతి దీనాన్ దానేన రాఘవః"** అని దశరథుడు పల్కిన మాట సుప్రసిద్ధం కద! తన సత్యవాదిత్వ మహిమతో అతడు అన్ని లోకాలను స్వాధీనం చేసికొన్నాడు. వాస్తవానికి లోకంలో ఏయే సత్యవాదులున్నారో వారందరూ లోకాలను తమ స్వాధీనంలో కలవారని గ్రహించాలి. సత్య వాక్కును పలికిన నరులకు కూడ మోక్ష ప్రదానం సుకరం కాకుండా పోదుకద! శ్రీరాముడు కూడ తన సత్యవాక్య గరిమతో జటాయువుకు మోక్షాన్ని అనుగ్రహించాడు కనుక, ఈ విషయంలో అనుపపన్నమైన విషయం ఏమీ లేదు. శ్రీరామాయణంలోనే **"సత్యేనలోకాన్ జయతి... రాఘవః"** అనే ప్రమాణ రత్నం ప్రసిద్ధం కద! ఈ సమాధానంతో నీకు తృప్తి కల్గిందా?- అని అన్నారు. రాజు చాల వివేకం కలవాడు. సహృదయుడు. అందువల్ల "ఈ సమాధానాన్ని ఇంతకు ముందు నేను వినలేదు, చాల బాగున్నది'' అని చాల సంతోషంతో పల్కి, గాఢమైన విమర్శను చేసి, మనస్సులో చాల ఆనందాన్ని అనుభవించాడు.

భట్టరును చాల గొప్పగా సత్కరించి గౌరవించాడు. అపూర్వంగా సత్కరింపబడిన భట్టర్ ఇంటికి బయలుదేరి, "సత్కారంగా పొందిన అమూల్య వస్తువులను నేను ఏ విధంగా ఇంటికి తీసికొని వెళ్ళగలను? కలివైరు గురువరుల దివ్యసూక్తి సుధా సముద్రంలోని చిన్న కణానికి ప్రతిఫలంగా లభించింది, ఇది" అనే వాస్తవాన్ని అపలాపం చేయడానికి (కాదనడానికి) ఇష్టపడక, అత్యంత ప్రామాణిక బుద్ధితో కలివైరి గురుచరణ చరణారవింద సన్నిధిని చేరి, తాము పొందిన పారితోషిక ద్రవ్యరాశిని, వారి ముందు సమర్పించి నిలచి, "దేవరవారి దివ్యసూక్తిసుధా సముద్ర శీకరానికి ప్రతిఫలంగా లభించిన సత్కారం ఇది. దీనిని పరమ కృపతో దేవరవారు స్వీకరించాలి. ఇంతకాలంగా దాసుడు దేవరవారి శ్రీచరణ సన్నిధికి దూరమై, వ్యర్థజన్ముడయ్యాడు. జరిగిన నష్టం చాలు. గడచిన కాలం గడచి పోనీ. ఇకనైనా దాసుని అంతరంగ కింకరునిగా దేవరవారు స్వీకరించి, నిత్యం మీసేవలో నియోగించుకోవాలి" అని సవినయంగా ప్రార్థించి, జరిగిన వృత్తాంతాన్ని వారికి యథాతథంగా విన్నవించి అప్పటి నుండి వారికి నిత్య కింకరులయ్యారు. ఈ ఇతిహాసం ద్వారా శ్రీరాముని సత్య వాదిత్వాన్ని పూర్వాచార్యులు ఏ రీతిలో నిర్వహించారనేది సుగమవుతున్నది.

శ్రీరాముని సత్యవాదిత్వాన్ని గూర్చిన మొదటి ప్రకారం నిరూపణ పూర్తి అయినది. ఇక, రెండవ ప్రకారాన్ని గూర్చి ప్రస్తావిస్తాను. శ్రీరాముని సత్యవాదిత్వ విషయంలో సందేహాన్ని ప్రస్తావించి, దానిని పరిహరించడమే ఈ క్రమం. శ్రీరామాయణంలోని ఒక సందర్భ విశేషంలో శ్రీరాముని సత్యవాదిత్వ భంగాన్ని ఆశంకించి, దానిని చక్కగా పరిహరించడం జరుగుతున్నది. శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేకాన్ని చేసి తపోవనానికి వెళ్ళాలని నిశ్చయించుకొన్న దశరథుడు శ్రీరామునకు ఆ విషయాన్ని తెల్పినవాడై, ఆ తర్వాత ఏమి చేశాడనేది అందరికి తెలిసినదే! 'కైకేయి వచనాలనే వలలో

చిక్కుకొన్న అతడు శ్రీరాముడు వనవాసం వెళ్ళేటట్లు చేశాడు. అపుడు శ్రీరాముని హృదయం ఖేదంతో వివశమైనదా? మోదంతో వివశమైనదా?' అని ప్రామాణికులు గమనించాలి. మకుటాభిషేక సన్నాహ సంభృతుడైన శ్రీరామునకు జటలను ధరించి, నార బట్టలను కట్టుకొని, కందమూల ఫలాలను భుజించి, పద్నాలుగు ఏండ్లు ఘోరమైన అరణ్యదేశాలలో క్రూర మృగ సమూహాలతో నిండిన చోట క్రూరకర్ములైన రాక్షస సమూహాలు నివసించే చోట సంచరించ వలసిరావడం స్మరించినంత మాత్రంలోనే - అయ్యో! అంతులేని ఖేదాన్ని కల్గిస్తుంది - అనే విషయంలో ఏమి సందేహం? అయితే, శ్రీరాముడు మాత్రం తన మాటలలో ఏ మాత్రం ఖేదం లేని, గొప్ప ఆనందాన్ని వ్యక్తం చేశాడు. **"మా చ లక్ష్మణ! సంతాపం కార్షీర్లక్ష్మ్యా విపర్యయే, రాజ్యం వా వనవాసో వా వన వాసో మహోదయః"** (లక్ష్మణా! అదృష్టం తారుమారైనదని విచారించకు. రాజ్యమైతే ఏమి? వనవాసమైతే ఏమి? వనవాసం అనేది చాల గొప్ప అదృష్టం కద!) అనేది వనవాసానికి బయలుదేరేటపుడు శ్రీరామచంద్రుడు పల్కిన మాట. రాజ్యాభిషేకం కంటే వనవాసం మహానందాన్ని కల్గిస్తుంది - అని పలికే శ్రీరాముడు సత్యవాది కద! సహృదయం గానే కద అతడు ఈ విధంగా పలికాడు. ఒకవేళ ఈ మాటలు హృదయ పూర్వకంగా అనకపోతే అతడు సత్యవాది ఏ విధంగా కాగలదు? **"వనవాసో మహోదయః"** (వనవాసం చాల ఆనందకరం) అని హృదయ పూర్వకంగానే పలికాడు అని రామ గుణ పక్షపాతం కలవారు తప్పక అంగీకరిస్తారు. అయితే, తరువాత శ్రీరాముడు పల్కిన మాటల సన్నివేశాన్ని విమర్శించినట్లయితే, **"వనవాసో మహోదయః"** (వనవాసం ఆనందకరమా?) అని అసత్యంగానే చెప్పబడింది, ఇది అహృదయోక్తియే. రాజ్యాభిషేక హానిః, వనవాస ప్రాప్తి - అనే రెండింటి వల్ల కల్గిన గొప్ప విషాదం శ్రీరాముని హృదయంలో గాఢంగా నాటు కొన్నాయి - అనే విషయం ఈ మాటల వల్ల సుస్పష్టమవుతున్నది కద! పంచవటిలో సీతా విశ్లేషం కల్గినపుడు

పలు విధాలుగా దుఃఖాలాపాలను పలికేటపుడు శ్రీరాముడు **"రాజ్యాత్ భ్రంశో వనే వాసో నష్టా సీతా హతో ద్విజః, ఈ దృశీయం మమాలక్ష్మీః నిర్దహేదపి పావకమ్"** (రాజ్యం నుండి భ్రంశం కల్గింది, అరణ్యావాసం దాపురించింది, సీతా వియోగం కల్గింది, జటాయువు నశించాడు. నాకు ఏర్పడిన ఈ దురదృష్ట పరంపర అగ్నిని కూడ దహించగలదు) అని ఎలుగెత్తి రోదించాడు. ఈ శ్లోకానికి అర్థం వివరించి చెప్పవలసి ఉన్నదా? కొంచెం వివరిస్తాను. రాజ్య లాభం కలుగబోతున్నదనే ఆశతో ఉండగా రాజ్యం నుండి భ్రంశం కల్గింది. ఒక వేళ రాజ్యాధికారం నుండి భ్రంశం కల్గినా, రాజధానిలోనే ఎక్కడో ఒక మూల అయిన బిచ్చమెత్తి అయినా ఉండే స్థితి లభించి ఉంటే ఈ వేదనను సహించడం సాధ్యమయేది. అయ్యో! వనవాసం కూడ చేయవలసిన అగత్యం దాపురించింది - అని అంటూ తరువాత శ్రీరాముడు నిర్వేదాతిశయాన్ని వ్యక్తం చేస్తున్నాడు. రాజ్యభ్రంశం, వనవాసం అనే ఇవి రెండు శోచనీయాలు కాకపోతే శ్రీరాముడీ విధంగా పల్కి ఉండేవాడు కాదుకద! అందువల్ల శ్రీరాముని హృదయంలో గాఢంగా, గూఢంగా నాటుకొన్న విషాదాతిశయం తప్పక ఉండే ఉంటుంది. అందువల్లనే **"రాజ్యాత్ భ్రంశః"** అని దుఃఖపరంపరలలో ఒకటిగా రాజ్యభ్రంశం నిర్దేశింపబడింది. దీనికి విపరీతంగా, **"వనవాసోమహోదయః"** అని ఉపక్రమించి పల్కిన మాట అసత్యమే కాగలదు. పరిహరించ డానికి వీలు లేనిది, అనుభవించి తీరవలసినదిగా ఏర్పడినది అయిన శోకాన్ని శోకమని పల్కడం వ్యర్థమనే అభిప్రాయంలో దానిని సంతోషంగా మార్చి పల్కడం బాహ్య వేషమే కాలగదు.

ఒకానొక బ్రాహ్మణుడు ఒక మహాధనికుని భవనంలో శ్రాద్ధంలో భోక్తగా పిలువబడ్డాడు. ఆ బ్రాహ్మణుడు తనకు గొప్ప ధన లాభం కలుగబోతుందనే ఆశతో ఆ పిలుపును అంగీకరించి, సమయంలో స్నానాదులను

చేసి, ధనికుని ఇంటికి వెళ్లాడు. అపుడు శ్రాద్ధాన్ని నిర్వర్తించే ధనికుడు బ్రాహ్మణునితో "స్వామీ ముందుగానే వేరొక గ్రామంలో పిలువబడిన సన్నిహిత బంధువు ఈనాడే వచ్చాడు. మీరు శ్రమపడవద్దు. కొంచెంసేపు నిద్రించండి. శ్రాద్ధం పూర్తి అయిన తరువాత ఇష్టపంక్తిలో భుజించి వెళ్ళవచ్చు" అని అన్నాడు. అపుడు ఆ బ్రాహ్మణుడు ధనికునితో యుద్ధానికి సిద్ధమవుతాడా? అతడు గొప్ప సంతోషాన్ని బయటకు నటిస్తూ - "అలాగా! అయితే చాల సంతోషం. నాకు కూడ చాల అనారోగ్యంగా ఉన్నది. మీ ఆజ్ఞను కాదనలేక అంగీకరించాను; అంతే. బంధువు వచ్చినట్లయితే, అతడే కద వరించదగినవాడు. రోగంతో బాధపడే వాడను అయిన నాకు అదృష్టవశాత్తు విడుదల కల్గింది. నియంత్రణ నిర్బంధం నుండి విముక్తుడ నయ్యాను - అని చాల ఆనందిస్తున్నాను" అని తెచ్చిపెట్టుకున్న నవ్వుతో అన్నాడు. అతడు మాట్లాడే ఈ మాటలన్నీ వాస్తవాలేనా? నమ్మదగినవేనా? లోపల అతని పరితాపం ఎంతటిదో? అనే విషయాన్ని అల్పజ్ఞుడు కూడ తెలియగలడు కద? బయటకు చెప్పవలసిన మాట అటువంటిదే అనే విషయం సర్వ సంప్రతిపన్నం కద! ఈ రీతిలోనే శ్రీరామచంద్రుడు కూడ వనవాసం తనకు విధించినపుడు అంతులేని పరితాపాన్ని మనస్సులో పొందుతున్నా, బయటకు చెప్పవలసిన మాటలను ఆ విధంగా **"వనవాసోమహోదయః"** అని అన్నాడు. కడుపులో ఉండే పరితాపం వ్యక్తం చేస్తూ తరువాత **"రాజ్యాద్భ్రంశో వనేవాసః"** ఇత్యాదిగా పలికాడు అందువల్ల శ్రీరాముడు సత్యవాది కాడు - అనే ఆక్షేపం ప్రాప్తమైనది.

దీనికి ఇపుడు సమాధానం తెలుపబడుతున్నది. ఈ వాదం కొంచెం కూడ సమర్థనీయం కాదు. **"వనవాసోమహోదయః"** అనే మాట నిజంగా ఋజు స్వభావంతో పల్కినదే. వాస్తవానికి, ఆ మాట ఏ అభిప్రాయంతో పలికాడనే విషయాన్ని గమనించాలి. గుణాభిరామ అయిన సీతాదేవితో కలసి

ఏకాంతంగా వాసం సిద్ధిస్తుంది. పరమ భాగవతుల అభిమానంతో వర్తించడం అనేది పరమ ప్రయోజనంగా ఫలిస్తుంది - అనే రెండు ప్రధాన ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని శ్రీరాముడు హార్దమైన కుతూహలాన్ని నిండుగా కలవాడై కద ఆ విధంగా పలికాడు. కాని, ఆ రెండు ప్రధాన ప్రయోజనాలు దుర్విధికారణంగా వ్యభిచారాన్ని పొందాయి (సిద్ధించ లేదు - విపరీత సిద్ధిని పొందాయి) రావణుడు వైదేహిని అపహరించాడు. పరమ భాగవతోత్తముడైన జటాయువు ప్రాణాలను హరించాడు. ఈ విధమైన భరింపరాని క్లేశం కల్గడంచే హార్దమైన వనవాసంలో కుతూహలం లోపించడం చేత, ఇంతకుముందు పరమానంద మూల కారణాలుగా ఆశపడిన రాజ్యభ్రంశ వనవాసాలు శోచనీయ స్థితిని పొందాయి. శోకాన్ని కల్గించాయి. అయితే ఈ నిర్వేదం అంతకు ముందే శ్రీరామునిలో ఉన్నదని అనడం ఎంత మాత్రం సరికాదు కద! **"నష్టా సీతా హతో ద్విజః"** (సీతా వియోగం కల్గింది, జటాయువు చంపబడ్డాడు) అనేది హేతూక్తిగా భావించాలి. సీతాదేవితో, జటాయువుతో సహవాసం చేయాలనే ఆశ వారి విశ్లేషం వల్ల సిద్ధించనందున విలపించే సందర్భంలో **"రాజ్యాద్భ్రంశో వనేవాసః"** అని అనడం ఏ విధం గాను శ్రీరాముని ఆర్జవగుణంలోని లోపాన్ని నిరూపించలేదు. ఇక్కడ ఒక లౌకికమైన దృష్టాంతాన్ని గమనించండి.

ఒకానొక పరమభక్తుడు తిరుమలలో శ్రీనివాసుని బ్రహ్మోత్సవాన్ని సేవించాలని చిరకాలంగా చాల కుతూహలంతో ఉండేవాడు. అతడు ఒకానొక సందర్భంలో ఆ ఉత్సవాన్ని సేవించడం కోసం తిరుమలకు బయలు దేరాడు. ప్రయాణం అంత సులభం కానందున యాత్రలో పలుక్లేశాలను అనుభవించాడు. దారిలో పెద్ద వర్షం కురిసింది. నిలువడానికి తగిన చోటు దొరకలేదు. జనసమ్మర్దం భరించరానిదిగా ఉన్నది. భగవానుని తిరువీధి ఉత్సవానికి కూడ అవరోధం కల్గింది. ఇటువంటి అవస్థలో ఆ పరమ భక్తుని

ఆక్రందనం ఏవిధంగా ఉంటుంది? "నా ఇంటిలో సుఖంగా ఉండకుండా, అయ్యో! ఎందుకోసం నేను యాత్రకు బయలు దేరాను? ఈ కష్టాలన్నీ అనుభవించవలసిన అక్కర ఉన్నదా?'' అని పలు విధాలుగా ఆక్రందించాడు. ఇంత మాత్రం చేత, అతడు ఇంటి నుండి బయలుదేరినపుడు అతనికి హృదయ పూర్వకమైన ఉత్సాహం లేదని అనగలమా? నిజానికి అతడు చిరకాలంగా వృద్ధి చెందిన హార్దమైన కుతూహలంతోనే బయలు దేరాడు కాని, అనుకోకుండా ఎదురైన పలు క్లేశాల వల్ల ఇటువంటి మాటలు అతని నోటి నుండి వెలువడ్డాయి. ఏతావన్మాత్రంతో అతని ఋజుత్వంలో సందేహ పడరాదు కద! ఇదే న్యాయాన్ని శ్రీరామచంద్రుని విషయంలో కూడ అనుసంధించాలి, కనుక **"వనవాసోమహోదయః"**అనే మాట సహృదయమే కాని, అహృదయం కాదు - అని గ్రహించాలి.

శ్రీరామాయణ ప్రవచనిరతులైన కొందరు ప్రాజ్ఞులు తమ ఉపన్యాస గోష్ఠులలో లక్ష్మణుని అనృతవాదిగా పల్కుతున్నారు. ఈ విషయంలో వారి నిరూపణ ప్రక్రియ ఈ రీతిలో ఉన్నది. లక్ష్మణుడు, తన అన్న అయిన శ్రీరామునితో అతడు వనవాసానికి బయలుదేరే సమయంలో **"అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపతశ్చ తే"** (శ్రీరామ-అయోధ్య-31-25) (నీవు మేల్కొని ఉండేటపుడు, నిదురించేటపుడు అన్ని కైంకర్యాలను చేస్తాను) అని ప్రతిజ్ఞ చేశాడనే విషయం విశ్వ ప్రసిద్ధం. "శ్రీరామా! నీవు ఏమేమి చెప్పినా దానిని అంతటిని నిర్వర్తిస్తాను'' అని లక్ష్మణుడన్నాడు. దీనిని బట్టి శ్రీరాముడు దేనిని చేయమని అంటాడో, దానిని ఏ ఆటంకం, లోపం లేకుండా చేసినపుడే కద **"అహం సర్వం కరిష్యామి"** అనే మాట యథార్థమవుతుంది. ఇపుడు, శ్రీరాముడు పల్కిన దానిని అంతటినీ లక్ష్మణుడు నిర్వర్తించాడా? అని పరిశీలించవలసి ఉన్నది. గమనిస్తే, నిర్వర్తించలేదనే సమాధానమే వస్తుంది.

వనానికి బయలుదేరే శ్రీరామచంద్రుడు, తనతో పాటు అరణ్యానికి రావాలని కోరిన లక్ష్మణుని రావద్దని నిషేధించాడు. కాని, లక్ష్మణుడు ఆ విధంగా వనానికి రావడం మానలేదు, శ్రీరామునితో పాటు అరణ్యానికి వచ్చాడనేది ప్రసిద్ధం. దీని వల్ల **"అహం సర్వం కరిష్యామి"** అనే మాటను అతడు పాలించలేదని, అందువల్ల అతడు అసత్యం పల్కినట్లే అయినదని సిద్ధిస్తున్నది. దీనివల్ల సౌమిత్రి యొక్క అసత్యవాదిత్వం ప్రతిష్ఠితమవుతున్నది. ఇంత మాత్రమే కాదు; వనవాసాన్ని పూర్తి చేసికొని, సాకేత నగరాన్ని చేరిన తరువాత పట్టాభిషేకోత్సవాన్ని అనుభవిస్తూ శ్రీరామ చంద్రుడు, యౌవరాజ్యాభిషేకాన్ని లక్ష్మణుడు జరుపడం కోసం ఆజ్ఞాపించాడు. ఆ ఆదేశాన్ని కూడ అతడు (లక్ష్మణుడు) తిరస్కరించాడు అనేది **''యదా న సౌమిత్రి రుపైతి యోగమ్ (వాల్మీకి రామ -యుద్ధ-128-93)''** (ఎపుడు లక్ష్మణుడు యౌవరాజ్యభిషేకానికి అంగీకరించలేదో) ఇత్యాదిగా స్పష్టంగా తెలుస్తున్నది. ఇందువల్ల కూడ **"అహం సర్వం కరిష్యామి"** అనే అతని మాట అసత్యమని సిద్ధిస్తున్నది - అని ఈ విధంగా ప్రవచించే మహాత్ములు సదాచార్య సన్నిధి సేవా విముఖులనే విషయంలో సందేహ గంధంలేశం కూడ లేదు. ఈ మాట అపచార మయం కద. ఇక్కడ గమనించవలసిన విషయ మేమంటే - **"అహం సర్వం కరిష్యామి"** అనే సూక్తికి పూర్వవాక్యం ఏమి? - అని. **"భవాంస్తు సహవైదేహ్యా గిరిసానుషు రంన్యతే అహం నర్వం కరిష్యామి జాగ్రతః న్వవతశ్చ తే''** (రామా-అయోధ్యా-31-25) అనేది సంపూర్ణ శ్లోక పాఠం. చిత్ర కూట పర్వత సానువులలో సీతతో పాటు విహరించేటపుడు శ్రీరామునకు సర్వవిధ కైంకర్యాలను చేయాలనే ఆశనే కద లక్ష్మణుడు వ్యక్తం చేశాడు. సదా శ్రీరామునితో ఉంటూ, అన్ని విధాలైన కైంకర్యాలను చేస్తానని సౌమిత్రి చేసిన విజ్ఞాపనం. అది ఆ రీతిలోనే పరిపాలింపబడినదనే విషయంలో ఏమార్పు కాని, సందేహానికి కాని తావు లేదు. ఒకవేళ ఆ విధంగా లక్ష్మణుడు చేసి ఉండకపోతే

అపుడు కద - ఆ మాటలో దోషం సంభవిస్తుంది. లక్ష్మణుడు ఏ విధంగా అన్నాడో, దానిని ఆ రీతిలోనే నిర్వర్తించాడనే విషయంలో ఎవరూ ఆక్షేపాన్ని చేయలేదు. “వనవాస సమయంలో నీతో కలిసి ఉండి, అన్ని విధాలైన కైంకర్యాలను చేస్తాను”- అని పల్కిన ప్రతిజ్ఞలకు విరోధంగా అతడు నగరంలో ఉండి ఉంటే, అపుడే అతని మాట సత్యవాదిత్వభంగం కాని, అసత్యవాదిత్వ ప్రతిష్ఠ కాని కలిగి ఉంటుంది. “వనవాస కాలంలో దివ్యదంపతులైన మీకు ఏయే కైంకర్యం ఆవశ్యకమో, దానిని అన్నిటిని నేను నిర్వర్తిస్తాను’ అని కదా సౌమిత్ర వచో వైఖరి. ఈ విధంగా అతడు చేయలేదని ఎవడూ అనలేడు. ఇటువంటి లక్ష్మణుని ప్రతిజ్ఞా విషయంలో అన్యథా భావం ఏమైనా కన్పిస్తున్నాదా? - అని విచారించాలి. కొంచెం కూడ అన్యథా భావాన్ని విషమ ప్రచారాన్ని చేసే మహనీయులు సైతం చూపలేరు. అందువల్ల లక్ష్మణుని అసత్యవాదిత్వ ప్రస్తావ ప్రసక్తి ఇసుమంతైనా లేదనేది సిద్ధం.

**“అహం సర్వం కరిష్యామి”** (నేను అన్ని కైంకర్యాలను చేస్తాను) అనే లక్ష్మణుని విజ్ఞప్తి శ్రీరామాయణంలో ఎక్కడ ఉన్నది? అనే విమర్శ ఆవశ్యకమైనది. అయోధ్యాకాండలోని 29వ సర్గలో చివర ఈ శ్లోకం ప్రకాశిస్తున్నది. ఆ సర్గ లోనే - శ్రీరాముడు సీతతో పాటు వనవాసానికి వెళ్ళబోతున్నాడని తెలిసి లక్ష్మణుడు కన్నీళ్ళతో నిండిన ముఖంతో, శోకాన్ని సహించలేక, సీతా పురుషకార పూర్వకంగా శ్రీరాముని చరణాలలో శరణాగతిని చేసి వారితో పాటు తాను కూడ వనవాస యాత్రలో రుచిని కల్గి ఉన్నాననే విషయాన్ని విజ్ఞాపన చేసే వృత్తాంతం ప్రస్తుతమైనది. అపుడు శ్రీరాముడు పలు విధాలుగా లక్ష్మణుని ఓదార్చి, అతనిని రావద్దని నిషేధించాడు. లక్ష్మణుడు శ్రీరాముని **“అనుజ్ఞాతశ్చ భవతా పూర్వ మేవ యదస్మ్యహమ్, కిమిదానీం పునరిదం క్రియతే మన్నివారణమ్?”** (రామా-అయోధ్య-31-7) (నీవు

ఇంతకు ముందే వనానికి నీతో నేను రావడానికి అనుమతించావు కద. మళ్ళీ ఇపుడు నన్నెందుకు నిషేధిస్తున్నావు? భగవాన్! రామచంద్రా! ముందుగానే నన్ను నీతో రావడానికి అంగీకరించిన నీవు ఇపుడెందుకు వద్దని అంటున్నావు!) - అని అడిగిన లక్ష్మణునితో శ్రీరాముడు కౌసల్య, సుమిత్రాదుల రక్షణ కోసం నీవు అయోధ్యలో ఉండవలసి ఉన్నదని అన్నాడు. అంతే కాకుండా **"నస్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాం చ సుదుఃఖితామ్, భరతో రాజ్య మాసాద్య కైకేయ్యాం పర్యవస్థితః"** (రామా-అయోధ్యా-31-14) (రాజ్యాన్ని పొందిన భరతుడు, కైకేయి సేవలో నిమగ్నుడై కౌసల్యను, మిక్కిలిగా దుఃఖితురాలైన సుమిత్రను స్మరించబోడు) అని కూడ అన్నాడు. అపుడు లక్ష్మణుడు **"తవైవ తేజసా వీర! భరతః పూజయిష్యతి, కౌసల్యాంచ సుమిత్రాం చ ప్రయతో నాత్ర సంశయః"** (వీరుడవైన శ్రీరామా! నీ ప్రభావం వల్ల తప్పక భరతుడు కౌసల్యను, సుమిత్రను వినయం కలవాడై సేవిస్తాడు. ఇందులో ఏ సందేహం లేదు) అని, **"కురుష్వ మామనుచరం వైధర్మ్యం నేహ విద్యతే, కృతార్థోహం భవిష్యామి తవ చార్థః ప్రకల్పతే, ధనురాదాయ సశరం ఖనిత్ర పిటకాధరః, అగ్రతస్తే భవిష్యామి పంథానమను దర్శయన్, ఆహరిష్యామి తే నిత్యం మూలాని చ ఫలాని చ, వన్యాని యాని చాన్యాని స్వాహారాణి తపస్వినామ్"** (నన్ను నీ అనుచరునిగా చేసికో. ఇందులో తప్పు ఏమి లేదు. నేను కృతార్థుడను కాగలను. నీ ప్రయోజనం కూడ సిద్ధిస్తుంది. బాణంతో కూడిన ధనుస్సును చేతితో ధరించి, తవ్వు గోలను, పూలబుట్టను ధరించి, నీకు దారి చూపిస్తూ నీ ముందు వెళ్ళగలను, నిత్యం కందమూల ఫలాలను నీకు తీసికొని వస్తాను. అంతేకాక, ఇంకా పలు వనంలో లభించే, తపస్వి జనులకు పనికివచ్చే మంచి ఆహారాలను తీసుకొని వస్తాను) అని అన్నాడు. ఈ విధంగా పల్కిన తర్వాతనే లక్ష్మణుడు - **"భవాంస్తు సహ వైదేహ్యా**

**గిరిసానుషు రస్యంతే, అహం సర్వం కరిష్యామి జాగ్రత స్స్వపతశ్చ తే"** (నీవు, సీతాదేవితో కలిసి చిత్ర కూట పర్వ సానువులలో విహరించేటపుడు అన్ని విధాలైన కైంకర్యాలను నీవు మేల్కొని ఉండేటపుడు, నిద్రించేటపుడు చేస్తాను) అని అన్నాడు. ఇపుడేమయిందో గమనించాలి. లక్ష్మణుని అసత్య వాదిత్వాన్ని గూర్చి కొంచమైనా ప్రస్తావించే అవకాశం కూడ శ్రీరామాయణంలో లేదు. పారతంత్ర్య విషయంలో భరతుని కంటే తక్కువ వాడనేది ప్రసిద్ధమే, కాని, అంత మాత్రంతో లక్ష్మణుని అసత్యవాదిత్వ వాదం సముచితం కాదు. ఈ ప్రాసంగికమైన విషయం ఇక అటు ఉండనివ్వండి.

## శ్రీరామచంద్రుని యుక్తవాదిత్వగుణానుభవం

లోకంలో సత్యవాదిత్వమనే గుణం కంటే, యుక్త వాదిత్వమనే గుణం ప్రధానమని గుణజ్ఞులు లెక్కిస్తారు. సత్యవాది అయినా, యుక్తవాది కాకపోతే, అతడు గుణాధికుల గోష్ఠిలో లెక్కింపబడడం లేదు. శ్రీరామాయణంలో శ్రీరాముని వచనాలనేకం ఉన్నాయి. వాటిలో ఏయే వచనాలు మిత ప్రజ్ఞను కల మన బుద్ధికి అయుక్తాలనే భావనను కల్గిస్తాయో, వాటిని అనువదించి, ఆ వచనాలలో కలిగే సందేహ ప్రకారాన్ని ఉపపాదించి, తరువాత వానికి సమాధానాన్ని వివరించడం ద్వారా శ్రీరామగుణ విశేషాలను అనుభవిద్దాం.

దశరథ మహారాజు ఎపుడు శ్రీరామునకు పట్టాభిషేకాన్ని చేయాలనే నిర్ణయాన్ని చేశాడో, ఆ నిర్ణయాన్ని శ్రీరాముని వద్ద వ్యక్తం చేశాడో, అపుడు శ్రీరాముడు లక్ష్మణుని ఉద్దేశిస్తూ ఈ విధంగా అన్నాడు.

**"లక్ష్మణేమాం మయా సార్థం ప్రశాధి త్వం వసుంధరామ్, ద్వితీయం మేంతరాత్మానం త్వామి యం శ్రీ రుపస్థితా, సౌమిత్రే! భుంక్ష్వ భోగాంస్త్వ మిష్టాన్ రాజ్య ఫలాని చ, జీవితం చ హి రాజ్యం చ త్వదర్థమభికామయే"** (శ్రీరామా-అయోధ్యా-4-43,44) (లక్ష్మణా!, ఈ భూమిని నాతో పాటు నీవు పాలించు. నాకు రెండవ అంతరాత్మవంటి నిన్ను ఈ సంపద వరించింది. సౌమిత్రీ! నీ కిష్టమైన రాజ్య ఫలాలను, భోగాలను అనుభవించు. నేను నా జీవితాన్ని, రాజ్యాన్ని నీ కోసం కోరుకొంటున్నాను) అనే ఈ శ్రీరామవచనాలు యుక్తంగా భాసిస్తాయి. తరువాత, భరతుడు చిత్రకూటానికి వచ్చినపుడు, అతడు శ్రీరాముని రాజ్యాన్ని స్వీకరించమని ప్రార్థించాడు. అపుడు శ్రీరాముడు భరతుని ఉద్దేశించి, **"పురా భ్రాతః! పితానస్స మాతరం తే సముద్వహన్, మాతామహే సమాశ్రౌషీద్రాజ్య శుల్కమనుత్తమమ్"** (శ్రీరామా-అయోధ్యా-107-3) (సోదరా! పూర్వం మన

తండ్రి నీ తల్లిని వివాహం చేసికొన్నపుడు, మీ పితామహునకు రాజ్యాన్ని గొప్ప శుల్కంగా మాట ఇచ్చాడు) అని అన్నాడు. ఈ మాట వల్ల ఏమి వ్యక్తమవు తున్నది? రాజ్యాభిషేకమనేది భరతునకే న్యాయమని, రాముని హార్దమైన అభిప్రాయమని తెలుస్తున్నది. ఈ విధమైన అభిప్రాయాన్ని కల శ్రీరాముడు యౌవరాజ్య పట్టాభిషేక ప్రస్తావ సమయంలో యుధాజిత్తు నగరం నుండి వెంటనే భరతుని తీసికొని రమ్మని ప్రార్థించాలి. **"మాతామహే సమాశ్రౌషీత్"**(నీ తాతకు మాట ఇచ్చాడు) అను భరతుని వద్ద పల్కిన మాట అపుడే రామునకు తెలిసినదా ఏమి? చాల కాలం క్రితమే అది అతని మనస్సులో ఉన్నది కద! ఋజుబుద్ధిని కల రాముడు ఈ మాటను ముందుగానే దశరథుని వద్ద పల్కి ఉండాలి. అదే కద యుక్త మవుతుంది. కాని, దానికి విరుద్ధంగా లక్ష్మణుని వద్ద **"లక్ష్మణేమాం మయా సార్ధం ప్రశాధి త్వం వసుంధరామ్"** (రామా-అయోధ్యా-4-43) (లక్ష్మణా! ఈ భూమిని నీవు నాతో పాటు పాలించు అని పల్కిన మాట చాల అయుక్తంగా తోస్తున్నది కద! శ్రీరాముడే ఏవిధంగా ఇటువంటి అయుక్తమైన మాటలను పలికాడు? - అనే ప్రత్యవస్థానం ఎదురవుతున్నది. దీనికి సమాధానం చెప్పబడుతున్నది.

శ్రీరాముడు దీర్ఘదర్శి కద! భరతుడే రాజ్యానికి తగినవాడనే హార్దమైన అభిప్రాయంలో ఏ వైకల్యం లేదు. రాజ్యాభిషేకాన్ని గూర్చి ప్రస్తావించిన దశరథుని వద్ద భరతుని వెంటనే తీసికొని రమ్మని ప్రార్థన చేయకపోవడమే మంచిదని రాముడు భావించడంలో కూడ ఏ విధమైన తక్కువదనం లేదు. అంతేకాక, ఆ విషయాన్ని రాముడు కొంచెం కూడ ప్రస్తావించక పోవడం కూడ నిజమే. దీనికి ఏమి కారణమని నిపుణంగా ఆలోచించడం అంతర్వాణి పరులకు చాల ఆవశ్యకం. దశరథుడు ఆయా వాక్యాలను శ్రీరాముని వద్ద పల్కుతూ, ఈ విషయాన్ని అన్నాడు. **"విప్రోషితశ్చ భరతో యావదేవ పురాదితః,**

**తావదేవాభిషేక స్తే ప్రాప్తకాలో మతో మమ, కామం ఖలు సతాం వృత్తే భ్రాతా తే భరతః స్థితః, జ్యేష్ఠానువర్తీ ధర్మాత్మా సానుక్రోశో జితేంద్రియః, కింతు చిత్తం మనుష్యాణా మనిత్య మితి మే మతిః"** (రామా-అయోధ్యా-4-25,26,27) (ఇక్కడకు, దూరంలో ఉండే భరతుడు తిరిగి వచ్చే లోగానే నీ అభిషేకం జరగాలనేది నా అభిప్రాయం. నీ సోదరుడు భరతుడు మంచి వర్తనాన్ని కలవాడు. జ్యేష్ఠులను అనుసరించేవాడు, ధర్మాత్ముడు, దయ కలవాడు, జితేంద్రియుడు, నిజమే. కాని, మానవుల మనస్సు నిలకడలేనిదని నా అభిప్రాయం) అనేవి దశరథ వాక్యాలు. భరతుని భక్తిలోని యాథాత్మ్యాన్ని తెలిసిన శ్రీరాముడు ధశరథుడు పల్కిన ఈ మాటలను వినిన వెంటనే స్పందించి, తగిన సమాధానాన్ని తప్పక చెప్పి ఉండాలి. **"రాజ్యం చాహంచ రామస్య"** (నేను, రాజ్యం కూడ రామునకు శేష భూతులం) అనే మిక్కిలి దృఢమైన నిశ్చయాన్ని కల్గిన భరతుని స్వభావాన్ని గూర్చి దశరథుని కంటే చాల బాగా తెలిసినవాడు కదా శ్రీరాముడు. అందువల్ల అతడు చక్రవర్తి సమీపంలో భరత ప్రశంసను మిక్కిలిగా చేసి ఉండాలి. "మహాత్మా! తండ్రీ! భరతుడు ఎంత మాత్రం ఏనాటికీ శంకించదగినవాడు కాడు. నాపై గల ప్రేమను నిరూపకంగా గల్గిన ఆ భరతుడు ఏ విధంగానూ నాకు విరుద్ధంగా వర్తించేవాడు కాడు. ఈ శుభసందర్భంలో అతడు మనతో తప్పక ఉండాలి. అతనిని ఇక్కడకు రప్పించండి'' అన నిర్బంధపూర్వకంగా పల్కి ఉండాలి. కాని, శ్రీరాముడు ఏమీ పలుకలేదు. ప్రతిషేధించనది అనుమతింపబడినదే కాగలదనే న్యాయంతో దశరథుడు పల్కిన దోషాన్ని కాదని పల్కినందున, దానిని అతడు అంగీకరించాడని పలికే అవకాశం కూడ ఉన్నది. ఇటువంటి, భరతుని దోషాన్ని పలికే ప్రసంగాన్ని శ్రీరాముడు ఏ విధంగా సహించగలిగాడు? అనే విషయాన్ని గాఢంగా విమర్శిస్తే, ఈ విషయం చక్కగా వ్యక్తమవుతున్నది. భరతుడు ఆ సమయంలో అక్కడ ఉంటే, వెంటనే కైకేయీ వర ప్రార్థనాదులన్నీ పూర్తిగా

వ్యర్థం కాగలవు. **"న మంథరాయా న చ మాతు రస్యా దోషో న రాజ్ఞో న చ రాఘవస్య, మత్పాపమే వాత్ర నిమిత్త మాసీత్ వన ప్రవేశే రఘు నందనస్య"** (రామా-అయోధ్యా-82-12) శ్రీరాముడు వనానికి వెళ్ళడంలో మంథర దోషం కాని, నా తల్లి దోషం కాని, దశరథుని దోషంకాని, శ్రీరాముని దోషంకాని లేదు. కేవలం నా పాపం మాత్రమే కారణమైనది) అని తరువాత పల్కిన భరతుని దృఢమైన నిశ్చయాన్ని తెలిసినవాడు, శ్రీరాముడు. భరతుడు ఇక్కడకు వస్తే నా అభిషేకం తప్పక జరుగుతుందని, "మహర్షుల కైంకర్యం, పుణ్య తీర్థ పర్యటనం మొదలైన వాని పట్ల చాల ఆసక్తిని కల నాకు వనవాస రుచి భగ్నం కాగలదు. అందువల్ల భరతుని తీసికొని వచ్చే ప్రసక్తి నామ మాత్రంగా కూడ ఉచితం కాదు'' అని శ్రీరాముడు చాల దృఢంగా భావించాడు. అందువల్లనే రాముడు దశరథ వచనాలను కొంచెం కూడ నిషేధించలేదు. అందుచేత అతని మనోరథం చక్కగా నెరవేరింది. కనుక **"లక్ష్మణేమాం మయా సార్థం ప్రశాధి త్వం వసుంధరామ్"** (రామా-అయోధ్యా-4-43) (లక్ష్మణా! ఈ భూమిని నాతో పాటు నీవు పాలించు) అని శ్రీరాముడు యుక్తంగానే పలికాడని గ్రహించడం యుక్తం.

ఇపుడింకొక శ్రీరామవచనం ప్రస్తావింప బడుతున్నది. భరతుడు భరద్వాజాశ్రమ సమీపంలోనికి సపరివారంగా వచ్చినపుడు రామచంద్రుడు చిత్రకూటంలో అక్కడ ఉండే పలు విధాలైన అందాలను సీతకు చూపిస్తూ ఆమెతో సరస సల్లాపాలను పల్కుతూ ఈ విధంగా అన్నాడు. **"యదీహ శరదోనేకాః త్వయా సార్ధ మనిందితే!, లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకః ప్రధక్ష్యతి"** (రామా-అయోధ్యా-94-15) (ఏ దోషం లేని సీతాదేవీ!, నేను ఇక్కడ పలు సంవత్సరాల పాటు నీతోపాటు, లక్ష్మణునితో పాటు నివసిస్తే, నన్ను దుఃఖం బాధించదు).

ఇక్కడ గోవిందరాజులు వ్యాఖ్యానిస్తూ ఈ రీతిలో అన్నారు. **"నగరత్యాగజం దుఃఖం న మాం పీడ యిష్యతి"** (నగరాన్ని విడచినందువల్ల కల్గిన దుఃఖం నన్ను బాధించదు అనేది - దీని అర్థం.) అందువల్ల అయోధ్యా నగరాన్ని విడచి రావడమనేది తనకు దుఃఖాన్ని కల్గించేది - అని రామచంద్రుడు తన మాటతో స్వయంగా వ్యక్తం చేశాడని తెలుస్తున్నది. ఇది ఏ విధంగా పొసగుతుంది? **"వనవాసో మహోదయః"** (రామా-అయోధ్యా 22-29) (వనవాస మనేది గొప్ప భాగ్యం) అనే మాటలో ఇది విరోధిస్తున్నది కద - అని శంకించవలసి వస్తుంది - అని అంటే, దీనికి బదులు తెలుపబడుతున్నది.

**"న మాంశోకః ప్రథక్ష్యతి"** (రామా-అయోధ్యా-94-15) అని శ్రీరాముడు పల్కిన మాటలో శోకమనే దానికి ఏమి అర్థమనే విషయం విమర్శించదగినది' పొందదగిన రాజ్యాన్ని పొందలేదనే కారణం చేత శ్రీరామునకు శోకం కలుగలేదనేది సత్యం. తల్లిదండ్రులకు సేవ చేయడమనే అదృష్టాన్ని కోల్పోవడం వల్ల కల్గిన శోకం అయితే అవర్జనీయం కద. అటువంటి శోకం కూడ రామునకు లేదని, అయ్యో! ఎవరన గలరు? సాకేత నగర నివాస కాలంలో తల్లి దండ్రుల సేవ మొదలైన వానితో మనస్సులో ఆనందం తప్పక కల్గుతుంది కద! వనవాస కాలంలో ఎపుడెపుడు ఆ సంతోష స్మరణ కల్గుతుందో, అపుడపుడు ఆ సంతోషాన్ని కోల్పోయినందువల్ల కల్గిన ఖేదం కూడ హృదయాన్ని తాకుతుంది కద! అటువంటి శోకాన్ని శ్రీరాముడు దాచుకోవాలని అనుకుంటాడా? ఆ విధంగా ఆలోచించడం తగదు కద! అందుచేత, **"యదీహ శరదోనేకాస్త్వయా సార్థమనిందితే, లక్ష్మణేన చ వత్స్యామి న మాం శోకః ప్రథక్ష్యతి"** (రామా-అయోధ్య-94-15) (నిందింపబడని సీతా! నేను పలు సంవత్సరాల పాటు ఇక్కడ నీతోపాటు, లక్ష్మణునితో పాటు నివసించ గల్గితే, నన్ను దుఃఖం బాధించదు) అని శ్రీరాముడు పల్కడం అయుక్తం కాదని

తెలియాలి.

ఇపుడింకొక శ్రీరాముని వచనం ప్రస్తావించబడుతున్నది. శ్రీరామచంద్రుని ఆయోధ్యా నగరానికి తిరిగి తీసికొనిరావడం కోసం చాల అభినివేశంతో చిత్రకూట పర్వత ప్రాంతానికి వెళ్ళిన భరతుడు ఎపుడు దశరథ చక్రవర్తి పరలోకాన్ని చేరాడనే వార్తను శ్రీరామునకు తెలియజేశాడో, అపుడు చిరకాలం మూర్ఛను పొందిన రాఘవుడు కొంతసేపటికి తెప్పరిల్లి, సీతాదేవిని, లక్ష్మణుని చూచి **"సీతే! మృతస్తే శ్వశురః పిత్రా హీనోసి లక్ష్మణ!"** (రామా-అయోధ్యా-102-15) (సీతా! నీ మామ మరణించాడు; లక్ష్మణా! నీవు తండ్రి లేనివాడవయ్యావు) అని అన్నాడు. నిజానికి అయ్యయ్యో! మన తండ్రి గారు పరమపదించారు! అయ్యో!'' అని కద శ్రీరాముడు పల్కి ఉండాలి. కాని ఇక్కడ వాగ్వైఖరి ఆ రీతిలో లేదు. **"సీతే! మృతస్తే శ్వశురః"** (సీతా! నీ మామ చనిపోయాడు) అనే మాటను అటు ఉండనివ్వండి **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** (లక్ష్మణ! నీవు తండ్రి లేని వాడవైనావు) అని అనడం ఏ విధంగా కుదురుతుంది! కేవలం లక్ష్మణుడు మాత్రమే తండ్రిని కోల్పోయిన వాడయ్యాడా! ఏమి? శ్రీరాముని తండ్రి జీవించి ఉన్నాడా ఏమి?!'' అని పండితులు ప్రశ్నిస్తే, ఏమి బదులు పలకాలి? కొందరు ఈ విధంగా అడిగినా, అడగక పోయినా, రామచంద్రుడు మాత్రం ఈ విధంగా పల్కడం తగదు కద! సుయుక్త వాది అయిన శ్రీరాముడు ఈ రీతిలో ఏవిధంగా అన్నాడు?

ఈ విషయంలో కొందరు ఈ క్రింది రీతిలో సమాధానం పల్కుతారు. "రాజ్యాన్ని నీకు ఇస్తానని ముందు దినంలో మాట ఇచ్చి, తరువాత, మరునాడు కామినీ (భార్యా) వచనాలనే వలలో బంధింపబడ్డ కారణంగా వనానికి వెళ్ళమనే శాసనాన్ని ఇచ్చిన చక్రవర్తి పట్ల గుండెలనిండా కోపాన్ని కల్గిన శ్రీరాముడు ఆటువంటి కోపావేశ పరీవాహరూపంగా ఈ మాటను పలికాడు.

తన మనస్సులో దశరథుని పట్ల పితృభావన కల్గినవాడుకాడని దీని వల్ల తెలుస్తున్నది. అందువల్లనే "మన ఇద్దరి తండ్రి దివంగతు డయ్యాడు, అయ్యో!'' అని అనకుండా **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** (లక్ష్మణా! నీవు తండ్రి లేని వాడవయ్యావు) అని అన్నాడు. - అని (కొందరు పలికే సమాధానం).

ఇటువంటి సమాధానం కనీసం అనువదించడానికి కూడ తగనిది. చక్రవర్తి పరలోక ప్రాప్తిని పొందాడనే వార్తను విన్న సమయంలోనే శ్రీరాముడు పొందిన దశను, అపుడతడు చేసిన ఆక్రందనలను మనస్సులో భావించిన ప్రామాణికులు - రామునకు చక్రవర్తి పట్ల విపరీతభావన ఉన్నదని మనసులో కూడ చింతించరు. ముఖ్యంగా ఈ విషయాన్ని గమనించండి. రావణుని సంహరించిన తరువాత పుష్పక విమానాన్ని ఎక్కి, సాకేత నగరానికి ప్రయాణం చేసేటపుడు దగ్గర పడిన అయోధ్యను చూచి, సీతతో రాఘవుడు **"ఏషా సా దృశ్యతే సీతా! రాజధానీ పితుర్మమ"** (సీతా! ఇదిగో నా తండ్రి రాజధాని అయిన ఆ అయోధ్యానగరం కనపడుతున్నది) అని అన్నాడు. **"అస్మదీయా నగరీ సమాగతా సీతే!"** (మన నగరం దగ్గర పడింది, సీతా) అని కద నిజానికి శ్రీరాముడు పల్కి ఉండాలి? పధ్నాలుగు సంవత్సరాలకు పూర్వం మరణించిన తండ్రిని అనుస్మరించి **"పితర్మమ రాజధానీ సైషా విలోక్యతే వైదేహి!"** (వైదేహి! నా తండ్రి రాజధాని ఇదిగో కన్పడుతున్నది) అని పల్కిన కాకుత్స్థుని పితృభక్తి అమోఘమైనదని ఎవడు తెలియ లేడు? అటువంటి సాటి లేని పితృభక్తిని నిరూపకంగా కల్గిన శ్రీరామచంద్రుని **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** (లక్ష్మణా! తండ్రి లేనివాడ వయ్యావు) అనే వచనం దరథునిపట్ల ప్రతికూల భావనతో పల్కినదని అనడం పూర్తిగా తగనిది.

మరికొందరు ఈ విషయంలో ఈ విధంగా పలుకుతారు. (రాబోయే ఆరణ్య కాండలో) పంచవటిలో పర్ణశాలను చాల అందంగా నిర్మించిన

లక్ష్మణునితో సీతాపతి ఆనందంగా ఈ విధంగా అన్నాడు - **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ!, త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ"** (లక్ష్మణా! నా అభిప్రాయాన్ని తెలిసినవాడవు, కృతజ్ఞుడవు, ధర్మజ్ఞుడవైన, పుత్రుడవైన, నీ వల్ల ధర్మాత్ముడైన నా తండ్రి చనిపోలేదు) అనేది ఆ శ్రీరామ వచనం. ఈ శ్లోకంలో ఏమి చెప్పబడుతున్నది? లక్ష్మణా! నా తండ్రి జీవించి ఉంటే, అతని ద్వారా ఏయే ఉపచారాలు నేను పొందగలనో, అటువంటివి అన్నిటినీ, ఇంకా అధికంగా కూడ నీవు నాకు చేస్తున్నావు, కనుక నా తండ్రి మరణించినట్లు నేను భావించడం లేదు. అందువల్ల నేను నీవల్ల తండ్రిని కలవాడనే సుమా! - అనే అర్థం తెలుపబడుతున్నది. ఈ విధంగా తనను, జీవించిన తండ్రిని కల్గినవానినిగా భావించినందున **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అనే మాట యుక్త రూపంగా తోస్తుంది - అనేది ఇంకొక సమాధానం. ఇది కూడ తగినదిగా తోచదు. **"న సంవృత్తః పితా మమ"**అనే వచనం **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అనే మాటకు ముందు పల్కి ఉంటే అపుడు ఏదో విధంగా ఈ సమాధానం యుక్తమని చెప్పే అవకాశం ఉండవచ్చు. పూర్తిగా పాశ్చాత్యమైన (తరువాత పలుకబడిన) ఆ మాటను ఆధారంగా చేసికొని, **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అనే వచనాన్ని సమర్థించడం అందంగా ఉండదు. ఆ మాట తరువాత పల్కినదైతే మాత్రం ఏమి! లక్ష్మణుడు ఎపుడు తనకు అనుచరుడయ్యాడో, అప్పటి నుండి అతని స్వభావం శ్రీరాముని మనస్సులో గాఢంగా నాటుకొన్నది. తండ్రికి ఇతనికి భేదం లేదనే అభిప్రాయాన్ని శ్రీరాముడు శృంగిబేరపురం నుండి మనస్సులో కల్గి ఉన్నాడని అనడంలో అడ్డు లేదు. కనుక, లక్ష్మణుడు జీవించి ఉండడం తాను తండ్రిని కోల్పోలేదనే భావాన్ని అనుసంధించి **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అని అన్నాడని భావించడంలో ఏమి అడ్డు ఉన్నది? అనే ప్రశ్న ఇక్కడ కలుగవచ్చు. ఇంతకంటే యుక్తమైన వేరొక సమాధానం లేకపోతే ఈ సమాధానమే శరణం కావచ్చు. వాస్తవానికి, ఏ

అభిప్రాయంలో *రాముడు* **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అనే మాటను అన్నాడో, అది ఇపుడు ఉపపాదింపబడుతున్నది. రాముని, లక్ష్మణుని, సీతను రథంలో తీసికొని వచ్చిన సుమంత్రుడు, తిరిగి వెళ్ళే సమయంలో సాకేత నగరంలో తండ్రి దగ్గర నివేదించే విషయం ఏమయినా ఉన్నదా? అని లక్ష్మణుని అడిగాడు. అపుడు లక్ష్మణుడు బదులు పల్కుతూ **"అహం తావన్మహారాజే పితృత్వం నోపలక్షయే, భ్రాతా భర్తా చ బంధుశ్చ పితా చ మమ రాఘవః"** (రామా-అయోధ్యా-58-31) (నేనయితే దశరథునిలో పితృత్వాన్ని లక్షించడం లేదు. దశరథుని తండ్రిగా భావించడం లేదు. నా సోదరుడు, భర్త, బంధువు, తండ్రి కూడ శ్రీరాముడే) అని అన్నాడు. **"అహమ్, తావత్ మహారాజే"** అనేది మూడు పదాలతో కూడినదిగా భాసించవచ్చు. కాని, **"అహం తావన్మహారాజే"** అనేది ఒకే పదంగా వివక్ష లక్ష్మణునకున్నదని తోస్తుంది. **"అహంతా అస్య అస్తీతి అహంతావాన్, స చాసౌ మహారాజశ్చేతి కర్మధారయః"** అహంతా అంటే అహంకారం. ఇది కల్గిన వాడు కనుక **"అహంతావత్ అటువంటి వాడు మహారాజు కనుక, అహంతావన్మహారాజః"** అనే కర్మధారయ సమాసాను గుణమైన విగ్రహాన్ని ఈ సమాసానికి చెప్పవచ్చు. అహంభావ విశిష్టుడైన దశరథునిలో పితృత్వ భావన నాకు లేదు - అని దీని భావం. పదత్రయాత్మకంగా కూడ దీనిని గ్రహించవచ్చు. దశరథ చక్రవర్తి విషయంలో లక్ష్మణుడు జుగుప్సా భావాన్ని కలవాడనేది ఇక్కడ స్పష్టం. కామినీవచనాలనే వలలో చిక్కుకొన్నందువల్ల కల్గిన వివశత కారణంగా శ్రీరామచంద్రునకు వనవాసగమనాన్ని ఆదేశించిన, కామినీ వివశుడైన చక్రవర్తికి నివేదించవలసిన విషయం ఏమీ నాకు లేదు - అని ఖేదంతో కద లక్ష్మణుడీ వచనాన్ని పలికాడు. పితృభక్తి మూర్తీ భవించినవాడైన శ్రీరాముని చెవులలో పడిన ఈ మాట అతనికి ఏ విధంగా సహించ గల్గినది అవుతుంది? ఇటువంటి సహించరాని మాటను పల్కిన అనుజుని అపుడే శ్రీరాముడు ఖండించాడు.

కాని, అక్కడే శ్రీరామాయణం ఆరంభమైనది. శ్రీరాముని మనస్సుకు మర్మస్పర్శి అయిన మాట ఇది - అనేది నిస్సందేహం. **"పిత్రా హీనోసి లక్ష్మణ!"** అనే ప్రస్తుత వచనంతో లక్ష్మణుడు చక్కగా శిక్షింపబడ్డాడని గ్రహించాలి. వాస్తవానికి పరమపూజ్యుడైన తండ్రి పట్ల పితృత్వ భావనను కల్గి ఉండకుండా, విపరీతం పల్కిన నీకు పితృవియోగం కల్గింది సుమా!- అనిపల్కిన ఈ మాట యుక్త రూపమైనదే - అని తెలియాలి. ఈ మాటతో తనకు పితృవియోగం కలుగలేదనే అర్థం ఏవిధంగానూ స్ఫురించదు.

ఇప్పుడింకొక విషయానికి వెడదాం. (యుద్ధ కాండలో) విభీషణుని అంగీకరించే ప్రస్తావంలో - అతడు స్వీకరించదగినవాడు కాడని బలంగా అడ్డగిస్తూ సుగ్రీవుడు "గొప్ప ఆపదలో సోదరుని విడచిపెట్టి వచ్చినవాడితడు, ఈ విభీషణుడు నమ్మదగినవాడు కాదు'' అని పల్కిన మాటకు బదులు పలికే శ్రీరాముడు **"న సర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః"** (రామా-యుద్ధ-18-15) (నాయనా! సోదరులందరూ భరతుని వంటి వారు కాబోరు) అని అన్నాడు. సుగ్రీవుని, లక్ష్మణుని చూచి, ఈ మాటను రాముడు పలికాడని - అర్థమవుతున్నది. తనకు సర్వదేశ సర్వకాల, సర్వావస్థోచిత, సర్వవిధ కైంకర్యాలను చేయాలనే కుతూహలంతో వచ్చిన వాడు, అంతేకాక, రాత్రి పగలు బాల్యం నుండి తన పట్ల చాల స్నేహాన్ని కలవాడైన లక్ష్మణుని శ్రీరాముడు పల్కిన ఈ మాట తప్పక బాధిస్తుంది కదా! యుక్తవాది, యుక్తవేది అయిన శ్రీరాముడీ అయుక్తమైన మాటను అనడం తగినదా? అంతరంగ సేవకుడైన లక్ష్మణునకు వ్యథను కల్గించి, దూరంగా ఉండే భరతుని ప్రశంసించడం ఏమి అభిప్రాయాన్ని కల్గినది? - అనే విచికిత్స తప్పక కల్గుతుంది.

ఈ విషయంలో కొందరు ఈ రీతిలో సమాధానం పల్కుతారు. ఇంతకు ముందే ఉదాహరింపబడిన **"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ,**

**త్వయా వీరేణ ధర్మాత్మా న నంవృత్తః పితా మమ''** (రామా-ఆరణ్య-15-29) (లక్ష్మణా! భావజ్ఞుడవు, కృతజ్ఞుడవు, ధర్మజ్ఞుడవు, వీరుడవైన నీ వల్ల ధరాత్ముడైన నా తండ్రి మరణించలేదు) అనే శ్లోకం ద్వారా భాతృస్థానం కంటే ఉన్నతమైన పితృస్థానాన్ని లక్ష్మణుడు పొందింపబడ్డాడు. ప్రస్తుతంలో భ్రాతృప్రస్తావమే, పితృ ప్రస్తావం కాదు. పితృ రూపుడైన లక్ష్మణుని ఇక్కడ ప్రశంసించనక్కరలేనందున, భ్రాత అయిన భరతుని ప్రశంసించడం యుక్తమే. దీని వల్ల లక్ష్మణుని హృదయంలో వ్యథ కలుగదు - అని. (కొందరి సమాధానం) యధార్థమైన, రసభరితమైన సమాధానం కాదు, ఇది. శ్రీరామ చంద్రుడు చేసిన ఈ భరత ప్రశంస ఏ సందర్భంలో ఉన్నది? - అనే విషయాన్ని జాగ్రత్తగా గమనించాలి. విభీషణుడు భ్రాతృ ప్రేమను ఏమాత్రం లేని వాడనే దోషాన్ని ఉద్దేశించి సుగ్రీవుడు ప్రస్తావించే సందర్భంలో ఈ భరత ప్రశంసన వాక్యం విలసిల్లుతున్నది. సుగ్రీవుడు ప్రస్తావించిన ఈ దోషం సుగ్రీవ మహారాజులో, లక్ష్మణునిలో పుష్కలంగా ఉన్నదని గ్రహించి, వీరద్దరిని గూర్చి అవద్యాన్ని కల్గించే మాటను పల్కడానికి ఇదే సముచితమైన సమయమని భావించిన శ్రీరాముని వదనారవిందం నుండి వెలువడిన ఈ వచనం చాల యుక్తమైనదని గ్రహించాలి. వాలిని నా ద్వారా విగతజీవుని చేసిన ఓ సుగ్రీవా! విభీషణునిలో ఇటువంటి దోషాన్ని ప్రస్తావించడానికి నీకు యోగ్యత ఉన్నదా? - అని అతనిని అవహేళన చేయడం ఒక ప్రక్క.

ఇక, లక్ష్మణుని విషయంలో శ్రీరాముని మనస్సులో గాఢంగా నాటుకొన్న దోషాన్ని తెలుపుతాము. దశరథునకు ఉత్తర క్రియలను నిర్వర్తించిన భరతుడు **"విలలాప సభామధ్యే జగర్హేచ పురోహితమ్"** (రామా-అయో-82-10) (సభ మధ్యలో మిక్కిలి విలపించాడు. పురోహితుడైన వశిష్ఠుని గర్హించాడు కూడ). **"రాజ్యం చాహం చ రామస్య ధర్మం వక్తు మిహార్హసి,**

**కథం దశరథాజ్జాతో భవేద్రాజ్యాపహారకః?"** (రామా-అయో-82-12) (నేను, రాజ్యం కూడ రామునకు శేషభూతులము. ఈ విషయంలో ధర్మాన్ని నీవు చెప్పాలి. దశరథుని నుండి పుట్టిన నేను ఏ విధంగా రాజ్యాన్ని అపహరించేవాడను అవుతాను?); **"యావ న్న చరణౌ భ్రాతుః పార్థివవ్యంజనాన్వితౌ, శిరసా ధారయిష్యామి న మే శాంతిర్భవిష్యతి"** (రామా-అయోధ్యా-98-9) (చక్రవర్తి చిహ్నాలను కల్గిన సోదరుడైన శ్రీరాముని శ్రీచరణాలను నేను నా తలపై ధరించనంతవరకు నా మనస్సుకు శాంతి కలుగదు) అని మొదలైన శ్లోకాలలో వ్యక్తమయే రామ భక్తి గౌరవాన్ని కల భరతుడు శ్రీరాముని రాజధానికి తీసికొని రావడం కోసం చిత్ర కూట పరిసరాలకు సపరివారంగా వచ్చాడు. అపుడు, అతని సేనలు చేసే అపరిమితమైన కోలాహలాన్ని విని శ్రీరాముడు "ఇదేమి?" అనే కుతూహలంతో, దానిని తెలిసికొమ్మని లక్ష్మణుని పంపించాడు. చెట్టుపైకి ఎక్కి చూచిన లక్ష్మణుడు, భరతుడే సేనతో పాటు వస్తున్నాడని గ్రహించి, "తల్లి ద్వారా రాజ్య భ్రంశాన్ని కల్గించి, అడవులకు వెడల గొట్టినవాడైన ఈ దుష్టహృదయుడు, అరణ్యంలో కూడ జీవించనీయకుండా, వధించ గోరి, "అయ్యయ్యో! వేగంగా వస్తున్నాడు'' అని తలచి, ఆ రీతిలోనే రామచంద్రుని సన్నిధిలో నిర్భయంగా నివేదించాడు - **"సర్వధా వధ్య ఏవాసౌ"** (తప్పక ఇతడు వధించదగిన వాడు) అని, **"భరతస్య వధే దోషం నాహం పశ్యామి రాఘవ!"** (రామా-అయో-96-23) (రాఘవా! భరతుని వధించడంలో నాకేవిధమైన దోషం కన్పించడం లేదు) అని అంటూ, ఈ ప్రకరణంలో లక్ష్మణుడు పల్కిన మాటలు, అయ్యో అనువదించడానికి కూడ తగనివి. "రామా! భరతుడు తన రాజ్యాభిషేకంతో మాత్రం తృప్తి చెందకుండా; దాయాదులమైన మన ఇద్దరి వల్ల భవిష్యత్తులో ఏదయినా క్లేశం కలుగవచ్చునని తలచి, చంపాలనే ప్రయత్నంతోనే ఇక్కడ వచ్చాడనే విషయంలో కొంచెం కూడ సందేహం లేదు. నీవు సీతను కాపాడు. క్షణకాలంలో నేను ఈ భరతుని,

సేనతో పాటు వధించి, నిన్ను రాజ్యంలో అభిషేకిస్తాను. అరణ్యంలో ఇక్కడ పర్యటిస్తూ, పులులు, సింహాలు మొదలైన జంతువులు, క్రూరమృగాలు, తోడేళ్ళు మొదలైనవి వెను వెంటనే భరతుని భక్షిస్తాయి. గిరి ప్రాంతాలను రక్త ధారలతో తడిసేటట్లుగా ఒక్క క్షణంలో చేస్తాను. చూడు'' అని మొదలైన ఉచ్చావచంగా (హెచ్చు తగ్గులుగా) ఆక్రందించాడు. తదనంతరం భగవంతుడైన శ్రీరాముడు పల్కిన మాటలు లక్ష్మణునకు మిక్కిలిగా సిగ్గును కల్గించేవి, కఠినమైనవి కావచ్చు. ఉదాహరింపబడిన, లక్ష్మణుని బలమైన, అపచారాన్ని తెలిపే వచనాలు అవధిని అతిక్రమించి వర్తించినవి కద! అవి, భ్రాతృవాత్సల్యాన్ని కల్గిన వాని నోటి నుండి వెలువడే అవకాశం ఉన్నదా? లక్ష్మణుడు భగవంతుడైన శ్రీరామచంద్రుని పట్ల నిస్సమాభ్యధికమైన భక్తి ప్రకర్షను కలవాడు, రాత్రింబగళ్ళు అనవధిక కైంకర్యాన్ని చేయడం లోనే మునిగిన వాడు - ఇత్యాది సాధారణ గుణాలు ఉండనివ్వండి. ఇటువంటి గుణాలతో శ్రీరాముడు వ్యామోహాన్ని పొందుతాడా! ఏమి! భ్రాతృరత్నమైన భరతుని పట్ల ఈ లక్ష్మణుడు సహజ ప్రేమ సంపన్నుడు కాకున్నాడు - అని యథాతథంగా గ్రహించిన శ్రీరామునకు లక్ష్మణుని పట్ల ఆ కారణం వల్ల మనస్సులో కల్గిన అసంతృప్తి ఏనాడూ విస్మరించడానికి సాధ్యం కానిది కూడ.

ఆరణ్యకాండలోని పదహారవ సర్గలోగల ఒకానొక వృత్తాంతాన్ని అవధరించండి. శ్రీరాముడు, సీత, లక్ష్మణుడు గోదావరీ స్నానానికి బయలు దేరారు. అపుడు చలి బాధ చాల ఎక్కువగా ఉన్నదని లక్ష్మణుడు పల్కుతూ, **"అస్మింస్తు పురుష వ్యాఘ్ర! కాలే దుఃఖ సమన్వితః, తపశ్చరతి ధర్మాత్మా త్వద్భక్త్యా భరతః పురే, ... శేతే శీతే మహీతలే"** (రామా-అరణ్య-16-27,28) (పురుషోత్తమా! శ్రీరామా! ఈ సమయంలో నీ విరహదుఃఖంతో కూడిన వాడైన, ధర్మాత్ముడైన భరతుడు నీపైగల భక్తి చేత అయోధ్యానగరంలో తపస్సును ఆచరిస్తున్నాడు), **"అత్యంత సుఖ సంవృద్ధః సుకుమారః సుఖోచితః, కథం**

**న్వపరరాత్రేషు సరయూ మవగాహతే"** (రామా-అరణ్య-16-30) (చాల సుఖంగా పెరిగినవాడు, సుకుమారుడు, సుఖాలను అనుభవించవలసిన వాడైన భరతుడు రాత్రి వేళలో పొద్దుపోయిన తరువాత ఏ విధంగా సరయూనదిలో స్నానం చేస్తున్నాడో కద!) అని ఈ విధంగా పల్కుతూ కైకేయీసుతుడైన భరతుని మిక్కిలి ప్రశంసించాడు. వాస్తవానికి, హార్దంగా భరతుని ప్రశంసించడంలో ఈ సందర్భానికి తాత్పర్యం లేదు. కైకేయిని నిందించడం కోసమే ఈ సందర్భం అవతరించిందనేది సత్యం. వెను వెంటనే లక్ష్మణుడు "ఇటువంటి శుభగుణ సమూహాన్ని కల్గిన భరతునకు ఆ పాపిష్ఠురాలు కైకేయి ఏ విధంగా తల్లి అయినదో!'' అని ఆమెను ముక్తకంఠంగా నిందించడం ఆరంభించాడు. అపుడు శ్రీరామచంద్ర భాగవానుడు ఈ విధంగా లక్ష్మణునితో అన్నాడు. **"న తేంబా మధ్యమా తాత! గర్హితవ్యా కథంచన, తామేవేక్ష్వాకు నాథస్య భరతస్య కథాం కురు"** (రామా-ఆరణ్య-16-37) (నాయనా! లక్ష్మణా! ఏ రీతిలోను నీవు మన మధ్యమ జననిని (కైకేయిని) నిందించకు. కేవలం, ఇక్ష్వాకువంశానికి నాయకుడైన ఆ భరతుని గూర్చిన మాటలను పల్కు) లక్ష్మణా! మనకెంతో మహోపకారాన్ని చేసిన కైకేయిని కొంచెం కూడ నిందించకు. భరతుని శుభగుణాలనే పల్కు. అవి కర్ణామృతాలు. వాటిని మాటి మాటికి పల్కు అని శ్రీరాముడన్నాడు. శ్రీరాముడంతటితో విరమించలేదు. భరతుని గుణాలను స్వయంగానే కీర్తించడానికి ఆరంభించాడు.

**''సంస్మరామ్యస్య వాక్యాని ప్రియాణి మధురాణి చ, హృద్యాన్యమృత కల్పాని మనః ప్రహ్లాదనాని చ"** (రామా-ఆరణ్య-16-39) (తీయనివి, హృదయాన్ని ఆకట్టుకొనేవి, అమృతం వంటివి, మనస్సుకు గొప్ప ఆనందాన్ని కల్గించేవి అయిన ఆ భరతుని వాక్యాలను స్మరిస్తున్నాను) ఇత్యాదిగా శ్రీరాముని వచనాలు ఇక్కడ స్మరించదగినవి. వాటిలో అతి ముఖ్యమైనది ఈ క్రింది శ్లోకం. **"నిశ్చితాపి హి మే బుద్ధిః వనవాసే దృఢవ్రతా, భరత**

**స్నేహ సంతప్తా బాలిశీక్రియతే పునః"** (రామా-ఆరణ్య-16-38) (నా మనస్సు దృఢమైన నిశ్చయాన్ని కల్గినది, వన వాసంలో దృఢమైన వ్రతాన్ని కల్గినదైనా, భరతునిపై ఉండే స్నేహం వల్లన మిక్కిలి బాధింపబడినట్లై, నన్ను బాలిశునిగా చేస్తున్నది) అనేది ఆ శ్లోకం. వనవాస కాలం అసంపూర్ణమైనా, భరతునిపై ఉండే స్నేహం వల్ల బలంగా బాధింపబడ్డ నేను నేడే వనం నుండి తిరిగి వెళ్ళి భరతుని దగ్గరకు వెళ్ళాలని ఉన్నది - అని శ్రీరాముడు అన్నాడు. అతనికి భరతునిపై ఉండే ప్రీతి లెక్కకట్టలేనిది కద! ఆ ప్రేమను వ్యక్తం చేసే అతడు పల్కిన మాటలు శ్రీరామాయణంలో చాల భాసిస్తాయి. వాస్తవానికి ఆ ప్రీతికి అనుగుణంగానే శ్రీరాముడు **"న సర్వే భ్రాతరస్తాత భవంతి భరతోపమాః"** (రామా-కిష్కింధా-18-15) (నాయనా! భ్రాతలందరూ భరతుని వంటి వారు కాబోరు) అని అన్నాడు. లక్ష్మణుని సమక్షంలో ఈ విధంగా భరతుని పొగడడం అతని ముఖానికి గ్లానిని కల్గించదా! ఏమి! అని ఏ మాత్రం శ్రీరాముడు గమనించలేదు. భరతునిలో ఉండే ఆయా శుభగుణాలను యధాతథంగా వ్యక్తీకరించడంలో రామప్రభువు సమర్థుడు. ఇదే కద ఉత్తమ పురుష లక్షణం. లోకంలో ఆయా వ్యక్తులలో ఘటించే ఉత్కర్ష ఒక విధమైనదిగా ఉండదు. నిజానికి హెచ్చుతగ్గులుగా ఉంటుంది. లక్ష్మణునకు, భరతునకు వారి వారి స్వభావాలలో ఉండే ప్రకృష్టమైన తారతమ్యం మన పూర్వాచార్య గోష్ఠిలో ప్రసిద్ధం కద! లక్ష్మణుడు శేషత్వంలోనే నిష్ణాతుడు. భరతుడైతే, ఆ శేషత్వానికి పర్యంత సీమ అయిన పారతంత్ర్యంలో నిష్ణాతుడు. అనేది ఆ ప్రకృష్టమైన తారతమ్యం. ఈ భరతుడు **"మనోరథానామతటాన్ ప్రవాహాన్ "**(అవధిలేని ప్రవాహాల వంటి మనోరథాలను) మనస్సులో పెంపొందించుకుంటూ చిత్రకూట పర్వతానికి చేరాడు కాని, అతని కోరికలలో ఒక్కటి కూడ ఫలప్రదం కావడం అతడు గమనించలేకపోయాడు. **"న కామ మన వాప్యైవ"** (రామా-బాల-1-38) (ఆ భరతుడు తన కోరిక పొందకుండానే తిరిగి వెళ్ళాడు) అని **సంక్షేప**

**రామాయణం**లో చెప్పబడింది కద. అయినా, అక్కడ **"ఆరురోహ రథం హృష్టః"** (రామా-అయోధ్యా-113-1) (ఆనందించినవాడై రథాన్ని ఎక్కాడు) అని, అయోధ్యాకాండలో చెప్పబడింది. మనోరథం భగ్నమైన భరతునకు హర్ష ప్రసక్తి ఏమి? అనే విషయం విమర్శనీయం. నా మనోరథాలు అన్నీ పూర్తిగా భగ్నమైనా, అనర్ఘమైన పారతంత్ర్యం జీవించి ఉన్నది కద అని తలచి భరతుడు ఆనందించాడు. ఈ విధమైన పారతంత్ర్యాన్ని లక్ష్మణుడు ఏమాత్రం పొందలేదు. దానిలో స్పృహ మాత్రం కూడ కలుగలేదు. "నీవు సాకేత నగరంలోనే ఉండు. సాకేతానికి తిరిగి వెళ్ళు'' అని పలుమార్లు శ్రీరాముడు ఉపదేశించినా, లక్ష్మణుడు శ్రీరాముని నిర్బంధించి అతనికి అనుచరుడై వెళ్ళాడు. చివరలో పట్టాభిషేక సమయంలో కూడ **"సర్వాత్మనా పర్యను నీయమానో యదా న సౌమిత్రిరుపైతి యోగమ్"** (రామాయణమ్ యుద్ధ- 128-93) (ఎంతగా సమాధానపరచినా యువరాజ పట్టాభిషేకానికి లక్ష్మణుడు ఎపుడు అంగీకరించ లేదో) అని చెప్పబడినట్లు కద సౌమిత్రి స్వాతంత్ర్యం వ్యక్తమైనది. లక్ష్మణ భరతులిద్దరి మధ్య ఉండే ఈ విధమైన స్వభావ విశేషాన్ని బాల్యం నుండి శ్రీరాముడు గమనించాడు. అందువల్ల భరతుని విషయంలో శ్రీరామునకుండే గౌరవ ప్రతిపత్తి అద్వితీయమైనది అనే విషయంలో వివేకం కలవాడెవడూ సందేహించడు. దానికి (ఆ గౌరవ ప్రతిపత్తికి) అనుగుణంగానే స్పష్టంగా సీతాపతి పలికాడు - **"న సర్వే భ్రాతరస్తాత!"** (నాయనా! భ్రాతలందరు భరతుని వంటి వారు కాదు) అని.

**"భావజ్ఞేన కృతజ్ఞేన ధర్మజ్ఞేన చ లక్ష్మణ!, త్వయా పుత్రేణ ధర్మాత్మా న సంవృత్తః పితా మమ"** (రామా-అరణ్య-15-29) (లక్ష్మణా! నా భావాన్ని తెలిసినవాడవు, నాకు సేవలను చేసిన వానిని తెలిసినవాడవు, ధర్మజ్ఞుడవైన నీ వల్ల ధర్మాత్ముడైన నా తండ్రిని చనిపోయినవాడు కాలేదు)

అని పంచవటిలో పల్కిన మాట ద్వారా శ్రీరాముడు తనకు లక్ష్మణుని పట్ల పితృప్రతిపత్తి (తండ్రి అనే భావం) ఉన్నదని వ్యక్తం చేశాడు. అందువల్లనే లక్ష్మణుని పొగడకుండా భరతుని ప్రశంసనాన్ని శ్రీరాముడు యుద్ధకాండలో చేశాడని కొందరు పలికే మాట పూర్తిగా నిరస్తమనే వాస్తవాన్ని ప్రాజ్ఞులు గ్రహించగలరు. అయితే **"న సంవృత్తః పితా మమ"** (నా తండ్రి మరణించలేదు) అని అంటూ లక్ష్మణుని పొడగడుతూ పల్కిన మాట మనః పూర్వకంగా పల్కిన మాట కాదా, మఱి! అని ప్రశ్నించనక్కరలేదు. ఆ మాట అహృదయోక్తి అని ఎవరంటారు? అది పూర్తిగా హృదయపూర్వకంగా పల్కిన మాటయే. నిరతిశయమైన ప్రేమ విశేషంతో పంచవటిలో లక్ష్మణుడు పర్ణశాలను అత్యద్భుతంగా నిర్మించాడు. అపుడు శ్రీరాముడు దశరథుని స్మరిస్తూ తదనుగుణంగా పలికాడు. అంత మాత్రంతో, దశరథునకు నమస్కరించినట్లుగా, లక్ష్మణునకు శ్రీరాముడు నమస్కరించాడని చెప్పవచ్చునా? సమయాను గుణాలైన మాట మర్యాదను మీరి ఇష్టం వచ్చినట్లుగా అర్థ నిర్వాహాన్ని చేయడం ఏ మాత్రం సహృదయులకు రుచికరం కాబోదు. ప్రేమగా "తాత!" (నాయనా!) అని చేసిన సంబోధన ఏ వ్యక్తిని ఉద్దేశించి చేయబడిందో, ఆ వ్యక్తి పట్ల పితృత్వాన్ని సాధించడంలో ఆ సంబోధన సమర్థం కాలేదు. భగవద్గీతలో **"న హి కల్యాణకృత్ కశ్చిత్ దుర్గతిం తాత! గచ్ఛతి"** (గీత-6-40) (నాయనా! సత్కర్మలను చేసిన వాడెవడూ దుర్గతిని పొందడు) ఇత్యాదిగా కన్పించే పలు సందర్భాలలో అర్జునుని సంబోధిస్తూ 'తాత!' అనే సంబోధనను శ్రీకృష్ణభగవానుడు చేస్తూ, అతని పట్ల తనకు గల పితృత్వ ప్రతిపత్తిని వ్యక్తం చేశాడని వివేకి అయిన ఎవడు అంటాడు?

ఇక, వేరొక విషయంలోకి వద్దాం. భ్రాత అయిన భరతుని పట్ల శ్రీరామునకు గొప్ప గౌరవమున్నదనే మాట నిజమే కావచ్చు. కాని, కొన్ని కొన్ని

సందర్భాలలో భరతుని పట్ల లఘుత్వాన్ని వ్యక్తంచేసి కూడ శ్రీరాముడు పల్కినట్లుగా కన్పిస్తుంది. ఉదాహరణకు - వనానికి బయలు దేరేటపుడు శ్రీరాముడు, లక్ష్మణుడు అయోధ్యలో ఉండడమే సముచితమని తలుస్తూ, లక్ష్మణుని ఉద్దేశిస్తూ **"న స్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాం చ సుదుఃఖితామ్, భరతో రాజ్య మాసాద్య కైకేయ్యాం పర్యవస్థితః"** (రామా-అయోధ్యా-31-14) (భరతుడు రాజ్యాన్ని పొంది, కైకేయి విషయంలో ఊనికను కలవాడు కాగలడు. కనుక కౌసల్యను కాని, మిక్కిలి దుఃఖించే సుమిత్రను కాని స్మరించడు) అని అన్నాడు. శుభగుణాలతో ఘనుడైన భరతుని ఉద్దేశించి ఈ విధమైన విపరీతమైన అభిప్రాయాన్ని కల్గి ఉండడం, వ్యక్తం చేయడం కూడ రామచంద్రునకు ఏ విధంగా తగినది? - అనే సందేహం బుద్ధి మంతులకు కలుగవచ్చు. ఈ విషయంలో చెప్పబడేది ఏమంటే ఇక్కడ ప్రస్తావించిన ఈ శ్లోకంలో - భరతునిలో రెండు దోషాలు ఆరోపింపబడ్డాయి. అవి ఏవి? అంటే, **"భరతో రాజ్య మాసాద్య"** (భరతుడు రాజ్యాన్ని పొంది) అని అనడం వల్ల భరతుడు రాజ్య భారాన్ని చాల సంతోషంగా స్వీకరిస్తాడని తన అభిప్రాయాన్ని శ్రీరాముడు వ్యక్తం చేశాడు. ఇది మొదటి దోషం. **"న స్మరిష్యతి కౌసల్యాం సుమిత్రాం చ కైకేయ్యాం పర్యవస్థితః"** (రామా-అయోధ్యా-31-14) (కైకేయి విషయంలో ఆసక్తుడైనందున కౌసల్యను, సుమిత్రను స్మరించడు) అని అనడం ద్వారా రెండవ దోషం వ్యక్తం చేయబడింది. భరతుని ఈ రెండు దోషాలు ఏమాత్రం స్పృశించవు. శ్రీరామచంద్ర భగవానునకు కూడ అ విధమైన అభిసంధి లేదు. అయితే, ఈ విధంగా ఎందుకు పలికాడు? అంటే, వినండి. రెండు విధాలైన సమాధానాలు సుశోభనాలని భావిస్తాను. ఇక్కడ, ఈ శ్లోకాలను గమనించవలసిన ఆవశ్యకత ఉన్నది. ఆ శ్లోకాలు:

**"ఏవం మమ చ తే భక్తిః భవిష్యతి సుదర్శితా, ధర్మజ్ఞ!**

**గురుపూజాయాం ధర్మశ్చాప్యతులో మహాన్, ఏవం కురుష్వ సౌమిత్రే! మత్కృతే రఘునందన! అస్మాభిః విప్రహీణాయాః మాతుర్నో న భవేత్ సుఖమ్"** (రామా-అయోధ్య-31-16,17) (ఈ విధంగా నీవు ఆచరిస్తే నా పట్ల నీవు భక్తిని చక్కగా చూపినవాడవు కాగలవు. ధర్మజ్ఞా! లక్ష్మణా! పెద్దలను సేవించడం సాటిలేని గొప్ప ధర్మం కాగలదు. సౌమిత్రీ! రఘునందనా! నా కోసం నీవు ఈ విధంగా ఆచరించు. మనం ఎవ్వరూ లేకపోతే, మన తల్లికి సుఖం కలుగదు.) అనేవి. వీటిని బాగా గమనిస్తే, తల్లిదండ్రులను అనుసరించి వర్తించడం కోసం మిక్కిలి ప్రయాసపడి అయినా లక్ష్మణుడు అయోధ్యలో ఉండడం శ్రీరామునకు అభిలషితమని తెలుస్తుంది. ఆ విధంగా తల్లి దండ్రులను అనుసరించి సేవించడం ఆవశ్యకమనే విషయాన్ని ప్రతిపాదిచడంలోనే ఉద్దేశ్యాన్ని కల్గినవి అయిన **"న స్మరిష్యతి"** ఇత్యాది వచనాలకు తదనుగుణం గానే అర్థాన్ని గ్రహించాలి. **"న హి నిందా నిందితుం ప్రవర్తతే, నిందితేతరం ప్రశంసితుమ్"** (నింద అనేది ఎవరినీ నిందించడం కోసం ప్రవర్తించదు. నిందింపబడేవాని కంటే వేరొకనిని ప్రశంసించడం కోసం మాత్రమే ప్రవర్తిస్తుంది) అనే న్యాయశైలిలో భరతుని విషయంలో తక్కువదనాన్ని తెలుపడంలో ఈ వచనాలకు ఉద్దేశ్యం లేదని, లక్ష్మణుడు తల్లిదండ్రులను సేవించడంలోని ప్రాధాన్యాన్ని తెలుపడంలోనే ఉద్దేశ్యం కల్గినవని గ్రహించాలి. ఇక, రెండవ సమాధానం ఏమంటే- భరతుని విషయంలో లక్ష్మణునకు ఉండే ప్రతిపత్తి ఎటువంటిది? అని గమనించడం కోసమే శ్రీరాముడు ఈ విధంగా పలికాడు. అపుడు లక్ష్మణుడు పల్కిన సమాధానం ఏమంటే - **"తవైవ తేజసా వీర! భరతః పూజయిష్యతి, కౌసల్యాం చ సుమిత్రాం చ ప్రయతో నాత్ర సంశయః"** (రామా-అయోధ్యా-31-19) (వీరుడా! నీ మహిమ వల్లనే భరతుడు వినయం కలవాడై కౌసల్యను, సుమిత్రను పూజిస్తాడు. ఈ విషయంలో ఏ సందేహం లేదు.) అనేది. ఈ సమాధానాన్ని విని శ్రీరాముడు మనస్సులో

చాల తృప్తిని, ఆనందాన్ని పొందిన వాడయ్యాడు. అందువల్ల, లక్ష్మణుని మనస్సును పరీక్షించడం కోసం భరతుని పట్ల విప్రతి ప్రకాశకంగా పల్కిన శ్లోకం భరతుని విషయంలో విపరీతమైన సందేహానికి కారణం కాబోదు - అని తెలియాలి. దీనికి పిమ్మట - **"యది దుఃస్థో న రక్షేత భరతో రాజ్య ముత్తమమ్, ప్రాప్య దుర్మనసా వీర! గర్వేణ చ విశేషతః, త మహం దుర్మతిం క్రూరం వధిష్యామి న సంశయః"**(రామా-అయోధ్యా-31-20,21) (వీరా! ఒకవేళ భరతుడు దుర్మార్గుడై రాజ్యాన్ని చక్కగా రక్షించకపోతే దుర్బుద్ధిని, విశేషమైన గర్వాన్ని పొందిన వాడైతే, దుర్మతి అయిన అతనిని నేను వధిస్తాను. ఏ సందేహం లేదు) అనే శ్లోకాలు కన్పిస్తున్నాయి. అయితే ఈ శ్లోకాలు ప్రక్షిప్తాలని పెద్దలు భావిస్తున్నారు. గోవిందరాజీయ వ్యాఖ్యానంలో వీటి వివరణం లేదు. మిగిలిన వ్యాఖ్యాతలిద్దఱికి ఈ రెండు దొరికి ఉండవచ్చునని అభ్యూహించే అవకాశం ఉన్నది. ఈ విషయంలో విశేషమైన చర్చకు ఆవశ్యకత లేదని నా అభిప్రాయం.

## శ్రీరామచంద్రుని దృఢవ్రతత్వగుణానుభవం

దాశరథి సత్యవాదిగా ప్రసిద్ధి చెందినట్లే, దృఢవ్రతుడుగా కూడ ప్రసిద్ధి పొందాడు. దృఢవ్రతత్వం అంటే - చేయాలని తలపెట్టిన కార్యాన్ని నిర్వర్తించడంలో దృఢమైన సంకల్పాన్ని కల్గి ఉండడం. అనేక విఘ్నాలు అడ్డు తగిలినప్పటికీ సంకల్పానికి ఏ మాత్రం శైథిల్యం కలుగుకుండా ఉండడమే ఈ గుణం. నిజంగా ఇది మహా గుణం. ఏకాదశీ తిథిలో ఉపవాసం చేయడం మొదలైనవి లోకంలో వ్రతాలుగా చెప్పబడుతున్నాయి. కాని, మనకు దేనిలోను కూడ సంకల్ప ధ్రడిమ లేశం కూడా (దృఢంగా సంకల్పించడం) కలుగదు. ఏదయినా ఒక కార్యాన్ని మొదట ప్రారంభించేటపుడు చాలా ఉత్సాహంగా మన ఆచరణ మొదలవుతుంది. కాని, ఈ క్రమక్రమంగా బలహీనమవుతుంది. దేనిలోను ఫలం కలిగే వరకు శ్రద్ధను కల్గి ఉండము. కాని, శ్రీరామచంద్రుడు అన్ని కర్మలలోను సుదృఢమైన వ్రతాన్ని కల్గి ఉంటాడని అతని చరిత్ర విశేషాల వల్ల తెలిసికొంటున్నాము. శ్రీరాముని సంకల్పంలో గోచరించే కార్యాలు ఎన్నో ఉన్నా, వాటిలో శరణాగత పరిత్రాణమనే కార్యాన్ని ఒక్కటిని మాత్రం ఇక్కడ ముఖ్యంగా ప్రస్తావిస్తాను. సీతాదేవి రావణునకు ఉపదేశం చేస్తూ **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః"** (రామా-సుందర-21-20) (ధర్మజ్ఞుడైన ఆ శ్రీరాముడు శరణాగతుల పట్ల వాత్సల్యాన్ని కలవాడుగా ప్రసిద్ధుడు కద) అని పల్కింది. శరణాగతిని చేసే వారిని భయపడవద్దని అభయమివ్వడంతో పాటు, ఇష్ట ప్రాపణాన్ని, అనిష్ట నివారణాన్ని చేసి రక్షిస్తాడనే కృత్యమొక్కటే ఈ అవతారంలో శ్రీరాముడు ప్రధానంగా భావించాడు - అని ప్రాజ్ఞులు భావిస్తారు. శ్రీమాన్ వేంకటనాథార్యులు (వేదాంత దేశికులు) కూడ **'అభయ ప్రదాన సార'**మనే గ్రంథం ఆరంభంలో **"నమస్తస్మై కస్మై చ న భవతు నిష్కించనజనస్వయంరక్షదీక్షా సమధికసమింధానయశసే"** (అకించనులైన

వారిని స్వయంగా రక్షించడమనే దీక్ష వల్ల మిక్కిలిగా ప్రకాశించే కీర్తిని పొందిన వాడైన అద్వితీయునకు నమస్కారం అగుగాక) అని రహస్యంగా పలికారు. **దశావతార స్తోత్రం**లో కూడ శ్రీరామచంద్రుని ప్రశంసించే శ్లోక రత్నంలో - **"సర్వావస్థ సకృత్ ప్రపన్న జనతా సంరక్షణైవ వ్రతీ"** (దశావతార స్తోత్రమ్-8) (ఏ స్థితిలో అయినా ఒక్కసారి శరణాగతి చేస్తే చాలు, వారిని సంరక్షించడమనే అద్వితీయమైన వ్రతాన్ని కలవాడు) అని ఆ గురువరులే వచించారు. ఆశ్రితులను రక్షించడమనే దీక్షను శ్రీరాముడు కలవాడనే విషయం అటు ఉండనివ్వండి. ఆ కృత్యంలో అతడు సుదృఢవ్రతుడనే విషయమే ఇక్కడ ప్రధానమైనది. ఈ విషయానికి సంబంధించి శ్రీరామాయణంలోని మూడు ఘట్టాలను ఉపపాదిస్తాను.

అరణ్య కాండలోని ఆఱవ, తొమ్మిదవ, పదవ సర్గలు మూడింటిలో మొదట దృష్టిని సారిద్దాం. అక్కడ ఆఱవ సర్గలోని కథ ఈ విధంగా ఉన్నది. శరభంగముని ఆశ్రమానికి చేరి, అక్కడ అతని మోక్షానికి సాక్షీభూతుడైన శ్రీరాముడు, అక్కడ ఉండే తపోధనులనేకుల చేత ప్రార్థింపబడ్డాడు. "భగవన్! రామప్రభూ! దేవతలకు ఇంద్రుడు వలె, నీవు భూమిలోని వారికి అందరికి నిజంగా సాటి లేని నాథుడవై విరాజిల్లుతున్నావు. విరాధుని వధించడం, శరభంగమునిని అనుగ్రహించడం మొదలైన ప్రభావ విశేషాలు మిక్కిలి వెల్గొందుతున్నాయి. తండ్రి ఆజ్ఞను పరిపాలిచడమనే సాటిలేని శ్రద్ధలో విస్తృతమైన రాజ్య సంపదనంతటిని విడచిపెట్టి, వనవాసంలో కుతూహలాన్ని నిండుగా కలవాడవై, నీవు భరతునిచే మిక్కిలిగా ప్రార్థింపబడినవాడవైనా, ఆ సంపదను తృణంగా భావించావు. ధర్మం, సత్యం అనేవి నీలో సాటి లేని ప్రతిష్ఠను పొందుతున్నాయి. శరణాగతరక్షణ సమర్థుడవైన నిన్ను ఉద్దేశించి మేమొక ప్రార్థన చేస్తున్నాము. ఏ రీతిలోను విషాదాన్ని మేము సహించలేక

పోయినందు వల్లనే మేమీ విజ్ఞాపనను చేస్తున్నాము. ఇక్కడ ఉండే బ్రాహ్మణులం, తపోధనులమైన మేము నిన్ను నాథునిగా కల్గి ఉన్నా, అయ్యో! అనాథుల వలె పరితాపాన్ని పొందుతున్నాము. మిక్కిలి క్రూర కర్మలను చేసే రాక్షసుల చేత బాధింపబడే మా శరీరాలను గమనించు. రాక్షసుల వల్ల కలిగే పలు క్లేశాలను భరించడంలో గాని, నివారించుకోవడంగాని శక్తి లేనందువల్ల మేము నిన్ను శరణు పొందుతున్నాము. తల్లి గర్భంలో ఉండే శిశువు వంటి మేము నీచే కాపాడబడదగిన వారం'' - అని ఈ విధంగా మునులు పలికారు.

దీనిని అంతటిని ఆలకించిన శ్రీరాముడు దయా సాంద్రమనస్కుడై ఈ విధంగా బదులు పలికాడు. "మహాత్ములైన తపోధనులారా! నేను ప్రార్థించవలసినవాడను కాను, ఆజ్ఞాపింపబడవలసినవాడను. పితృవాక్య పరిపాలన కోసం అరణ్యానికి వచ్చిన నాకు మీకు కల్గిన కష్టాలను అన్నింటిని పోగొట్టడమే నిజంగా గొప్ప ప్రయోజనం. ఇది మీ కార్యం కాదు, నాది - అనేది ధ్రువం. మీకు కొంచెం కూడ భయం వద్దు. మీకు ఉపద్రవాన్ని కల్గించే రాక్షసులనందటిని అవలీలగా, సమూలంగా ఉన్మూలిస్తాను''. ఇది ఆఱవ సర్గలోని కథ.

ఇపుడు తొమ్మిదవ సర్గలోని కథను వినండి. సీతాదేవి తన వల్లభుడు శ్రీరామునితో ఈ విధంగా పల్కింది - "నాథా! లోకంలో మూడు దోషాలు చాల దారుణాలని చెప్పబడుతున్నాయి. అనృత భాషణం (అబద్ధాలు పల్కడం), ఇతరుల భార్యలను కోరడం, ఏ అపరాధం లేకుండా ఇతరులను హింసించడంలో ఆసక్తిని కల్గిఉండడం - అనే ఆ మూడు దోషాలు. ఈ మూడింటిలో మొదటి రెండు దోషాలకు నీలో ఏ మాత్రం అవకాశం లేదని దృఢంగా నేను నమ్ముతున్నాను. సత్య సంధుడవని, ఏకదార వ్రతుడవని కద, నీవు ప్రసిద్ధుడవు. కాని, మూడవ దోషం మాత్రం నీలో ఇపుడు కాలు మోపడం

ఆరంభించింది కద. అని, అయ్యో! చాలా బాధపడుతున్నాను. ఇపుడు నీవు మహర్షులకు ఇచ్చిన అభయ ప్రదానంలో రాక్షసులను వధిస్తానని మాట ఇచ్చావు కద! ఇటువంటి ఉద్దేశ్యంతో వనవాసానికి వచ్చానని కూడ స్పష్టంగా పలికావు. ఈ దోషం నీలో ప్రవేశించిందే! అని నాకు చాలా దుఃఖంగా ఉన్నది. రాక్షసులకు, నీకు మధ్య సాక్షాత్తుగా ఏ విధమైన విరోధం లేదు కద! అటువంటి వారిని నీవు వధిస్తానని చేసిన ప్రతిజ్ఞ న్యాయంగా నాకు ఏమాత్రం తోచడం లేదు ప్రాణ సమానులైన తపోధనులను ప్రాణాపత్తు కలిగే రీతిలో బాధించే క్రూరులైన ఈ రాక్షసులు వధించదగినవారని నీ అభిప్రాయం కావచ్చు. నీవు క్షత్రియ ధర్మాన్ని అవలంబించి, రాజ్యభారాన్ని మోసే వాడవు అయితే, అపుడు నిజంగా నీ అభిప్రాయం తగినదై ఉండి ఉంటుంది. కాని, నీవు క్షత్రియ ధర్మాన్ని వదలిపెట్టి, తాపస వృత్తిని స్వీకరించిన వాడవు. ఇటువంటి నీకిది ధర్మం కాదు. భరతునకు రాజ్యపాలన భారాన్ని అప్పగించిన నీకు ఆయుధాలను ముట్టడం కూడ దోషమనేది నిశ్చయం. తపస్సులో నిష్ఠనుకల్గి ఉండడమే నీకు అరణ్యా వాసానురూపం కాగలదు. ఆయుధాన్ని ధరించడం వల్ల కోపాన్ని పొందడం, ఇతరులను హింసించడంలో ఆసక్తిని కల్గి ఉండడం అనేవి పాపాన్ని కల్గించడానికి చాలు. ధర్మంలో శ్రద్ధాళువు అయిన నీకు ధర్మ మర్మాలను ఉపదేశించడంలో అబలను నేను ఎంతటి దానను? కేవలం నీ వల్ల నాకుండే గొప్ప ప్రేమచేత ఏదో మాట్లాడాను. భ్రాత అయిన లక్ష్మణునితో ఆలోచించి నీవేమి ఇష్టపడతావో, ఆ విధంగా వర్తించు''. ఇది తొమ్మిదవ సర్గలోని కథాంశం.

ఇపుడిక పదవ సర్గలోని కథ శ్రీరాముని దృఢ వ్రతత్వాన్ని ద్రఢీకరిస్తున్నది. సీతాదేవి పల్కిన మాటకు శ్రీరాముడు తెల్పిన సమాధానం సంక్షేపంగా గ్రహింప బడుతున్నది. అతడు పల్కిన ప్రతి వచనంలోని శ్లోకాలలో ఒక శ్లోకం ప్రధానంగా ప్రదర్శింప బడుతున్నది.

**"అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్, న హి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః"** (రామా-అరణ్యా-10-19) (సీతా! నా ప్రాణాలను అయినా విడుస్తాను. లక్ష్మణునితో పాటు నిన్ను కూడ విడచి పెడతాను. కాని, ఇచ్చిన మాటను, అందులోను, బ్రాహ్మణులకిచ్చిన మాటను ఎంత మాత్రం మీరను) అనేది ఆ శ్లోకం.

మనవంటి అకించనులు నిత్యం స్మరించుకోదగిన భగవానుని సూక్తులలో ఇది ముందుగా గణించదగినది కద! "జానకీ! నా ప్రాణాలను అయినా పరిత్యజిస్తాను. నిత్యానపాయినివి అయిన నిన్ను సైతం విడుస్తాను. ఇటువంటి సౌమిత్రిని కూడ పరిత్యజిస్తాను. కాని, ఇచ్చిన మాటను, చేసిన ప్రతిజ్ఞను విడువను. అందులోను, బ్రాహ్మణుల కిచ్చిన మాటను విడువడమనే ప్రసక్తి ఏ మాత్రం లేదు'' అని కద ఈ పద్యంలో స్పష్టపడే అర్థం. ఇటువంటి దృఢవ్రతత్వం శ్రీరామునకు శరణాగతరక్షణలో ఉన్నది.

ఆ పిమ్మట లక్ష్మణాగ్రజుడు ఈ క్రింది విధంగా అన్నాడు.

**"సదృశం చానురూపం చ కులస్య తవ చాత్మనః, సధర్మచారిణీ మే త్వం ప్రాణేభ్యోపి గరీయసీ"** (రామా-ఆరణ్యా-10-22) ఈ శ్లోకంలో చెప్పబడినది ఏమంటే - "సీతా! నేను ఆచరించదలచిన ధర్మాన్నే నీవు కూడ చింతించాలి. దీనికి విరుద్ధంగా ఆలోచించడం నీకు తగినది కాదు. ఈ విధమైన, ధర్మానుష్ఠాన సహాయసంపద కోసమే కద నిన్ను నేను పరిణయమాడాను. అందువల్ల, నాకు ప్రాణప్రియవు అయిన సీతా! నా అభిప్రాయానుసారంగా వర్తించడమే గౌరవం" అని. ఇక్కడ ఈ తత్త్వాన్ని గ్రహించాలి. సీతా పరిణయ సందర్భంలో జనక చక్రవర్తి **"ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ, ప్రతీచ్ఛచైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా"** (రామా-బాల-73-26) "ఈ సీతాదేవి నా కుమార్తె. నీకు సహధర్మచారిణి. ఈమెను

పరిగ్రహించు. నీకు శుభం కలగాలి. ఈ చేతిని నీచేతిలో గ్రహించు'' అని శ్రీరామునితో అన్నాడు. ఇక్కడ **"సహధర్మచరీ తవ"** అనేమాట **"కావ్యం రామాయణం కృత్స్నం సీతాయాశ్చరితం మహత్"** (రామా-బాల-4-7) (శ్రీరామాయణం సమస్తం సీతాదేవి యొక్క గొప్ప చరిత్ర) అని ప్రశంసింపబడే శ్రీరామాయణానికి జీవనాడి. మనవంటి మానవులు అయితే, వివాహ సమయంలో **"ఇమాం కన్యాం ధర్మ ప్రజార్థం వృణీమహే"** (ఈ కన్యను ధర్మ సంతానం కోసంగా స్వీకరిస్తున్నాను) అని పల్కుతారు. ఇక్కడ **'ప్రజార్థం'** అంటే సంతానార్థమని అర్థం. సంతాన సమృద్ధి అయితే భార్య వల్ల కల్గుతుంది. ధర్మ సంతతి కోసమని **'ప్రజార్థం'** అని కద ఇక్కడ అర్థం. ఏ ధర్మం మనవంటి ఆచరణలో గోచరమవుతుంది? అని అంటే, అగ్ని హోత్రాది వైదికానుష్ఠానం భార్యాసహితుడై చేయాలని విధింపబడడం వల్ల, ఆ ధర్మమే ఇక్కడ ప్రసక్తమవుతుంది. అయితే ఇది ఈ కాలంలో మనస్సులో కూడ చింతించే అవకాశమే లేనిది కద! ఈ విషయం ఉండనివ్వండి. శ్రీరామచంద్రునకు అభిమతమైన ధర్మానుష్ఠానమేది? అనేది ఇక్కడ విమర్శించదగినది. సీతాదేవి రావణునకు పరమకృపతో ఉపదేశించేటపుడు **"విదితః స హి ధర్మజ్ఞః"** (అతడు ధర్మజ్ఞుడుగా ప్రసిద్ధుడు కద) అని పల్కి, వెనువెంటనే స్వయంగానే **"శరణాగత వత్సలః"** అని అన్నది. వేదాంతదేశికులు కూడ ఈ సూక్తిని - **"సర్వావస్థ-సకృత్ ప్రపన్న జనతా సంరక్షణైక వ్రతీ"** (దశావతార స్తోత్రము-8) (ఏ దశలో అయినా, ఒక్కసారి ప్రపత్తి చేసిన వారిని సంరక్షించడమనే అద్వితీయ దీక్షను కలవాడు) అని పల్కిన సమనంతరమే **''ధర్మో విగ్రహవాన్''** (మూర్తీభవించిన ధర్మం) అని అంటూ వివరించారు. ప్రపన్న జన సంరక్షణాన్ని పరమ ధర్మంగా భావించి అవతరించిన శ్రీరామునకు సహాయాన్ని సంపాదించడం కోసంగానే సీతాదేవి కళత్రభావాన్ని పొందింది - అని

గ్రహించాలి. ప్రస్తుతంలో **"సధర్మచారిణీ మే త్వమ్"** (నీవు నా సహధర్మచారిణివి) అని పల్కిన శ్రీరామునకు ఇదే కద వివక్షితం. పరిత్రాణమంటే - అనిష్టాన్ని నివారించడంతో పాటు, ఇష్టాన్ని పొందించడమే కద! మహర్షులు ఎపుడు రక్షించదగిన వారయ్యారో, అపుడే, వారికి శత్రువులైన రాక్షసుల వధ జరుగకుండా వారి (మహర్షుల) పరిత్రాణం సిద్ధించదు - అనే ఈ అంశం సీతాదేవికి కూడ బాగా తెలుసు. అయితే, ఆమె ఈ రీతిలో రాక్షసుల వధను గూర్చి ఆక్షేపం ఎందుకు చేసింది?- అనే విషయాన్ని కూడ విమర్శించాలి. **స్థూణానిఖనన న్యాయం**లో శ్రీరాముడు చేసిన ప్రతిజ్ఞ ఎంత దృఢమైనదో తెలిసికోవడం కోసమే ఈ విధంగా ఆక్షేపించింది - అనేది వస్తు స్థితి.

ఇపుడు, ఇంకొక ఇతిహాసం ద్వారా కూడ రామప్రభువు యొక్క దృఢవ్రతత్వాన్ని ఉపపాదిస్తాను. ప్రభంజనసుతుడు లంకానగరానికి క్షోభను కలుగ చేసిన తరువాత లంకేశ్వరుడు సమాలోచన సభను ఏర్పాటు చేశాడు. ఆ సభలో ఉండే రావణానుజుడైన విభీషణుడు అనేక పరమకరుణా పరీవాహ రూపాలైన ఉపదేశాలను చేశాడు. చివరలో, **"త్వాం తు ధిక్! కులపాంసనమ్"** (రామాయణమ్-యుద్ధ-16-16) (రాక్షస కులాన్ని పాడు చేసినవాడవైన నిన్ను ఛీ! బహిష్కరిస్తున్నాను) అని ధిక్కారమే ఆ ఉపదేశ ఫలంగా లభించింది. అయినప్పటికీ పరహితాన్నే పరమ ప్రయోజనంగా భావించే విభీషణుడు - **"సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః అప్రియస్య చ పథ్యస్య వక్తా శ్రోతాచ దుర్లభః, బద్ధం కాలస్య పాశేన సర్వ భూతాపహారిణా, న నశ్యంత ముపేక్షేయం ప్రదీప్తం శరణం యథా"** (రామా-యుద్ధ-16-21,22) (రాజా! ప్రియంగా పలికే పురుషులు ఎల్లప్పుడు సులభంగా కన్పిస్తారు. కాని, అప్రియంగా ఉన్నా హితమైన వచనాన్ని పలికేవాడు, దానిని వినేవాడు దుర్లభులు.

సమస్త ప్రాణులను అపహరించే స్వభావాన్ని కల్గిన కాలమనే పాశం చేత బంధింపబడిన వాడవై, నశించిపోయే నిన్ను చూచి, మండే ఇంటిని వలె, నేను ఉపేక్షించలేను) అని పల్కినా, ఉపదేశ ఫలలేశాన్ని కూడ గమనించలేకపోయాడు. **"వరం హుతవహజ్వాలా పంజరాంతః వ్యవస్థితిః, న శౌరి చింతా విముఖ జన సంవానసవైశనమ్"** (శ్రీమన్నారాయణుని చింతించడంలో విముఖులైన వారితో కలిసి ఉండడమనే నరకం కంటే అగ్ని జ్వాలల పంజరంలో ఉండడమే మేలు) అని తలచి **"సకృత్ప్రపన్న జనతా సంరక్షణైక వ్రతీ"** (ఒక్కమారు ప్రపత్తి చేసిన వారిని రక్షించడమనే అద్వీతీయ దీక్షను కలవాడైన) శ్రీరాముని చరణాలు ఏ అపాయం లేని ఉపాయంగా నిశ్చయించుకొని, తనకు అనుకూలంగా ఉండే నల్గురు రాక్షసులతో కలసి ఆకాశంలోకి ఎగిరి ముహూర్తకాలంలో శ్రీరాముడు లక్ష్మణునితో, వానరులందరితో కలసి ఉండే చోటుకు వచ్చాడు. ఆ విధంగా వచ్చిన తరువాత ఆకాశంలోనే నిలచిన వాడై **"నివేదయత మాం క్షిప్రం విభీషణ ముపస్థితమ్, సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే"** (రామా-యుద్ధ-17-17) (అన్ని లోకాలలో గొప్ప శరణమైన, మహాత్ముడైన శ్రీరామునితో విభీషణుడు వచ్చాడని నా గూర్చి వెంటనే నివేదించండి) అని సుగ్రీవుడు మొదలైన వానర వీరులను ఉద్దేశించి వినయంగా ఆక్రందించాడు. అపుడు, అయ్యో! ఏమయింది? పరమ సాత్త్వికుడు, హార్దభక్తి అనే సంపదను నిండుగా కలవాడైన ఆ విభీషణుని పట్ల దురాత్ముడనే సందేహంతో భయపడిన, ఆకులాన్ని పొందిన మనస్సులు కలవారైన సుగ్రీవాది వానరేంద్రులు అతనికి స్వాగతాన్ని పలుకలేదు, సరికదా, అతని పట్ల వ్యతిరేక భావాన్ని విశేషంగా వ్యక్తం చేస్తూ, "ఎంత మాత్రం ఇతడు అంగీకరించదగినవాడు కాడు; చాలా దూరంగా ఉంచదగినవాడు; ఇతనిని అంగీకరిస్తే తప్పక అనేక అపాయాలు సంభవిస్తాయి; ఇతడు ఋజుబుద్ధితో ఇక్కడకు రాలేదు" - అని

ఈ విధంగా పలు విధాలుగా వ్యతిరేక భావాన్ని ప్రదర్శిస్తూ కటువుగా పల్కుతూ, అతనిని పరిగ్రహించే విషయంలో మిక్కిలి అడ్డుకొన్నారు. హనుమంతుడు తప్ప, జాంబవంతుడు మొదలైన అందరు కూడ విభీషణుని వ్యతిరేకించే పక్షాన్నే ఆశ్రయించారు. పలు వచనాలెందుకు? పంచవటిలో **"శూర్పణఖ పల్కిన విభీషణస్తు ధర్మాత్మా న తు రాక్షస చేష్టితః"** (రామా-ఆరణ్య-17-23) (విభీషణుడు ధర్మాత్ముడు. రాక్షస కృత్యాలను చేసేవాడు కాడు.) అనే మాటను ఆలకించిన లక్ష్మణుడు కూడ విరోధించే పక్షాన్నే ఆశ్రయించాడు. అపుడు, ఆర్తత్రాణ పరాయణుడైన శ్రీరామచంద్ర భగవానుడు ఏం చేశాడు?

**"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతామేత దగర్హితమ్"** (రామా-యుద్ధ-18-3) (మిత్ర భావంతో దరి చేరిన వానిని ఏ విధంగాను విడచి పెట్టను అతనిలో దోషం ఉంటే ఉండనీ, అది సత్పురుషులకు గర్హించదగినది కాదు) అని తన సుదృఢమైన వ్రతాన్ని ఉద్ఘాటించాడు. అంతే కాక, **"ఆర్తో వా యది వా దృప్తః పరేషాం శరణాగతః, అరిః ప్రాణాన్ పరిత్యజ్య రక్షితవ్యః కృతాత్మనా"** (రామా-యుద్ధ-18-28) (ఆర్తుడైనా, లేక, దృప్తుడైనా, ఇతరులను శరణాగతి చేసినవాడు, శత్రువైనా, ప్రాణాలను విడిచి కూడ రక్షించదగినవాడు) అనే కండు మహర్షి వచనాన్ని ఉదాహరిస్తూ **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ"** (రామా-యుద్ధ-18-33) (ఒక్కసారి ప్రపత్తి చేసిన వానికి, నేను నీవాడనని యాచించిన వానికి అన్ని ప్రాణుల వల్ల అభయాన్ని ఇస్తున్నాను. ఇది నా వ్రతం) అని కంఠోక్తిగా **"మమ ఏతత్ వ్రతమ్"** (ఇది నా వ్రతం) అని తన మాటలను నిగమిస్తూ, **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యాభయం మయా"** (రామా-

యుద్ధం-18-34) (వానర శ్రేష్ఠా! ఇతనిని తీసికొనిరా. ఇతనికి నేను అభియాన్ని ఇచ్చాను) అని ఉపసంహరించాడు. ఈ ఇతిహాసం ద్వారా శ్రీరాముని దృఢవ్రతత్వం సుస్పష్టమవుతున్నది.

ఇక, ఈ సందర్భంలో ప్రాసంగికాలైన (సందర్భానికి సంబంధించిన కొన్ని రస్యాలైన) అర్థ విశేషాలను సమర్పిస్తాను.

విభీషణుని రావణుడు ధిక్కరించినపుడు, విభీషణుడు శ్రీరాముని శ్రీచరణ సమీపానికి వచ్చి, అతడే శరణమని నమ్మాడని చెప్పబడింది. ఆ పరమ భక్తాగ్రేసరుడు శ్రీరాముని స్వభావాన్ని చక్కగా తెలిసినవాడు. వానర వీరుల సమక్షంలో విభీషణుడు **"మా ముపస్థితం క్షిప్రం నివేదయత రాఘవాయ"** (దరిచేరిన నన్ను గూర్చి శ్రీరామునకు వేగంగా నివేదించండి) అని పల్కుతూ రాఘవుని సర్వలోక శరణ్యత్వాన్ని ఉద్ఘోషించాడు. సర్వలోకాలకు శరణు పొందదగిన ఆ శ్రీరాముడు ఎక్కడో, దూరంలో లేడు. అతి సమీపంలో ఉన్నాడు. అతని శ్రీచరణ సమీప గమనం ఎంతమాత్రం క్లేశసాధ్యం కాదు. సులభతమం. శ్రీరాముడు ఉన్న చోటు కూడ కవాటాలచే మూయడానికి సాధ్యమైన ఎక్కడో ఒక గృహంలో రక్షక భటులచే కాపలా పెట్టబడినది కాదు. అందరికి సుఖంగా కనబడుతూ సాగర తీరంలో కదా శ్రీరాముడున్నాడు. విభీషణుడు **''రావణో నామ దుర్వృత్తో రాక్షసో రాక్షసేశ్వరః, తస్యాహమనుజో భ్రాతా విభీషణ ఇతి శ్రుతః..... సోహం పరుషితస్తేన దాసవచ్చావ మానితః, త్యక్త్వా పుత్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః"** (శ్రీరామా-యుద్ధ-17-12,16) (చెడ్డనడతను కల రావణుడనే రాక్షసుడు, రాక్షస ప్రభువు ఉన్నాడు. అతని తమ్ముడను, భ్రాతను, విభీషణుడని ప్రసిద్ధిని పొందినవాడను నేను.... అతనిచే నేను కోపగింపబడ్డవాడనై, దాసుని వలె అవమానింపబడ్డాను. నా పుత్రులను, భార్యను విడిచి, రాఘవుని శరణుకోరి

వచ్చాను) ఇత్యాదిగా ఏ మాటలు వానరేంద్రుల సమక్షంలో విన్నపించాడో, ఆ మాటలను రాఘువుని సమీపంలో విన్నపిస్తూ, ఆ స్వామి పాదపద్మ పరిసరంలో పడి, శరణాగతి చేసి ఉంటే, అపుడు విభీషణుని శరణాగతిని గూర్చిన ఆక్షేపాలు, వానికి సమాధానాల ప్రసక్తి లేశం కూడ ఏర్పడి ఉండేది కాదు. తన పాద సమీపంలో వాలిన ఆ విభీషణుని శ్రీరాముడు వెంటనే పైకి లేపి, తన ఒడిలో కూర్చో బెట్టుకొని "ఆహా! ప్రాణాల కంటే గొప్పవాడవైన విభీషణా! నీకు గల ధర్మ శీలత్వాన్ని గూర్చి పంచవటిలో విని ఉన్నాను. అప్పటి నుండి నిన్ను చూడాలనే బలమైన ఉత్కంఠతో ఉన్నాను. లంకాపురికి వచ్చి, ముందుగా నిన్నే స్వీకరించాలనే కోరికతో ఉన్నాను. ఆహా! నీవే నా ముందుకు వచ్చావు అంటే, నా భాగ్యం ఎంత గొప్పది! రారా, దగ్గరకు రా, విచారాన్నంతా విడచిపెట్టు, దుఃఖాలను అన్నిటినీ విడచిపెట్టు." అని ఈ రీతిలోని ప్రేమార్ద్ర విహ్వల వచనాలను పునః పునః పల్కుతూ, అతని శిరస్సును మూర్కొని, గాఢంగా ఆలింగనం చేసికొని, అతనితో పాటు తనను కూడ అమందానందసందోహ సాగరంలో అవగాహింపజేసి ఉండేవాడు కద! ఇటువంటి స్వభావాన్ని కలవాడు, శ్రీరామచంద్రుడనే విషయం విభీషణునకు తెలియక పోలేదు. తెలిసినా, అతడు, శ్రీరాముని పాదాల సమీపానికి స్వయంగా రాకుండా, ఎందుకోసం వానరుల వద్ద తన ప్రార్థనను ఆవేదించాడు? - అనే విచికిత్స సహజంగా ఇక్కడ కల్గుతుంది. ఇంతేకాక, ఇంకొక విచికిత్స కూడ ఈ సందర్భంలో కల్గుతుంది. అది ఏమంటే - విభీషణుడు నల్గురు సహచర రాక్షసులతో కలసి - ఆకాశం లోకి ఎగిరి, శ్రీరాముని దగ్గరకు వచ్చాడో, అపుడు ఆకాశంలోనే ఉన్నావాడైన అతనిని సుగ్రీవుడు చూచి, హనుమంతుడు, అంగదుడు మొదలైన వారిని ఉద్దేశించి **"ఏష సర్వాయుధోపేతః చతుర్భిస్సహ రాక్షసైః, రాక్షసో-భ్యేతి పశ్యధ్వమస్మాన్ హంతుం న సంశయః"** (శ్రీరామా-యుద్ధ 17-7) (అన్ని

ఆయుధాలను కలవాడైన ఈ రాక్షసుడు విభీషణుడు నల్గురు రాక్షసులతో కలసి మనలను వధించడం కోసం దగ్గరకు వస్తున్నాడు సందేహం లేదు) అని అన్నాడు. అపుడు వానరు లందరు వృక్షాలను, పర్వతాలను పెకలించి తీసికొని, అతనిని చంపాలని ప్రయత్నించారు. ఇది అంతా శ్రీరామాయణ గాథలో కన్పిస్తుంది. నల్గురు రాక్షసులతో వచ్చిన రాక్షసుడు విభీషణుడని అపుడు వీరికి తెలియదు. ఎవడో ఒక రాక్షసుడు దగ్గరకు వస్తున్నాడు - అని ఇంతమాత్రమే వారికి తెలుసు. "మనలను చంపడం కోసం వీడు వస్తున్నాడు" అని వీరిచే ఏ విధంగా చెప్పబడింది? ఈ మాటను అనురూపంగా వీరు అనలేదు. **"న సంశయః"** (సందేహం లేదు) అని అన్నారు. కేవలం గదను మాత్రం తీసికొని వచ్చిన విభీషణుని చూచి **"సర్వాయుధోపేతః"** అని కూడ ఏ విధంగా సుగ్రీవాదులన్నారు? వచ్చిన వాడు విభీషణుడని తెలిసిన తరువాత కూడ సుగ్రీవుడు శ్రీరాముని సమీపంలో **"వధ్యతామేష దండేన తీవ్రేణ సచివైస్సహ, రావణస్య నృశంస్య భ్రాతా హ్యేష విభీషణః"** (ఇతడు, ఇతని మంత్రులతో పాటు తీవ్రమైన దండనతో వధింపబడుగాక! ఇతడు, క్రూరుడైన రావణుని సోదరుడు, విభీషణుడు కద) (శ్రీరామా- యుద్ధ- 17-29) అని అన్నాడు. విభీషణుని సౌజన్యాన్ని గూర్చిగాని, సాత్త్విక స్వభావాన్ని గూర్చి సుగ్రీవాదులకు తెలియదు అని అనడానికి కూడ వీలు లేదు. సర్వ ప్రాణుల పట్ల అనుకంపను కల శ్రీరాముని అనుచరులైన వీరు ఏ కారణం వల్ల ఇంతటి నిష్ఠురమైన మాటను పలికారు?

ఇపుడు, ఇంకొక, మూడవ విచారం కూడ ప్రస్తావింపబడుతున్నది. వానరులు పల్కిన ఇటువంటి కఠినమైన మాటలను విన్న శ్రీరామచంద్రుడు వెంటనే ఏమి చేసి ఉండాలి? "ఓ వానరులారా! ధర్మాత్ముడని ప్రసిద్ధుడైన విభీషణుని ప్రభావాన్ని, అయ్యో! మీకు తెలియలేదే! మీరితనికి స్వాగతాన్ని

పల్కి, అభినందించి ఉండాలి కద! ఇతని విషయంలో విరుద్ధభావనను కల మీరు తొలగిపోండి దూరంగా'' అని ఆ కపివీరులను నివారించి, "ఓ విభీషణా! భయపడకు, త్వరగా నా దగ్గరకు రా. నీకు అభయాన్ని ఇస్తున్నాను'' అని పల్కి, ఒక్క క్షణం అయినా ఆలస్యం చేయకుండా అతనిని స్వీకరించడం న్యాయం. కాని శ్రీరాముడా విధంగా చేయలేదు. వేర్వేరుగా పలువురు వానర వీరుల అభిప్రాయాన్ని వ్యక్తం చేసేటట్లు పురికొల్పడం ద్వారా, వాద ప్రతివాదాలను పెంచడం ద్వారా విభీషణుని స్వీకరించడంలో అతనికి దుస్సహమైన ఆలస్యాన్ని చేశాడు. ఇది ఏ విధంగా తగినది? అనేది ఇంకొక విచికిత్స. ఈ విధంగా మూడు విచారణలు ఈ సందర్భంలో విమర్శక గోష్ఠిలో ప్రసక్తమవుతాయి.

ఇక, వీటికి తగిన సమాధానాలు తెలుపబడుతున్నాయి.

1) గొప్ప ఆర్తితో వచ్చిన విభీషణుడు స్వయంగా శ్రీరాముని వద్దకు వచ్చి, క్షణకాలంలో సుఖాన్ని పొందగలిగే అవకాశం ఉన్న వాడైనా, వానర వీరుల దగ్గరకు వెళ్ళి, వారి వద్ద తన ప్రార్థనను ఎందుకు వ్యక్తం చేశాడు? - అని మొదటి విచికిత్స. దీనికి సమాధానమేమంటే వినండి. భగవంతుని ప్రపత్తి చేసేటపుడు, ఆ ప్రపత్తిని భాగవత పురుషకార పురస్సరంగా కాకుండా చేయడం ఉచితం కాదనేది శాస్త్రీయమైన మార్గం. శ్రీశఠకోప మునీంద్రులు కూడ సహస్రగీతి అనబడే తిరువాయ్మొ***ழి*** ప్రబంధంలో **"వేదమ్ వల్లార్ కళైక్కొణ్డు విణ్ణోర్ పెరుమాన్ తిరుప్పాదమ్ పణిన్దు"** (తిరువాయ్ మొழி4-6-8) (వేదంలో సమర్థులైన వారిని పురస్కరించు కొని నిత్య సూరినాథుని శ్రీచరణాలను ఆశ్రయించి) అని అన్నారు. విభీషణునకు ఈ శాస్త్రార్థం తెలుసునో, తెలియదో, ఆ మాట అటు ఉండనివ్వండి. భగవంతునకు అంతరంగులై ఉండేవారిని పురస్కరించుకొంటే, ఆశించిన ఫలం తప్పక

సిద్ధిస్తుందనే విషయాన్ని విభీషణుడు లౌకిక దృష్టాంతాలను బట్టి అనుసరించాడు. దీని వల్ల ఇక్కడ తెలిసిన దేమంటే - ఈ విభీషణ శరణాగతి సందర్భంలో శాస్త్రీయ మార్గానుసరణం ఫలించిందని. ఇక్కడ విషయం ఇంత మాత్రమే కాదు. జీవుడు పరమపురుషుని శరణు వేడేటపుడు ఏ విధంగా అంత రంగజనులను పురస్కరించుకోవడం ఆవశ్యకమో, ఆ విధంగానే పరమపురుషుడు చేసే చేతనవరణంలో కూడ ఎవరో ఒక అంతరంగుని పురస్కారం (పురుష కారం) ఆవశ్యకం. అందువల్లనే, తరువాత శ్రీరాముడు "ఓ విభీషణా! ఇక్కడకు నా దగ్గరకు రా" అని నేరుగా పిలువకుండా, **"ఆనయైనం హరిశ్రేష్ఠ! దత్తమస్యా భయం మయా"** (శ్రీరామా-యుద్ధ -18-34) (ఓ వానర శ్రేష్ఠ! సుగ్రీవా! ఈ విభీషణుని నా దగ్గరకు తీసికొని రా. ఇతనికి నేను అభయ మిచ్చాను) అని సుగ్రీవుని ఆదేశించి, అతని ద్వారానే విభీషణుని స్వీకరించాడు. శ్రీరామాయణ మనేది కేవలం కథను బోధించడం కోసం మాత్రమే అవతరించ లేదు. **"వేదోపబృంహణార్థాయ తా వ గ్రాహయత ప్రభుః"** (శ్రీరామా-బాల-4-6) (ప్రభువైన వాల్మీకి ఆ లవకుశలను వేదోపబృంహణం కోసం స్వీకరించాడు) అని శ్రీరామాయణంలో తెలుపబడిన రీతిలో వేదార్థ రహస్య ప్రకాశనం కోసం శ్రీరామాయణం అవతరించింది. అందువల్ల విభీషణుడు వానర వీరులను ఉద్దేశించి చేసిన ప్రార్థన శాస్త్రార్థ సమన్వయం పరిమళ సంభృతమని వ్యక్తమవుతున్నది.

2) ఇపుడు రెండవ విచికిత్సకు సమాధానం తెలుపబడుతున్నది. గదా మాత్రంతో కూడి ఉండే (కేవలం గదను ధరించి ఉండే) విభీషణుని ఉద్దేశించి, **"ఏష సర్వాయుధోపేతః"** (శ్రీరామా-యుద్ధ-17-7) (అన్ని ఆయుధాలతో కూడిన ఈ విభీషణుడు) అని వానర వీరులు ఏ విధంగా అన్నారు. ఎందు కోసం వారు విభీషణుని స్వీకరించరాదని బలంగా, తగని

రీతిలో, అడ్డు పెట్టారు? - అనేది విచికిత్స. ఇక్కడ ఈ విషయం గమనించాలి. సర్వాంగ సుందరుడు, పూవు కంటే సుకుమారుడైన శ్రీరాముని పట్ల ఎవరికి హార్దమైన ప్రేమ బంధం (అనురాగం) ఉన్నదో, వారికి 'అస్థానే భయశంక' కల్గడం అనివార్యం. అందువల్లనే **శ్రుతప్రకాశికా** వ్యాఖ్యలో **"సంబంధ విశేషాన్వితేషు ప్రీతిః స్నేహః, యస్యవిపాకాః అస్థాన భయశంకిత్వం, దోషానవ భాసః, దోషేపి గుణత్వ బుద్ధిరిత్యాదయః"** (విలక్షణమైన సంబంధాన్ని కలవారి పట్ల ఉండే ప్రీతికి స్నేహమని పేరు. దీని పర్యవసానాలు - తగని భయాన్ని శంకిచడం, దోషాలను గమనించకపోవడం, దోషాన్ని గుణంగా భావించడం - మొదలైనవి) అని చెప్పబడింది. **శ్రీగుణరత్న కోశ**మనే స్తుతిలో శ్రీపరాశర భట్టర్ శ్రీవైకుంఠ స్థితిని యథాతథంగా వర్ణిస్తూ **"స్నేహాత్ అస్థాన రక్షా వ్యసనిభిః అభయం శార్ఙ్గ చక్రాసిముఖ్యైః ఆనందై కార్ణవం శ్రీర్భగవతి! యువయో రాహుః, ఆస్థాన రత్నమ్"** (శ్రీగుణరత్న కోశము-24) (ఓ పూజ్యురాలైన లక్ష్మీదేవీ! మీ ఇద్దరిపట్ల ఉండే స్నేహం వల్ల అస్థానమైన రక్షా వ్యసనాన్ని కల్గిన సుదర్శనం, శార్ఙ్గం, నందకం మొదలైన దివ్యాయుధాలు మీకు మంగళాన్ని ఆసించే చోటు, ఆనందానికి అద్వితీయ సముద్రం - మీరు వేంచేసి ఉండే ఆస్థాన రత్నం అని పెద్దలంటారు) అని అన్నారు. ఈ విధంగా పూర్తిగా భయ శంకాకళంకగంధమైనా ఏ మాత్రం లేని పరమ పదంలో కూడ - అజ్ఞానం - అన్యథా జ్ఞానం - సంశయం - విస్మృతి - మొదలైన దోషాలను ఏ మాత్రం లేని నిత్యసూరులు కూడ భయవిహ్వలులై క్లేశపడతారనేది వస్తుతత్త్వమైతే, ఇక, ఈ లోకంలో స్నేహాన్ని కలవారు పొందే వ్యాకులాన్ని గూర్చి ఏమని అనాలి? భగవంతుడైన శ్రీరాముని విషయంలో భరతునకుండే భక్తి సంపద విలక్షణమైనది. అతడు అనిర్వచనీయమైన ఆర్తిని మనస్సులో కలవాడై, ఏ విధంగా అయినా వనం నుండి శ్రీరాముని తిరిగి తీసికొనిపోవాలనే గాఢమైన ఆశతో సైన్యంతో పాటు చిత్రకూట పరిసరాలకు వచ్చాడు. అతనిని

దయతో అన్యథా భావించి శంకించడానికి ఏమాత్రం అవకాశం లేదు కద. వాస్తవం ఈ విధంగా ఉన్నా, గుహుడు భరతుని చూచి **"కచ్చిన్న దుష్టో వ్రజసి రామస్యాక్లిష్టకర్మణః, ఇయం తే మహతీ సేనా శంకాం జనయతీవ మే"** (అనాయాసంగా కార్య నిర్వహణను చేసే శ్రీరాముని పట్ల దుష్టుడవు కాకుండా వెడుతున్నావు కద! ఈ పెద్దదైన నీ సేన నాకు సందేహం కల్గిస్తున్నట్లున్నది) అని అన్నాడు.

వ్యాధుడు, అవివేకి కనుక గుహుడు ఈ విధంగా అన్నాడు, కనుక ఆశ్చర్యం లేదు - అని అనవచ్చు. కాని, యోగులలో అగ్రేసరుడైన భరద్వాజుడు కూడ **"కచ్చిన్న తస్యా పాపన్య పాపం కర్తుమిహేచ్ఛసి, అకంటకం భోక్తుమనా రాజ్యం తస్యానుజస్య చ"** (శ్రీరామా-అయోధ్యా-90-13) (ఏ అడ్డు లేకుండా శ్రీరామునకు, అతని తమ్ముడైన లక్ష్మణునకు చెందిన రాజ్యాన్ని అనుభవించాలనే ఆశను కలవాడవై, ఏ పాపాన్ని చేయని శ్రీరాముని విషయంలో పాపాన్ని చేయగోరి నీవిక్కడకు రాలేదు కద!) అని నిస్సంకోచంగా అడిగాడు. ఈ విధంగా ఉదాహరించదగినవి చాల ఉన్నాయి. శ్రీరాముని దివ్యమంగళ విగ్రహం లోని సౌందర్యాతిశయం చేత వివశమైన మనస్సు కలవారైన సుగ్రీవాదులకు గల గొప్ప రామభక్తి ప్రభావం చేత వారికి ఇటువంటి వ్యాకులత కల్గిందనేది వాస్తవం.

నంబిళ్ళై మొదలైన పూర్వాచార్యుల రసమయమైన ఫణితి ఒకటి ఇక్కడ అనుసంధేయం. "విభీషణ స్వీకారాన్ని సుగ్రీవుడు అడ్డుకున్నాడు. అతనిని తప్పక అంగీకరిస్తానని దృఢంగా పట్టుపట్టుకొని ఉన్నాడు, రాఘవుడు. ఆలోచిస్తే, వీరిద్దరు శరణాగత పరిత్రాణంలోని శ్రద్ధవల్ల వివశులని సిద్ధిస్తుంది'' అనేది ఆ సూక్తి. శ్రీరాముని శరణాగత పరిత్రాణంలోని శ్రద్ధ సుస్పష్టం. కాని, విభీషణుని అడ్డుకొన్నను సుగ్రీవునకు శరణాగతి పరిత్రాణ శ్రద్ధ ఉన్నదని అనడం

ఏ విధంగా అంటే, ఈ విధంగా కిష్కింధ కాండలో శ్రీరాముడు సుగ్రీవుని శరణు పొందాడనేది ప్రసిద్ధం. అందువల్ల సుగ్రీవుడు తనను శరణుపొందిన శ్రీరాముని రక్షించగోరేవాడై, విభీషణ స్వీకారాన్ని అడ్డుకొన్నాడని భావం. ఆ రాక్షసుని పరిగ్రహిస్తే శ్రీరామునకు ఏదయినా అపాయం కలుగ వచ్చుననే శంక వల్లనే కద, సుగ్రీవుడు అతని పరిగ్రహాన్ని అడ్డుకోవటానికి యత్నించాడు. ఈ విధంగా సుగ్రీవునకు కూడ శరణాగత రక్షణ శ్రద్ధా సంపద నిరూపితమైనది. ఇది కేవలం రసోక్తి మాత్రమే కాదు. వాస్తవమని కూడ గ్రహించాలి. ఇక, గదనుమాత్రం ధరించిన విభీషణుని ఉద్దేశించి **"ఏష సర్వాయుధోపేతః"** అనే సుగ్రీవు కథనం కూడ భీతి వల్లనే. ఈ భీతి తన విషయంలో కాదు, శ్రీరాముని విషయంలోనే. రాఘవునకు ఏ కొంచెం అనర్థం కల్గినా, తాము సత్తను కోల్పోయినట్లుగా దృఢంగా భావించినందు వల్లనే **"అస్మాన్ హంతు మభ్యేత్యేషః"** అని అన్నారు, వానరులు.

3) ఇక, మూడవ విచికిత్స సమాధానింపబడుతున్నది. శ్రీరాముడు వానర వీరులకు విభీషణ స్వీకరణ విషయంలో అడ్డగించే అవకాశాన్ని ఏమాత్రం ఇవ్వకుండా, స్వయంగా శీఘ్రంగా విభీషణుని పరిగ్రహించటానికి సమర్థుడైనా, ఎందుకు ఆ విధంగా చేయలేదు? అంతేకాక, వానరుల అభిప్రాయాల సంగ్రహణంలో ఎందుకు ప్రవర్తించాడు? వారి వారి ఆయా అభిప్రాయాలను వ్యక్తం చేయనిచ్చాడెందుకు? అనేది ఇక్కడి ప్రశ్న. ఇక్కడ వివరించవలసినది చాల ఉన్నా, క్లుప్తంగా చెబుతాను. భక్త జన సంశ్లేషంలో ఎంతో ఔత్సుక్యాన్ని కల రామునకు, విభీషణుని వ్యతిరేకించే వానర వీరులను ధిక్కరిస్తూ అతనిని స్వయంగా దగ్గరకు పిలిచి, స్వీకరించడం తగినదే, నిజమే. అయినా, వానర వీరుల అభిప్రాయాలను తెలసికొనగోరడంలోని కొన్ని మనోహరాలైనా కారణాలున్నాయి. వినండి. రాఘవుడు యుక్తమైన కార్యాన్ని కూడ స్వతంత్రంగా

చేయడు. ఇతరుల ఆదేశాన్ని పురస్కరించుకొనే చేస్తాడనే విషయం శ్రీరామాయణంలో సర్వత్ర సుగమం. **"విశ్వామిత్రస్య శాసనాత్, పితుర్వచన నిర్దేశాత్, అగస్త్య వచనాత్, భరద్వాజస్య శాసనాత్"** - అని ఈ విధంగా శ్రీరాముని కార్యంలోని కారణాలు శ్రీరామాయణంలో తెలుపబడ్డాయి. ప్రకృతంలో కూడ **"అజ్ఞాతం నాస్తి తే కించిత్ త్రిషు లోకేషు రాఘవ, ఆత్మానం పూజయన్ రామ పృచ్ఛస్యస్మాన్ సుహృత్తయా, త్వం హి సత్యవ్రత శ్శూరో ధార్మికో దృఢవిక్రమః, పరీక్ష్యకారీ స్మృతిమాన్ నిసృష్టాత్మా సుహృత్సు చ"** (శ్రీరామా-యుద్ధ-17-35, 36) (శ్రీరామా! ముల్లోకాలలో నీకు తెలియనిది ఏదీ లేదు. నిన్ను గౌరవించుకొంటూ మమ్ములను స్నేహం కారణంగా అడగుతున్నావు, అంతే నీవు సత్యవ్రతుడవు, శూరుడవు, ధార్మికుడవు, దృఢమైన పరాక్రమాన్ని కలవాడవు కద! కార్యాలను పరిశీలించి చేసే వాడవు, చక్కని స్మృతి కలవాడవు. మిత్రుల అధీనంలోని మనస్సును కలవాడవు) ఇత్యాది వచనాలతో శ్రీరాముని పొగడుతూ వానరేంద్రులు **''నిసృష్టాత్మా సుహృత్సు చ''** అని పల్కిన మాట గమనించదగినది. **"సుహృత్సు నిసృష్టాత్మత్వమ్"** అంటే - ఆత్మీయులైన వారి అధీనంలో తన మనస్సు కల్గి ఉండడం - అని వివరింపబడింది. అందువల్ల తన స్వాతంత్ర్య పరీవాహ భూతమైన స్వాతంత్ర్య విశేషాన్ని ప్రకాశింపజేసే ఒక రీతి ఇది. అంతేకాక, "శత్రువు పక్షం నుండి వచ్చిన విభీషణుని విషయంలో ఈ వానరులు ఎటువంటి అభిప్రాయాన్ని కల్గి ఉన్నారు? అని పరీక్షించగోరడం ఇంకొక కారణం. శరణాగతుడైన వాని విషయంలో తన అనర్ఘమైన, అద్భుతమైన అభిప్రాయాన్ని ప్రకటించడానికి తగిన అవకాశాన్ని పొందగోరడం ముఖ్యతమ మైనది. ప్రకృతంలో, శ్రీరామచంద్రుడు తన అనర్ఘమైన అభిప్రాయాన్ని దేనిని వ్యక్తం చేశాడు? అంటే - **"విదితః స హి ధర్మజ్ఞః శరణాగత వత్సలః"**

(శ్రీరామా-సుందర-21-20) (శ్రీరాముడు, ధర్మజ్ఞుడు, శరణాగతుల పట్ల వాత్సల్యాన్ని కలవాడుగా ప్రసిద్ధుడు కద) అని రావణునితో సీతాదేవి పల్కిన విషయమే ఇక్కడ ఈ సందర్భంలో శ్రీరామచంద్రునిచే స్వయంగా వివరింపబడింది. తనకుండే శరణాగత వాత్సల్యాన్ని శ్రీరాముడే స్వయంగా ఇక్కడ ఆవిష్కరించాడు. వాత్సల్యమంటే ఏమి? అనే విచారంలో ఏర్పడే వివాదాలను అన్నిటినీ ప్రశమింపజేయడంలో సమర్థమైన సందర్భమిది - అని ప్రామాణికులైన పండిత ప్రవరులు గ్రహిస్తారు. క్రమంగా దీనిని అంతటిని ఉపపాదిస్తాను.

ఈ విభీషణ శరణాగతి ప్రకరణంలో విభీషణుని అంగీకరించరాదని సుగ్రీవుడు ఈ విధంగా అన్నాడు. "రావణునిచే పంపబడి ఈ విభీషణుడు శరణాగతి నెపంతో వచ్చాడు. ఇతనిని పూర్తిగా నిరోధించాలి. కపట బుద్ధితో పంపబడి ఇతడు ఇక్కడకు వచ్చాడు - అనే విషయంలో ఏ సందేహం లేదు. మనకు గొప్ప అపకారాన్ని కల్గించడం కోసమే ఇతడు ఇక్కడకు వచ్చాడని, స్వామీ! గ్రహించు''. కాని, సుగ్రీవుడు పల్కిన ఈ మాటలు శ్రీరామునకు సహించరానివి అయ్యాయి. "సకల జనులను అన్ని విధాలైన ఆపదల నుండి రక్షించడంలో సమర్థుడైన నన్ను ఈ అల్పుడు వానరుడు విపద్విషయ భావార్హునిగా (ఏదో ఆపదను ఈ సుగ్రీవుని వల్ల పొందబోయే వానినిగా) భావిస్తున్నాడే. ఏమి ఇతని దుర్బుద్ధి!, అవివేకం'' అని మనస్సులో చింతిస్తూ మహావీరధౌరేయుడైన శ్రీరాముడు తన సహజమైన గొప్పతనాన్ని, ఇంత కాలంగా మరగు పరచుకొన్న దానిని, ఇక దాచుకోలేక, అవశంగా దానిని వ్యక్తం చేస్తూ **''సుదుష్టోవా వ్యదుష్టో వా కిమేష రజనీచరః, సూక్ష్మమప్యహితం కర్తుం మమాశక్తః కథంచన"** (శ్రీరామా-యుద్ధ- 18-22) (ఈ అసురుడు మంచివాడైనా, లేక, చెడ్డవాడైనా, ఏవిధంగాను కొంచమయినా

అపకారాన్ని నాకు ఏమాత్రం చేయలేడు) అని ఆరంభించి తన అప్రమేయ ప్రభావాన్ని తెలిపాడు. ఆ సందర్భంలో **"పిశాచాన్ దానవాన్ యక్షాన్ పృథివ్యాం చైవ రాక్షసాన్, అంగుళ్య గ్రేణ తాన్ హన్యామ్ ఇచ్ఛన్ హరిగణేశ్వర!"** (శ్రీరామా-యుద్ధ-18-23) (ఓ వానర గణనాయకా! ఈ భూమిలో పిశాచాలను, దానవులను, యక్షులను, రాక్షసులను ఎవరినైనా నేను కేవలం సంకల్పంతో నా కాలి వేలిచివరతో వధిస్తాను) అనే ఈ శ్లోక రత్నం నిజంగా రత్నమే. పిశాచాలు, దానవులు, రాక్షసులు, యక్షులు అందఱు తమ మధ్యలో ఉండే పారస్పరికమైన విరోధాన్ని లెక్కించకుండా ఐకమత్యంతో నాతో స్పర్ధించాలని యథేచ్ఛగా వచ్చినా, వారిని అందరిని నేను అవలీలగా అంగుళి చివరతో సంహరిస్తాను. ధనుస్సు, బాణాలు, అస్త్రశస్త్రాలు - ఇవేమీ అక్కర లేదు. కేవలం అంగుళి చివరతో వారిని ఎగుర గొట్టగలను - అని మొదట అన్నాడు. ఈ పరాక్రమం క్షత్రియ సార్వభౌమత్వానికి చెందినది కూడ కావచ్చునని భావించి, తనకు మాత్రమే అసాధారణమైన, పరమ పురుషత్వానికి చెందిన ప్రభావాతిశయాన్ని ప్రకాశింపజేయగోరినవాడై, వెంటనే **'ఇచ్ఛన్'** అని అన్నాడు "ఇచ్ఛామాత్రంతో సంకల్ప మాత్రంతో వధిస్తాను'' అని దీని అర్థం. **"సోకామయత"** (తైత్తి ఉప-2-6), **"స తపో్య తప్యత"** (తైత్తి ఉప-2-6) (ఆ పరమాత్మ సంకల్పించాడు) అని వేదంలో అధ్యయనం చేయబడిన రీతిన సంకల్ప మాత్రంతో సమస్త జగత్తు యొక్క సృష్టిస్థితి లయాలను ఏ నారాయణుడు నిర్వహిస్తున్నాడో, ఆ నారాయణుడనైన నేను ఇపుడు మానుష రూపంతో అవతరించాను - అనే విషయాన్ని **'ఇచ్ఛన్'** అనే ఈ పదం సూచిస్తున్నది. గోవిందరాజీయ వ్యాఖ్యానంలో ఈ సందర్భంలో ఈ విధంగా లిఖించబడింది - **"తర్హి లంకామాత్రనివాసినో రాక్షసాన్ కిమితి న హన్సీత్యత్రాహ ఇచ్ఛన్ ఇతి. ఇచ్ఛా భావాదేవ తద్వధాభావః; నత్వ**

**శక్త్యైతి భావః"** (అయితే, లంకలో నివసించే రాక్షసులను ఎందుకు వధించవు? అని అంటే, దానికి సమాధానంగా **'ఇచ్ఛన్'** అని చెప్పబడింది. ఆ విధంగా సంకల్పించలేదు కనుకనే, వారి వధ యొక్క అభావం. అంతే తప్ప, అశక్తి వల్ల కాదు. అని భావం'' (ఇది గోవింద రాజీయ వ్యాఖ్యానం). ఈ విధమైన అర్థాన్ని పూర్వాచార్యులు కూడ పలికారు. రావణుడు ఒకవేళ ఎపుడైనా విరోధాన్ని విడచి, ఆభిముఖ్యాన్ని వ్యక్తం చేసి ఉజ్జీవిస్తాడేమో! - అనే ప్రత్యాశతోనే నాకు లంకలోని రాక్షసులను వధించాలనే ఇచ్ఛ ఉదయించలేదు - అని రాక్షసుల వధను సంకల్పించకపోవడంలోని హేతువును మన పూర్వా చార్యులు వివరించారు. కాని, ఇచ్ఛన్ అనే ఈ ప్రయోగంలోని పారమార్థికమైన అర్థ విశేషాన్ని ఎంతో రహస్యంగా ఈ పూర్వాచార్యులే **"సంకల్పయన్‌సన్ "**అని వివరించారు. సంకల్ప మాత్రంగానే - అనేది వ్యాకరణ శాస్త్రాభిమతమైన దీని అర్థం. వ్యాకరణంలోని కృదంత ప్రక్రియలో **"లక్షణహేత్వోః క్రియాయామ్ అనే సూత్ర వివృతిలో హరిం పశ్యన్ ముచ్యతే"** - అని ఉదాహరింపబడింది. "హరిదర్శనం ముక్తికి కారణం''- అని దీని అర్థంగా వ్యాఖ్యానింపబడింది కూడ. ఆ రీతిలోనే ఇక్కడ కూడ రాక్షసాదుల వధలో ఇచ్ఛ అనేది ఒకటే చాలు. ఆ ఇచ్ఛ సంకల్పానికి పర్యాయమే- అని గ్రహించాలి. అంతేకాక, **"హరిగణేశ్వర!''** అనే సుగ్రీవ సంబోధనలో అత్యద్భుత తాత్పర్యం ఇమిడి ఉన్నది. వాలి భయంతో ఋశ్యమూక పర్వతంలో రహస్యంగా తలదాచుకొనే నీకు ఏ హరిగణేశ్వరత్వం అనేది నీకు నాచే పొందింపబడిందో, దానిని నీవు మఱచి పోయినట్లున్నావు. (నా వల్ల నీవు వానరులకు ప్రభువు అయ్యావు - అని మఱచినట్లున్నావు) ఓ వానరా! రాక్షసాధిపుడు, లంకేశ్వరుడైన రావణుని తన తోక చివరలో చుట్టి సముద్రాలలో ముంచి చివరకు జాలిపడి కిష్కింథలో విడిచిన ప్రబల విక్రమశాలి అయిన వాలిని నేను ఒకే బాణంతో చంపి, ఆ వానర ప్రభుత్వ పదంలో నిన్ను అభిషేకించిన నా విక్రమంలో కూడ, అయ్యో!

నీకు సంశయం కల్గిందే! అని పరిహాస పూర్వకంగా **"హరిగణేశ్వర!"** అని శ్రీరాముడు సుగ్రీవుని సంబోధించాడు.

ఇది అంతా అటు ఉండనివ్వండి. ఇక్కడ ప్రధానంగా గ్రహించదగిన అర్థ విశేషాన్ని గమనించండి. యుద్ధకాండలోని 18వ సర్గలో- **"అథ రామః ప్రసన్నాత్మా శ్రుత్వా వాయుసుతస్య చ, ప్రత్య భాషత దుర్ధర్షః శ్రుతవానాత్మని స్థితమ్, మమాపి తు వివక్షాస్తి కాచి త్ప్రతి విభీషణమ్, శ్రోతు మిచ్ఛామి తత్ సర్వం భవద్భిః శ్రేయసి స్థితైః, మిత్ర భావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన, దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేతదగర్హితమ్"** (శ్రీరామా-యుద్ధ -18-1,2,3) (అపుడు సుగ్రీవుని వచనాలను విని, నిరోధించడానికి ఎవరికీ సాధ్యం కాని వాడు, జ్ఞానాన్ని కలవాడు, ఆత్మ నిశ్చయం కలవాడైన శ్రీరాముడు ఈ విధంగా బదులు పలికాడు "నాకు కూడ ఈ విభీషణుని విషయంలో చెప్పాలనే కోరిక ఉన్నది. నా హితాన్ని కోరేమీరంతా నా మాటను వినాలని కోరుకొంటున్నాను. మిత్ర భావంతో వచ్చిన వానిని నేను ఏ విధంగాను విడువను. అతనిలో దోషం ఉండనీ, సత్పురుషులకిది గర్హించ దగినది కాదు) అనే మూడు శ్లోకాలు భగవద్గుణాల పట్ల అభినివేశాన్ని కల భక్తులకు విశేషించి గమనించ దగినది. దీనికి ముందు 17వ సర్గలో **"అథ సంస్కారసంపన్నో హనూమాన్ సచివోత్తమః, ఉవాచ వచనం శ్లక్ష్ణమర్థవన్మధురం లఘు"** (శ్రీరామా-యుద్ధ-17-50) (అపుడు, సంస్కారాన్ని కలవాడు, గొప్ప సచివుడైన హనుమంతుడు అందమైన, అర్థవంతమైన తీయని, సంగ్రహమైన మాటను పలికాడు) అని ఆరంభించి, మహర్షి వాల్మీకి హనుమంతుని అభిప్రాయాన్ని వ్యక్తం చేశాడు. హనుమంతుడయితే - **"ఏతావత్తు పురస్కృత్య యుజ్యతే త్వస్యసంగ్రహః"** (శ్రీరామా-17-67) (దీనిని బట్టి ఈ విభీషణుని అంగీకరించడం తగినదే) అని ముగిస్తూ,

విభీషణుని పరిగ్రహణమే మంచిదనే అభిప్రాయాన్ని ఉద్ఘాటించాడు. తరువాత 18వ సర్గలో **"రామః ప్రత్యభాషత"** (శ్రీరామా-18-1) అని ఆరంభం. ఇక్కడ రసికులీ విషయాన్ని అవధరించాలి. హనుమంతుని వలె శ్రీరాముడు కూడ విభీషణుని పరిగ్రహించడంలో ఔత్సుక్యాన్ని కలవాడే కద! "మారుతి పల్కిన మాట అత్యుత్తమమని నేను అంగీకరిస్తున్నాను'' అని ఇంత మాత్రమే కద శ్రీరామచంద్ర భగవానునిచే చెప్పబడాలి. కాని, వాస్తవానికి శ్రీరాముడు కేవలం ఇంతమాత్రమే పలుకలేదు. **"మమాపి తు వివక్షాస్తి కాచిత్ ప్రతి విభీషణమ్"** (శ్రీరామా-యుద్ధ -18-2) (విభీషణుని విషయంలో నేను కూడ కొంత చెప్పదలచుకొన్నాను) అని పల్కడం ఆరంభించే శ్రీరాముని చేత తాను హనుమంతుని అభిప్రాయం కంటే అతిరిక్తమైన తన, అపూర్వమైన మతాన్ని వ్యక్తం చేస్తున్నట్లు తెలుపబడింది. **"మమాపి తు"** అనేటపుడు గల **'తు'** అనే పదాన్ని చక్కగా గమనించాలి. **'తు'** శబ్దం పూర్వం జరిగిన దానిని వ్యావర్తిస్తుంది. **"మమతు విభీషణం ప్రతికాచి ద్వివక్షాస్తి"** అని పలికే శ్రీరామునిచే, హనుమంతుని అభిప్రాయం కూడ తనకు పూర్తిగా ఆదరణీయం కాదని తెలుపబడినట్లయింది. తరువాత శ్రీరాముడు పల్కిన మాటల తీరు కూడ నిజంగా అటువంటిదే.

ఇక్కడ పాఠకులు విశేషించి జాగ్రత్తగా గమనించాలి. కవితార్కికకేసరి శ్రీవేంకటనాథార్యులు తాము రచించిన **అభయప్రదానసార**మనే గ్రంథంలో ద్రావిడ భాషలో పల్కిన అర్థ విశేషం ఇక్కడ అనువదింపబడుతున్నది. శరణాగతుడైన ఈ విభీషణుడు దుష్టుడైనందున ఆదరించదగిన వాడు కాడు - అని సుగ్రీవాంగదాదుల మతం. ఇతడు దుష్టుడు కానందున పరిగ్రహింపదగినవాడనేది మారుతి మతం.

ఈ రెండు మతాల కంటే భిన్నమైన, మూడవది అయిన తన

మతాన్ని శ్రీరామచంద్ర ప్రభువు "దుష్టుడైనా ఇతడు పరిగ్రహింపదగిన వాడు" అని వ్యక్తం చేశాడు. ఇక్కడ ప్రస్తావింప బడిన మొదటి రెండు మతాలలో ఏ విచారం లేదు. భగవానుడైన దాశరథి మతంగా నిర్దేశింపబడిన మూడవ మతంలో విచారం చేస్తాము. **"మిత్రభావేన సంప్రాప్తమ్"** అని ఉదాహరించిన శ్లోకాన్నే జీవాతువుగా చేసికొని వేదాంత దేశికులు రసభరితమైన వ్యాఖ్యానాన్ని అనుగ్రహించారు. **"మిత్రభావేన సంప్రాప్తమ్"** అనే దానికి హార్దమైన ప్రేమ లేకుండా మిత్రత్వ భావనామాత్రంతో దరిచేరిన వానిని - అని భావం. అటువంటి వానిని నేడు విడువను - అని పలికే శ్లోకంలోని పూర్వార్ధంతో సుగ్రీవాదుల మతం నిరస్తమైనది. విభీషణుడు విడువదగినవాడని కదా వారి మతం ఇక, **"దోషో యద్యపి తస్య స్యాత్ సతామేతదగర్హితమ్"** (శ్రీరామా-యుద్ధ-18-3) (అతని దోషం ఉండనీ. సత్పురుషులకది గర్హించదగినది కాదు) అనే ఉత్తరార్ధం ద్వారా హనుమంతుని మతం పరాస్తమైనది. ఏ విధంగా? అంటే, "ఇతడు నిర్దోషి, కనుక పరిగ్రహింపదగిన వాడు" అని కద మారుతి మతం. ఇతడు దోషం లేనివాడని నీవు ఏ విధంగా అంటావు? శరణాగతుని దోష దృష్టితో గర్హించడం సత్పురుషులకు అభీష్టం కాదు. ఇతడు దుష్టుడు కానీ, కాని నాకు పరిగ్రాహ్యుడే" అని మారుతితో పలికే శ్రీరాముడు "ఇతడు దుష్టుడు కనుకనే నేను ఇతనిని పరిగ్రహిస్తున్నాను" - అని పల్కిన వాడయ్యాడు. తార్కికులు వాదకేళిలో ఒక్కొక్కప్పుడు సాధ్యాన్ని ఖండిస్తారు. మఱొకపుడు హేతువును ఖండిస్తారు. ఆ విధంగానే ఇక్కడ కూడ ఈ రెండు విధాలుగా ఖండించడం అక్షతం. ఇక్కడ, సుగ్రీవాంగదాదుల పక్షంలో సాధ్యాన్ని మాత్రం శ్రీరాముడు ఖండించాడు. హేతువుని ఖండించలేదు. దుష్టత్వమనేది ఇక్కడ హేతువు. పరిత్యజించ దగి ఉండడం సాధ్యం. ఇక్కడ సాధ్యమాత్రం ఖండనం చేయబడింది. హేతువు ఖండింపబడలేదు. ఇక, మారుతి పక్షంలో దోషం లేకపోవడమనే హేతువు ఖండించబడింది. ఇది

కవితార్కిక కేసరి వేదాంత దేశికుల నిరూపణవైఖరి.

ఇక్కడ పరిమితమైన బుద్ధిని కలవారు కూడ విచారిస్తే, **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** (శ్రీరామా-యుద్ధ-18-3) (మిత్ర భావంతో దరిచేరిన వానిని ఏ విధంగాను విడువలేను) అని పల్కిన తరువాత **"దోషో యద్యపి"** ఇత్యాది ఉత్తరార్థం అవకాశం లేనందున పరాహతమని అనాయాసంగా తోస్తుంది. విభీషణునిలో అంగదాదులు ఏ దుష్టత్వాన్ని పలికారో, అది భావబుద్ధి లేనందువల్లనే తప్ప ఇంకొకటి కాదు. ఆ దోషత్వాన్నే **"మిత్ర భావేన సంప్రాప్తమ్"** అని అనువదించి, "ఈ విధమైన దోషాన్ని కలవానిని వెదకడంలో తాత్పర్యాన్ని కల నేను అనుకోకుండా దొరికిన ఇతనిని విడువను" అని పల్కుతూ శ్రీరాముడు పరిత్యజించదగినవాడనే సుగ్రీవాదిమతాన్ని నిరసించి, పరిగ్రహించదగినవాడనే మారుతి మతాన్ని వలె తన అభిప్రాయాన్ని కూడ పోషించిన వాడయ్యాడు. ఇది చాలు కద.. **"దోషో యద్యపి"** ఇత్యాది ఉత్తరార్థానికి ఆవశ్యకత ఇక ఏమున్నది? ఈ విభీషణుడు వాస్తవానికి మిత్రం కాదు. కేవలం మైత్రీభావనను ఆరోపించు కొన్నవాడై, కృత్రిమ భక్తుడై (దుష్టుడై) వచ్చాడు. అయినా ఇతనిని ఏ రీతిలోను విడువలేను - అని శ్లోక పూర్వార్థం ద్వారా పల్కడం చేత భక్తవత్సలుడైన రాఘవుడు ఏమి చెప్పదలచాడో అది అంతా వ్యక్తమైనది కద! ఇక ఉత్తరార్థం అవతరించవలసిన అక్కర ఏమి? అని వివేకం కలవారు తప్పక పర్యాలోచన చేయాలి. ఆ విధంగా నిపుణంగా పర్యాలోచించి చూచినపుడు, ఈ విషయం నిజంగా వ్యక్తమవుతుంది. ఈ విభీషణుడు దోషంలేని వాడు కనుక పరిగ్రహించదగినవాడే - అని పలికే మారుతి యొక్క అభిప్రాయం స్పష్టంగా, సుస్పష్టంగా ఖండించాలి. గూఢంగానే దానిని నిరాకరిస్తే చాలదు - అని శ్రీరాముని బలమైన పట్టుదల, అందువల్లనే **"దోషో యద్యపి"**ఇత్యాది ఉత్తరార్థం ప్రసక్తమైనది. **"దోషో యద్యపి"** ఇత్యాది సూక్తిలోని

సారతమమైన అర్థాన్ని వేదాంతాచార్యవర్యులు తెల్పుతున్నారు గమనించండి.

శ్రీరాముడు తనలో గుణోత్కర్షసిద్ధి కోసం దోష ప్రార్థనను **"దోషః స్యాత్ "**అని చేస్తున్నాడు అని వారి సూక్తి. ఇక్కడ తాత్పర్యం ఇది. దోషంలేని, గుణాన్ని కలవానిని పరిగ్రహిస్తే నా క్షమ, దయ, వాత్సల్యం మొదలైన గుణాల ఉత్కర్షసిద్ధి కలుగదు. కనుక, దోషం కలవానిని పరిగ్రహించినపుడే గుణోత్కర్షసిద్ధి కల్గుతుంది. నా గుణాతిశయాన్ని అభిలషించే నా ముందు పరిగ్రహించడానికి హేతువుగా నిర్దోషత్వాన్ని నిరూపించే ఈ కోతి ఎవరు కనుక? వాస్తవంగా ఇతనిలో దోషం లేకపోయినా, దోషసద్భావాన్ని నా తృప్తి కోసం నిరూపించవలసి ఉండగా, దోషాన్నికల్గిన వాడైనా ఇతనిని దోషం లేని వాడని నిరూపిస్తూ, ఈ హనుమానుడు మంచిగా పల్కినవాడు కాలేదు. దోషాన్ని పురస్కరించుకొనే (దుష్టత్వాన్నే హేతువుగా చేసికొని) విభీషణ పరిగ్రహణాన్ని ఇతడు ప్రరోచన చేసి ఉండాలి - అనేది శ్రీరాముని సూక్తిలోని తాత్పర్యం.

అయితే, దోషం కల్గినవాడనే హేతువు చేతనే పరిగ్రహిస్తున్నాను - అనేది భగవంతుని సూక్తి - అని పర్యవసిస్తే, లోకంలో ఇక దోషం చేసిన వారెవరూ భయపడనక్కరలేదు కదా! దోషం చేయని వారు కూడ ఇక దోషాలను చేయడంలో సంశయించ నక్కరలేదు కదా! - అనే సంశయం కలుగవచ్చు. కాని, ఆ విధంగా అనరాదు. శరణాగతుల కంటే వేఱయిన వారి విషయంలోనే దుష్టత్వం విడువడానికి హేతువు - అని కంఠరవంగా పల్కిన కవితార్కిక కేసరి వచనాలలో అవగాహన లేనందు వల్లనే ఈ సంశయం కల్గిందని తెలియాలి. కొంతమంది మేధావులు ఈ విధంగా ప్రత్యాఖ్యానాన్ని చేయవచ్చు. ఒకానొక మహా ప్రభువు జరిపే విద్యత్ సత్కారసభలో ఒకానొక అజ్ఞుడు సత్కారం పట్ల ఆశతో ప్రవేశించాడు అనుకోండి. అపుడు విద్వాంసులందఱు - "ఇతడు నిరక్షరకుక్షి; సత్కార యోగ్యుడు కాడు''- అని వ్యతిరేకిస్తారు.

అపుడు ప్రభువు ఏం చేస్తాడు? సభలో ప్రవేశించిన అతనిని పరీక్షించవచ్చు. అతడు వాస్తవంగా పండితుడైతే, అతనికి పారితోషికాన్ని అర్పించి సంతోషిస్తాడు. లేకపోతే, అతనిని సభ నుండి బయటకు పంపిస్తాడు. లేక, గొప్ప దయతో అతనికి ఏదయినా ఇవ్వదలిస్తే ఏదో ఒక కారణాన్ని పురస్కరించుకొని యథాకామంగా ఇవ్వవచ్చు. ఇతడు మూఢుడు కనుక ఇతనిని సత్కరిస్తున్నాను - అని అనడు, భావించడు కూడ. ఆ విధంగానే ఇక్కడ కూడ దుష్టుడు కనుకనే ఈ విభీషణునకు అభయాన్ని ఇస్తున్నాను'' అని శ్రీరామచంద్రుడు చెప్పి ఉండకూడదు - అనేది మేధావుల ప్రత్యవస్థానం. ఇక్కడ సమాధానం వినండి. విద్వత్సత్కారం కోసం ప్రయత్నించే (దీక్షితుడైన) ప్రభువు వలె గుణవంతులను మాత్రమే పరిగ్రహించాలనే దీక్షను కలవాడు కాడు, భగవంతుడు. "గుణవంతునే పరిగ్రహిస్తాను, దుష్టులను దండిస్తాను'' అని భగవంతుడు యథాకామంగా అనవచ్చు. దాని వల్ల మనం పాపభీరువులం కావచ్చు. **"యద్రాత్ర్యాపాప మకార్షమ్... యదహ్నా పాపమకార్షమ్''** ఇత్యాదిగా నిత్యం ప్రాయశ్చిత్తాదులలో ప్రవణులం కావచ్చు. అయితే భగవానుడు పరిగ్రహకాలంలో- **"నాసౌ పురుష కారేణ న చాప్యన్యేన హేతునా, కేవలం స్వేచ్ఛయై వాహం ప్రేక్ష్యే కంచిత్ కదాచన"** (ఈ జీవుని, పురుషకారం వల్ల కాని, లేక, ఇంకొక కారణం వల్లకాని నేను పరిగ్రహించడం లేదు. కేవలం నా ఇచ్ఛతోనే ఎపుడో ఒకప్పుడు ఎవనినో ఒకనిని అనుగ్రహిస్తాను) ఇత్యాది వచనంతో ప్రఖ్యాపితమైన నిరతిశయ స్వాతంత్ర్య మహిమతో ఉన్మత్తుని వలె ఏమి చేస్తాడో, అది ఊహించలేనిది, అడ్డుకోరానిది - అనేదే అభయ ప్రదాన ప్రకరణంలో సిద్ధించిన అర్థ సర్వస్వం. ప్రాసంగికంగా ప్రసక్తమైన ఈ విషయం ఇంతటితో ముగింపబడుతున్నది. శ్రీరామచంద్ర భగవానుని దృఢవ్రతత్వం అరణ్యకాండలో, యుద్ధకాండలోను చక్కగా ప్రతిష్ఠింపబడింది.

## శ్రీరామచంద్రుని సామర్థ్యగుణానుభవం

వాల్మీకి మహర్షి తన ఆశ్రమానికి వచ్చిన నారద మహర్షిని ఉద్దేశించి పలు ప్రశ్నలను అడుగుతూ **"విద్వాన్ కః, కస్సమర్థశ్చ"** (విద్వాంసుడెవరు? సమర్థుడు ఎవరు?) అనే రెండు ప్రశ్నలను మధ్యలో అడిగాడు. దీని వల్ల వైదుష్యం, సామర్థ్యం - అనే రెండింటి సామానాధికరణ్యం అసంభవ దోష పరాహతమని సూచింపబడింది. ఒకవేళ ఈ రెండింటి సామానాధికరణ్యం నియతమైతే (వైదుష్యం ఉండే చోట నియతంగా సామర్థ్యం, సామర్థ్యం ఉండే చోట నియతంగా వైదుష్యం ఉంటే) ఈ విధమైన ప్రశ్నను అడిగే అవకాశమే లేదు. ఈ విధంగా ఈ రెండు ప్రశ్నలను అడిగిన వాల్మీకిముని ఈ రెండింటి నియత సామానాధికరణ్యం లేదని, వైయధికరణ్యమే ఉన్నదని స్థిరీకరించిన వారయ్యాడు. విద్వాంసులు సామాన్యంగా అసమర్థులై ఉంటారనే విషయానికి వినోదాన్ని కల్గించే ఒక కథను ఉదాహరిస్తాను.

ఆచార్యపీఠాన్ని అలంకరించే ఒక పండితమణి ఆస్థాన పండితులు నల్గురితో కలిసి శిష్యులను వెంట బెట్టుకొని యాత్రకు బయలుదేరాడు. మార్గ క్రమంలో ముంబయి నగరాన్ని చేరి, అక్కడ ఉండే, మహాధనికుడైన తన శిష్యునకు తన రాకను గూర్చి తెలియజేయగోరి, ఆస్థాన విద్వాంసులలో ఒకరిని ఆ ధనిక శిష్యుని వద్దకు పంపించాడు. ఆ విద్వాంసుడు ధనికుడైన ఆ శెట్టి వద్దకు వచ్చి, అతనిని చూచి చాల ఆశ్చర్యపడ్డాడు. ఆ శెట్టి చాల పెద్ద స్థూలకాయాన్ని కలవాడు. ఆ ఇంటి ద్వార మార్గం నుండి గమనాగమనాలు ఇతనికి సాధ్యం కాదని దృఢంగా తలచాడు, ఆ విద్వాంసుడు. "ఏ విధంగా ఈ వైశ్యుడు ఈ మందిరంలోకి ప్రవేశించాడు?'' అనే విచికిత్స ఆ విద్వాంసుని హృదయమంతా నిండి పోయింది. అందుచేత చాల ఆశ్చర్యంతో ఆ అమాయక విద్వాంసుడు వైశ్యుని చూచి ఏమీ మాట్లాడలేక ఊరికే చూస్తూ ఉండిపోయాడు.

అపుడు వైశ్యుడతనిని "ఎవరు మీరు? ఎందుకోసం ఇక్కడకు వచ్చారు?" అని ప్రశ్నించాడు. విద్వాంసుడు "మహా ప్రభూ! ఆ విషయం అటు ఉండ నివ్వండి. ముందు నాకొక సందేహం కల్గింది. ఈ భవన నిర్మాణం తరువాత నీవు దీని లోనికి ప్రవేశించడం సాధ్యంకాని పని. అందువల్ల ముందుగానే నిన్ను ఇందులో నిలిపి ఈ భవనాన్ని నిర్మించడం జరిగిందా? ఏమి?" అని ప్రశ్నించాడు. దానిని విని ఆ వైశ్యుడు "ఇతడు నా స్థూలకాయాన్ని చూచి వేళాకోళం చేస్తున్నాడు" అని భావించి, అతనిని తన ఇంటిలోపల బంధించమని ఆదేశించాడు. ఆ విధంగా ఆ విద్వాంసుడు బంధింపబడ్డాడు.

ఆచార్యుడు చాల సేపు ఆ విద్వాంసుని కోసం వేచి చూచినా, అతడు తిరిగి రాలేదు. అందువల్ల రెండవ పండితుని ప్రభువు వద్ద జరిగిన సంగతిని తెలియగోరి పంపించాడు. ఆ రెండవ విద్వాంసుడు కూడ వచ్చి జరిగిన దానిని తెలిసికొని, ప్రభువు వద్దకు వచ్చి "ఓ మహాప్రభూ! మాలో ఒక పండితుడు ఇక్కడకు వచ్చాడు. అతని మూర్ఖత్వాన్ని గూర్చి విన్నాను. అతడు పూర్తిగా యథాజాతుడు. ఏదో విధంగా నీవు ఈ భవనంలోకి వచ్చావు. ఆ విషయం ఇపుడెందుకు? రేపో మాపో ఎపుడో ఒకప్పుడు నీవు ఈ శరీరాన్ని చాలిస్తావు. అపుడు నిన్ను ఈ భవనం నుండి బయటకు తీసికొని వెళ్ళే ఉపాయమేమి? అనేదానిని గూర్చి కద ఆలోచించాలి. ఆ చింతలోనే నేను క్లేశపడుతున్నాను సుమా!" అని అన్నాడు. మొదట వచ్చిన పండితునికంటే మిక్కిలి మూర్ఖుడైన ఈ రెండవ పండితునకు కూడ ప్రభువు వెంటనే దండనను విధించాడు.

అనంతరం, మూడవ పండితుని కూడ ఆచార్యుడు ఆ ధనికుని వద్దకు పంపించాడు. అతడు వచ్చి, ముందు అక్కడకు వచ్చిన ఇద్దఱి సంగతిని తెలిసికొని, శ్రేష్ఠి దగ్గరకు వచ్చి, "ప్రభూ! ఇంతకు ముందు నీ దగ్గరకు వచ్చిన ఇద్దఱు మూర్ఖుల అజ్ఞాన విజృంభణను గ్రహించి నా మనస్సు చాల

ఖేదపడుతున్నది. మహాప్రభూ! నీవు మరణించిన తరువాత నిన్నే విధంగా ఈ భవనం నుండి బయటకు తీసికొని రావాలి? - అనే చింతనను మూఢాగ్రణి కద చేస్తాడు. నీ మరణం తరువాత ఇక ఈ భవనం ఎందుకు? క్షణకాలంలో ఈ గోడలను కూలగొట్టడం దుష్కరమా ఏమి? అది చాల సులభమైన ఉపాయం కద!'' అని అన్నాడు. అతని మాటలను విన్న ప్రభువు కోపానికి అవధిలేక పోయింది. ఆ మూర్ఖ పండితునకు కూడ క్రూరదండనను ధనికుడు విధించాడు. ఏమి జరుగుతున్నదో తెలియక విభ్రాంతిని పొందిన ఆచార్యుడు మిగిలిన నాల్గవ పండితుని కూడ జరిగిన సంగతిని తెలిసికొని వెంటనే రమ్మని పంపించాడు. అతడు ధనికుని సమీపించి, ముందు వచ్చిన ముగ్గురు మాటలను, దానికి వారు పొందిన ఫలాన్ని గ్రహించి, ప్రభువు వద్దకు వచ్చి "ప్రభూ! ఈ ముగ్గురు గర్భ దుర్భగులు. వారు పల్కిన మాటలను విని నాకు చాల బాధ కల్గింది. అతి సుందరమైన ఈ మందిరం సొబగు సాటిలేనిది కద! ఈ భవనం గోడలను వివేకం కలవాడెవరు భగ్నం చేస్తాడు? దానిని గూర్చి మనసులో అయినా భావిస్తాడా? నీవు మరణించిన తరువాత, నీ శరీరాన్ని కత్తితో ముక్కలు ముక్కలుగా చేసి, రెండు మూడు పేటికలలో గాని, అయిదారు పేటికలలో కాని పెట్టి బయటకు తీసికొని రావచ్చు కద! అది అసాధ్యమా ఏమి? రమ్యమైన ఈ మందిరాన్ని పడగొట్టాలని ఆ పాపిష్ఠివాడు ఏ విధంగా ప్రస్తావించాడు?'' అని అన్నాడు. ఈ వచనాలను ఆలకించి ప్రభువు పరుష రోష కషాయితాలైన నేత్రాలతో అతనికి ఘోర దండనను విధించాడు.

ఇక తాను పంపించగల్గిన వారెవ్వరూ లేనందున మహా విద్వాంసుడైన ఆ ఆచార్యుడే స్వయంగా ధనికుని దగ్గరకు వచ్చి, అంతా విన్నాడు. తన శిష్యుడైన ఆ శ్రేష్ఠి దగ్గరకు వచ్చి "మహాత్మా! నా దగ్గర ఉండే ఈ పండితులు ఇంత మూర్ఖులని నాకింత వరకు తెలియదు సుమా! కత్తితో నీ దివ్య రూపాన్ని

ఖండించడమనే మాట కర్ణకఠోరమైనది కద! దానిని ప్రస్తావిస్తేనే చాలు, దుఃఖాన్ని కల్గిస్తుంది. అయ్యో! నీవు మరణిస్తే నిన్ను ఈ భవనంలోనే దహనం చేయవచ్చు కద! అది దుష్కరమా! ఈ భవనాన్నే శ్మశానంగా చేయవచ్చు కద! గోడలను పగుల గొట్టడం, కత్తితో నీ దేహాన్ని ఖండించడం అనే దానిని ఈ మూర్ఖులు ఏ విధంగా ప్రస్తావించారు?'' అని అన్నాడు. ఇక ఏమని చెప్పాలి. ఆ ఆచార్యునకు ఏ గతి పట్టి ఉంటుందో ఏమని అనాలి! ఈ అయిదుగురికి తర్క మీమాంసాది శాస్త్రాలలో గల పాండిత్యం అసమానమైనదే కావచ్చు. వారి సామర్థ్యాన్ని చూస్తే ఇటువంటి అన్యాదృశమైనది. అందువల్లనే వైదుష్య-సామర్థ్యాలకు సామానాధికరణ్యం సామాన్యంగా దుర్ఘటమే - శ్రీరామచంద్రునకు గల సామర్థ్యం అప్రమేయమైనది - అనే విషయం ప్రత్యేకంగా అనుభావ్యమైనది. **"లౌకికే సమయాచారే కృతకల్పో విశారదః"** (రామా-సుందర-67-15) (లౌకిక సంప్రదాయంలో శ్రీరాముడు మిక్కిలి సమర్థుడు) అని నారద మహర్షి చేత కీర్తింపబడిన రాముడు కళలో, వైదుష్యంలో పౌష్కల్యాన్ని కల్గి ఉన్నట్లే, లౌకిక క్రియల వైదుష్యంలో కూడ పౌష్కల్యాన్ని కలవాడని ఇక నిరూపింపబడుతున్నది.

శ్రీరామచంద్రునిలో అసామర్థ్యాన్ని శంకించే అవకాశమున్నది, తన చేతనే తనలో అసామర్థ్యమున్నట్లు శంకిస్తున్నట్లుగా తోచేది అయిన ఒకానొక సందర్భాన్ని ప్రస్తావించి, అందులోని వస్తుతత్త్వాన్ని ఉపపాదించడానికి ప్రయత్నిస్తాను. అపాత ప్రతీతిలో "ఇది అసమర్థకృత్యం'' అని సంభావించే అవకాశం ఉన్నది, వాని, దీర్ఘంగా విమర్శించినపుడు "ఇది మహా సమర్థుడైన వాడు చేసే పని సుమా!'' అనిపించేది అయిన ఒక కృత్యం - శ్రీరామచంద్రుడు చేసిన సుగ్రీవ శరణాగతి. పంచవటిలో సీతా విశ్లేషం కల్గిన తరువాత, ఆమెను అన్వేషిస్తూ లక్ష్మణునితో పాటుగా అరణ్యంలో సంచరించే శ్రీరాముడు సుగ్రీవుని

శరణు వేడాడు - అనేది కథా శరీరం. అంతకుముందే - **"యామోషధి వాయుష్మన్! అన్వేషసి మహావనే, సా దేవీ మమ చ ప్రాణా రావణేనో భయం హృతమ్"** (శ్రీరామా అరణ్య 67-15) (ఆయుష్మంతుడవైన శ్రీరామా! ఏ సీతాదేవిని, ఓషధిని వలె, ఈ వనంలో వెదకుతున్నావో, ఆ సీతాదేవిని, నా ప్రాణాలను రెండింటిని రావణుడు అపహరించాడు) అనే జటాయువు మాట వల్ల రావణుడే సీతాదేవిని అపహరించాడని శ్రీరాముడు తెలిసికొన్నాడు. అపుడు, రావణుడుండే లంకా నగరానికి వెళ్ళాలనే కోరిక అతనికి కల్గింది. కేవలం లక్ష్మణుని సహాయంతో అక్కడకు వెళ్ళాడానికి రాముడు ఇష్టపడలేదు. అందువల్ల సహాయ సంపదను సంపాదించు కోవాలనే కోరిక అతనికి కల్గింది. అందువల్ల కిష్కింధను చేరి, అక్కడ సుగ్రీవునితో అగ్నిసాక్షికంగా సఖ్యాన్ని చేసికొని, అపరిమితమైన వానరసేన సముదాయంతో కూడినవాడై, ఆ సుగ్రీవుని యొక్క వానరసేన యొక్కబలంతో సాగరానికి సేతువును కట్టి, రావణుని యుద్ధంలో జయించాడని కదా పౌరాణికులు ప్రతిపాదనను చేస్తారు. వాస్తవానికి ఈ విధమైన కథనానికే శ్రీరామాయణం విశ్వాసం కల్గిస్తుంది. ఈ సందర్భంలో, సుగ్రీవునితో సౌహార్దాన్ని సంపాదించడం కోసం శ్రీరాముడు చేసిన శ్రమ అంతా అసమర్థ కృత్యమని భావించే అవకాశం అయితే ఉన్నది. ముందుగా, ఇంకొకరి సహాయాన్ని కోరడమే అసమర్థకృత్యం. దానికి మించి, దరిద్రుడైన సుగ్రీవుని నుండి సహాయాన్ని కోరడం కూడ అత్యంత అసమర్థకృత్యం. **విశ్వ గుణాదర్శమనే** చంపూ ప్రబంధంలో అయోధ్యావర్ణనను చేసే పురోభాగి (దోషాలను ఎంచే మనస్తత్వాన్ని కలవాడైన) కృశానుపు అనే గంధర్వుడు పల్కిన వాగ్రూపంలో ఈ శ్లోకం వెలువడింది. **"ధిక్కృత్వైవ దశాస్యదర్పశమనం ధీశాలినం వాలినం, సో యం రాక్షస వర్గ నిగ్రహకృతే సుగ్రీవ మన్వగ్రహీత్, తుంగప్రస్తర భంగలిప్సురిహ నిశ్శంకం తు టంకం**

**త్యజన్, సంకల్పం కలయేత పంకజ దళాదాన ప్రసంగాయకః?"** అనేది ఆ శ్లోకం. దీని భావం సంగ్రహంగా ఇది. పెద్దరాతిని పగుల గొట్టాలని అనుకున్నవాడు దాని కోసం టంకాన్ని (పెద్దసుత్తిని) సాధనంగా గ్రహించాలి. ఆ విధంగా కాకుండా, ఎవడైనా తామర పూవురేకును గ్రహిస్తే, అతడు సమర్థుల జాబితాలో ఎంత మాత్రం చేరడు. సరికదా, అసమర్థునిగానే పరగణింపబడతాడు. ఈ విధంగా రావణుని జయించాలని కోరిన రాముడు అతని గర్వాన్ని పోగొట్టడంలో సమర్థుడైన వాలిని సఖునిగా గ్రహించి ఉండాలి. అతనిని కాదని, ఆ వాలిచే దిక్కులకు, మూలలకు, వాని కోణాలకు తరిమి కొట్టబడినవాడై, అతనికి భీతి చెందినవాడై, రహస్యంగా కాలం గడిపే సుగ్రీవుని స్నేహితునిగా పరిగ్రహించాడు - అనేది సుతరాం అసమర్థ కృత్యమే - అనే విషయాన్ని వ్యక్తం చేస్తున్నది - అని చెప్పనక్కర లేకుండానే తెలుస్తుంది (అనేది ఈ శ్లోక భావం)

ఇది వాస్తవమే. **"యదంతరం సింహ సృగాల యోర్వనే"** (రామా-ఆరణ్య- 47-25) (వాలి సుగ్రీవుల మధ్య ఉండే భేదం - సింహానికి, నక్కకు మధ్యఉన్నంత తేడా) అనే విధంగా వాలిని సింహస్థానంలో లెక్కించడం, సుగ్రీవుని నక్కస్థానంలో లెక్కించడం చేసింది, శ్రీరామాయణమే. శ్రీరామాయణం ఉత్తర కాండలోని 34వ సర్గలో వాలి విజయలక్ష్మిని, రావణుని శోచనీయదశను చక్కగా వ్యక్తం చేస్తున్నది. అక్కడి వధను సంగ్రహంగా ప్రస్తావిస్తాను.

రావణుడు ఒకానొక సమయంలో కిష్కింధకు వెళ్ళి, ఆ రాజ్యానికి అధిపతి, కపికుల తిలకుడైన వాలిని యుద్ధం కోసం పిలిచాడు. ఆ సమయంలో వాలి కిష్కింధలో లేడు. అతడు నిత్యం సంధ్యోపాసన కోసం నాల్గు సముద్రాల దగ్గరకు వెళ్ళి, తిరిగి వస్తాడు. ఇది అతని అలవాటు. ఆ విషయాన్ని రావణునకు

కిష్కింధలోని వానర వీరులు తెలియజేశారు. అంతేకాదు. "రావణా! బహుశా తొందరలోనే వాలి తిరిగి ఇక్కడకు వస్తాడు. ఒక క్షణం కాలం వేచి ఉండు. ఒకవేళ, తొందరగానే చావాలనే కోరిక ఉంటే, నీవు సత్వరం దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళు. ప్రాయశః ఈ సమయంలో అతడు అక్కడే ఉండి ఉంటాడు" అని అన్నారు. ఆ మాటలను విని గొప్ప సంరంభంతో రావణుడు పుష్పక విమానాన్ని ఎక్కి వారు చెప్పినట్లుగా దక్షిణ సముద్ర తీరానికి వెళ్ళాడు. అక్కడ బంగారం వంటి శరీరవర్ణాన్ని కలవాడు, ఎఱ్ఱని సూర్యుని వంటి ముఖాన్ని కలవాడు, సంధ్యోపాసనను చేయడంలో ఆసక్తుడైన వాడు అయిన వాలిని చూచాడు. పుష్పక విమానం నుండి దిగి, అతనిని పట్టుకోదలచి, మెల్లిగా చప్పుడు చేయకుండా వెళ్ళాడు. వాలి, అతనికి అభిముఖంగా లేకపోయినా, అనుకోకుండా అతని రాకను గుర్తించాడు. రావణుని అంతరంగాన్ని బాగా గ్రహించిన అతడు ఏమీ సంభ్రమాన్ని పొందకుండా రావణుడు వచ్చే వరకు మౌనంగా ఉండి, అతడు దగ్గరకు రాగానే, అతనిని తన రెండు కక్షకోణాలలో (చంకల మధ్య) పట్టుకొని బంధించాడు. రావణుడతని బంధంలో గట్టిగా ఇరుక్కుపోయాడు. వాలి ఏమీ తొందర పడకుండా, మెల్లిగా మంత్ర జపాదులను ప్రతిదినం కంటే ఎక్కువ శ్రద్ధతో చేసి, మూడు సముద్రాలలోను స్నానం చేయదలచాడు. రావణుని తన పట్టులోనే పెట్టుకొని, తాననుకొన్న రీతిలో మూడు సముద్రాలలో స్నానం చేశాడు. లంకా నివాసులంతా ఈ విషయాన్ని గమనించి రావణుని గూర్చి చాలా భయపడ్డారు. మంత్రులు మొదలైన వారు రావణుని వదలి పెట్టమని వాలిని ప్రార్థిస్తూ అతనిని చాలా సేపు వెంబడించారు. కాని, వాలి ఏమీ విననట్లు పట్టించుకోలేదు. అంతటితో వారు నిరాశగా వెనుదిరిగి పోయారు. చాల సమయమైన తరువాత, వాలి ఎంతో అలసిపోయినట్లుగా కిష్కింధకు చేరి, అక్కడ ఒక ఉద్యానవనంలో భూమిపై దిగాడు. భుజాలను వదలు చేశాడు. అపుడు తన భుజాల సందులలో నుండి జారి అవశంగా

కిందపడిన రావణుని చూచి, ఏమీ తెలియని వాని వలె - "నీవు లంకాధిపతివి రావణుడవు కదూ! ఇక్కడకు ఏ పని మీద వచ్చావు?" అని నవ్వుతూ వాలి ప్రశ్నించాడు.

అపుడు రావణుడు - **"వానరేంద్ర! మహేంద్రాభ! రాక్షసేంద్రోస్మి రావణః, యుద్ధేప్సు రాగతో హంత! పావమేతాదృశీం గతిమ్, అహోబలమహో వీర్య మహోగాంభీర్య మద్భుతమ్, నిమజ్జతోస్మి యేనాహం సాగరేషు చతుర్ష్వపి, వానరేంద్ర త్వయా సాకం సఖ్యమిచ్ఛామి శాశ్వతమ్** (రామా-ఉత్తర-34, 36, 38) (వానరేంద్రా! నీవు ఇంద్రునితో సాటి వచ్చేవాడవు. నేను రాక్షస ప్రభువును, రావణుడను. నీతో యుద్ధం చేయదలచి వచ్చాను. ఆహో! నాకేగతి పట్టింది. ఏమి నీ బలం! ఏమి నీ శౌర్యం! ఏమి నీ అద్భుతమైన గాంభీర్యం! నన్ను నాల్గు సముద్రాలలో ముంచిన నీతో నేను స్నేహాన్ని పొందాలని అనుకుంటున్నాను) అని పల్కి వాలితో అగ్ని సాక్షికంగా స్నేహాన్ని చేసికొని కిష్కింధకు చేరి అక్కడ నెలరోజులు ఉండి లంకకు తిరిగి వచ్చాడు.

ఇటువంటి అత్యద్భుత విక్రమంతో ప్రకాశించే వాలితో స్నేహాన్ని రాముడు చేసికొని ఉంటే, అపుడు ఆ క్షణంలోనే వాలి సీతను తిరిగి తీసికొని వచ్చి ఇచ్చి ఉండేవాడు. ఏ విధంగా! వాలి వెనువెంటనే రావణుని దగ్గరకు సందేశాన్ని పంపి, రావణుని సీతతో పాటు కిష్కంధకు వచ్చేటట్లు చేసి ఉండేవాడు. ఈ విధంగా వస్తుస్థితి జరిగి ఉంటే, రాముడు వరుసగా అనుభవించిన పలు ప్రయాసలకు ప్రసక్తి అనేదే ఉండేది కాదు. **"ఏతదేవానుశోచామి వయోస్యాహ్యతివర్తతే"** (ఈమెకు వయస్సు మించి పోతున్నదే! అనేదే నా బాధ) అనే శోకానికి అవకాశమే లేకపోయేది. **"నైవ దంశాన్ న మశకాన్ న కీటాన్ న సరీ సృపాన్, రాఘవోపనయే గాత్రాత్"**

(రామా-సుందర-36-42) (ఈగలను కాని, దోమలను కాని, కీటాకాలను కాని, సర్పాల వంటి వానిని కాని శ్రీరాముడు సీతావిరహదుఃఖం వల్ల తన శరీరం పై నుండి తొలగించుకోవడం లేదు) అనే సూక్తి రీతిలో దంశ - మశక - కీట - సరీసృపాదుల వల్ల బాధను అనుభవించి ఉండేవాడు కాదు. మార్గాన్ని వదలి, దరిద్రుడైన సుగ్రీవునితో స్నేహం చేసికొనే రీతి శ్రీరాముని అత్యంతమైన అసమర్థతను తెలుపుతున్నది - అనేది పామరులు చేసే పాపిష్ఠమైన విశంక.

అసహాయశూరుడు, మహాత్ముడు అయిన శ్రీరాముని ప్రభావ సముద్రంలోని చిన్న తుంపురును కూడ గ్రహించలేని అత్యంత అల్పులైనవారు చేసే చోద్యం ఇది. దీనిని గురువరులైన కూరేశులు అతిమానుషస్తవంలో **"సాలాన్ హి సప్త సగిరీన్ సరసాతలాఢ్యాన్ ఏకేషు మందజవతో నిరపత్రయస్త్వమ్ తేష్వేకవివ్యథన ఖిన్నకపిప్రణున్నం శాఖామృగం మృగయసేస్మ కథం సహాయమ్"** (అతిమానుష స్తవం-19) (శ్రీరామా! నీవు పాతాళ లోకంలో కూడ, పర్వతాలతో కూడ ఏడు సాల వృక్షాలను నీవు ప్రయోగించిన బాణం యొక్క మందవేగంతోనే ఆకులు రాలిపోయినవిగా చేశావు. అటువంటి సాల వృక్షాలలో ఒక వృక్షాన్ని ఊగించడానికి ఎంతో శ్రమపడిన వాడు, వాలికి భయపడిన వాడు, ఒక వానరుడైన సుగ్రీవుని సహాయంగా ఏవిధంగా అన్వేషించావు?) శ్రీరామచంద్రుని అతిమానుషమైన, అతివృత్తామరమైన విక్రమాన్ని ఈ శ్లోకంలోని మొదటి రెండు పాదాలలో ప్రతిపాదించి, మూడవ పాదంలో సుగ్రీవుని దౌర్బల్యాన్ని ప్రకాశింప జేసి, అటువంటి కోతిని ఏ రీతిలో అయ్యో! నీవు సహాయకునిగా ఎంచుకొన్నావు? అని చివరి పాదంతో ప్రశ్నించడమే ఆచార్య వర్యుల అభిప్రాయం. ఇది దూరూహయా? అవాప్త సమస్తకాముడు, సంకల్ప మాత్రంతోనే సమస్త కార్యాలను నిర్వహించగల సమర్థుడు అయిన భగవానుడైన శ్రీరాముడు ఇంకొకరి సహాయాన్ని అన్వేషించడం అనేది

సర్వాత్మనా అసంభవం. దీనదయాళువు, దీన బంధువు అయిన పరమ పురుషుని అనిర్వచనీయ కృపాతిశయాన్ని ప్రకటించడంలో తాత్పర్యాన్ని కల ఈ చేష్టితం (లీల) భగవద్గుణ విద్ధులైన వారికి మాత్రమే అనుభావ్యం, అంతే తప్ప, అధిక్షేపించదగినది కాదని చక్కగా సూచింప బడుతున్నది. పూర్వం ప్రస్తావింపబడిన, **విశ్వగుణాదర్శ** గ్రంథం లోని కృశానువచన రూపమైన శ్లోకం ఉదాహరింపబడింది కద! ఆ సందర్భంలోనే ఆ వచనానికి సమాధానంగా విశ్వావసువనే గంధర్వుడు పల్కిన ఈ క్రింది మాటను అవధరించండి. ఇది పూర్వాచార్య హృదయాన్ని ఆవిష్కరించే సూక్తి.

**''వాలిని బలోర్మిమాలిని జాగ్రతి నుగ్రీవ మగ్రాహీద్యదయమ్, అస్య శ్రుతి శతసిద్ధం సువ్యక్తం తేన దీన బంధుత్వమ్''** (సముద్రం అంత గొప్ప బలాన్ని కల్గిన వాలి ఉండగా, సుగ్రీవుని శ్రీరాముడు స్నేహితునిగా చేసికోవడాన్ని బట్టి, వందలాది శ్రుతులలో చెప్పబడిన ఆ స్వామి దీనబంధుత్వం చక్కగా వ్యక్తమైనది) అనేది ఆ శ్లోకం. వాలి గొప్ప బలశాలి అనడంలో ఏ సందేహం లేదు. వివాదం అసలే లేదు. వాలి బలాఢ్యత్వం కాని, అతని తమ్ముడు సుగ్రీవుని దౌర్బల్యం కాని ఈ రెండు శ్రీరాముని దృష్టిలో అకించిత్కరాలే. వాస్తవానికి, తనకు సహాయం అన్వేషించడంలో ఆసక్తి ఉన్నపుడు, కద, దుర్బలుడైన వానిని విడిచి పెట్టడం, బలవంతుని స్వీకరించడం జరుగుతుంది. సుగ్రీవుని దుర్బలత్వాన్ని ముఖ్యంగా గమనించి, అతనిని అనుగ్రహించదలచి, అతనితో శ్రీరాముడు సఖ్యాన్ని చేసికొన్నాడు - అనేది వాస్తవ స్థితి. శ్రీకులశేఖరులనే దివ్యసూరులు తాము అనుగ్రహించిన పెరుమాళ్ తిరుమొழிఅనే తమ దివ్య ప్రబంధంలో భగవంతుడైన శ్రీరాముని సంబోధిస్తూ **"ఇళైయవర్కట్కు అరుళుడైయాయ్! ఇరాకవనే!"** అని అన్నారు. **"ఇళైయవర్కళ్"**అనే ద్రావిడ పదానికి - కనిష్ఠ భ్రాతలని, దీనులని

రెండర్థాలున్నాయి. శ్రీరామచంద్రుని కరుణ జ్యేష్ఠుని కంటె కనిష్ఠుని పట్ల ప్రసరించడం స్పష్టంగా గోచరిస్తుంది. ఇక్కడ, జ్యేష్ఠుడైన వాలిని వదలి, కనిష్ఠుడైన సుగ్రీవుని పట్ల, ఆ విధంగానే తరువాత, జ్యేష్ఠుడైన రావణుని వీడి, కనిష్ఠుడైన విభీషణుని పట్ల కద శ్రీరాముని కరుణ ప్రసరించింది. ఈ విధంగా, వయస్సులో కనిష్ఠత్వం వలెనే, శౌర్యావీర్యాదులలో చిన్నతనాన్ని కూడ శ్రీరాముని కరుణ చూచి, కనిష్ఠుని పట్ల ప్రసరించింది. అందువల్ల, అవతార ప్రయోజనాలైన సాధుపరిత్రాణం, దుష్కృద్వినాశనాలనే రెండిటి మధ్య సాధుపరిత్రాణానికి లక్ష్యంగా సుగ్రీవుని, దుష్కృద్వినాశానికి లక్ష్యంగా వాలిని భగవానుడైన శ్రీరాముడు గ్రహించాడు - అని ఏతావన్మాత్రమే ఇతి హాస మర్మాన్ని తెలియడంలో విశారదులైన వారు గ్రహించాలి. **"కశ్చధ్యేయం"** (ఎవడు ధ్యానించ దగినవాడు) **"కారణం తు ధ్యేయం"** (జగత్కారణమే ధ్యానించదగిన వాడు) అనే అధర్వ శిఖావాక్యం చేత నిఖిల జగత్కారణ భూతమైన తత్త్వానికే ఉ పాస్యత్వం చెప్పబడింది. ఆ పరితత్త్వం శ్రీమన్నారాయణుడనే పేరును కల్గినదే.

ఆ శ్రీమన్నారాయణుడే దశరథుని కుమారునిగా అవతరించాడనేది నిర్వివాదం. ఇటువంటి ఈ పరమ పురుషుడు జగత్తును సృష్టించదలచినపుడు ఆ సృష్టికి కావాలిసిన నిమిత్త - ఉపాదాన - సహకారి కారణ త్రయం కూడ ఆ పరమాత్మ కంటే భిన్నం కాదు - అనేది వేదాంతుల మతం. చిదచిచ్ఛరీరకుడై ఉపాదాన కారణత్వాన్ని పొందుతున్నాడు. అద్భుత శక్తిని కలవాడై తన రూపంతో నిమిత్త కారణత్వాన్ని పొందుతున్నాడు. సంకల్ప మాత్రంతోనే సహకారి సమేతుడవుతున్నాడనే నిరూపణం అప్రధృష్యం. కేవలం అటువంటి సంకల్ప మాత్రం చేతనే అతడు సహాయాన్ని కలవాడవు తాడు తప్ప, సుగ్రీవాదుల సహాయం ఆవశ్యకమనేది చింతించడానికి కూడ ఏ మాత్రం తగనిదని తెలియాలి. అయితే, వేదాంత రీతి వేఱు, ఇతిహాస పురాణ రీతి వేఱు- అనే

విషయాన్ని మఱువరాదు. ఇతిహాస రీతిలో ప్రతీయమానమవుతున్న శ్రీరామచంద్రుని సహాయాంతరాన్వేషణ పరత్వం, సుగ్రీవుని రూపంలో ఆ సహాయాన్ని సంపాదించడం - అనే విషయాలు ఆ పరమాత్మకు సహజంగా కల అప్రమేయశక్తి విశేషాన్ని లేకుండా చేయలేవు.

శ్రీరామాయణంలోని ఆరణ్య కాండలో 72వ సర్గలో వాల్మీకి ప్రస్తావించిన కబంధ భాషణం కథా ప్రణాళిని బట్టి పరమార్థ ప్రత్యాయకం. అతడు రామలక్ష్మణులతో - "సూర్యాస్తమయ సమయమానికి ముందే నన్ను దగ్ధం చేయాలి. అపుడు నాకు స్వచ్ఛమైన జ్ఞానం కల్గుతుంది. అపుడు మీకు తత్త్వాన్ని తెల్పుతాను'' అని అన్నాడు. ఆ విధంగానే వారిచే దగ్ధం చేయబడిన కబంధుడు దివ్యమాల్యాంబర భూషణాది విభూషితుడై బయటికి వచ్చి, గొప్పగా వెలిగే దివ్యమైన విమానంలో ఎక్కి **"శ్రుణు రాఘవ తత్త్వేన యథా సీతామవాప్స్యసి"** (రామా - ఆరణ్యా - 72-7) (రాఘవా! సీతను తిరిగి పొందే రీతిని గూర్చి విను) అని ఆరంభించి పలు కర్తవ్యాలను ఆదేశిస్తూ, సుగ్రీవ సహాయ సంపాదనం కూడ చేయమని, అది అత్యావశకమైన కార్యమని అన్నాడు. సుగ్రీవకర్మకమైన, సుగ్రీవకర్తృకమైన సహాయాలను గూర్చి పల్కి, వానిలో సుగ్రీవకర్మకమైన సహాయాన్నే ప్రధానంగా తెలిపాడు. అందువల్ల కూడ దీనుడు, విషాదంలో చరమావధిని పొందినవాడైన సుగ్రీవుని పట్ల దయ చూపడమే ప్రాధాన్యాన్ని సంతరించు కొన్నది. శ్రీరాముడు తన కార్యసిద్ధి కోసం సుగ్రీవుని సేవించ లేదు. ఆ విధంగా కాక తన కార్యం కోసం అతనితో స్నేహాన్ని చేసినపుడు కద అసామర్థ్య శంక ప్రసక్తమవుతుంది.

ఇక, శ్రీరాముడే స్వయంగా ఆశంకించిన తన అసామర్థ్యాన్ని, దాని పరిహారాన్ని ప్రస్తావిస్తున్నాము. లంకను ప్రవేశించి, సీతను చూచి, ఆమెకు రామనామాం గుళీయకాన్ని ఇచ్చి, చూడామణిని ఆమె దగ్గర నుండి తీసికొని

లంకలో క్షోభను కలుగజేసి, తిరిగి వచ్చిన వాయుసుతుని వల్ల తెలియ గోరిన సీతా క్షేమాన్ని తెలిసికొన్న శ్రీరామ చంద్రుడు కపివరసైన్య సహితుడై, రావణునితో యుద్ధం చేయాలనే కోరికతో దక్షిణ సముద్ర తీరాన్ని చేరాడు. అప్రమేయమైన మహోదధిని దాటి కదా లంకను ప్రవేశించాలి. అపుడు సముద్రాన్ని దాటే ఉపాయానికి చెందిన ఆలోచన శ్రీరామునకు కల్గింది. **"తపసా సేతు బంధేన సాగరోచ్ఛోషణేన వా, సర్వదా సుసమర్థోస్మి సాగర స్యాస్యలంఘనే"** (రామా-యుద్ధ- 3-2) (తపస్సు చేసిగాని, సేతువును కట్టిగాని, సాగర జలాలను ఇంకింప జేసిగాని నేను ఈ సాగరాన్ని దాటడంలో చాల సమర్థుడను) అని అపుడు పల్కుతూ సీతాపతి సాగరతరణం తనకు పూర్తిగా అనాయాస సాధ్యమని తలచాడు. పైన పేర్కొన్న శ్లోకంలో సాగరాన్ని దాటడానికి శ్రీరామునిచే మూడు ఉపాయాలు చెప్పబడ్డాయి. అవి - తపస్సు, సేతుబంధం, సాగర జలాలను ఎండగట్టడం. ఇవి మూడు పరమ పురుషునికే సాధ్యాలు. అంతేకదా, జగత్తును సృష్టించాలనే కోరిక కలుగగా **"సోకామయత, బహుస్యాం ప్రజాయేయేతి, స తపో తప్యత, స సతపస్తప్త్వా, ఇదం సర్వమసృజత"** (తైత్తి -2-6) (ఆ పరమాత్మ - నేను అనేకంగా జన్మిస్తాను - అని సంకల్పించాడు. అతడు తపస్సును చేశాడు. ఆతడు ఆ విధంగా తపస్సు చేసి, ఈ అంతటిని సృష్టించాడు) అనే ఉపనిషద్వాక్యంలో **"స తపో తప్యత"** అని ప్రస్తుతింపబడ్డ తపస్సే శ్రీరాముడు పల్కిన తపస్సు. **"తపసా సమర్థోస్మి"** - సంకల్ప మాత్రం చేతనే సమర్థుడనవుతున్నాను - అని అర్థం. ఇక, సేతుబంధం, సాగర జలాలను ఇంకింప జేయడం అనేవి రెండూ కూడ పరమ పురుషునకు మాత్రమే సాధ్యపడేవి - అనే దానికి వివరణ అక్కర లేదు. ఈ విధంగా చెప్పబడిన మూడు ఉపాయాలతో సాగరాన్ని దాటడానికి తనకు పూర్తిగా సామర్థ్యమున్నదని శ్రీరాముడు ఆవిష్కరించాడు. ఆ తరువాత, కథాంతరాల వల్ల సాగర తరణోద్యమం ఆగిపోయింది. శుక సారణుల

ఆగమనం, విభీషణుని రాక మొదలైన సందర్భాల వల్ల శ్రీరాముడు కార్యాంతర పరుడయ్యాడు. విభీషణుని పరిగ్రహించే వరకు కార్యం అంతా సుసంపన్నమయినది. ఇక, మళ్ళీ సాగరాన్ని దాటాలనే ప్రయత్నం అంకురించింది. **''సర్వథా సుసమర్థోస్మి సాగరస్యాన్య లంఘనే''**(రామా-3-2) (ఈ సముద్రాన్ని దాటడంలో నేను పూర్తిగా సమర్థుడను) అని అవలీలగా ముందు పల్కిన రామచంద్రుడు ఇపుడు ఏమన్నాడు? అంటే, కొత్తగా తాను పరిగ్రహించిన వాడు, తన గొప్ప ప్రేమను నోచుకొన్నవాడైన విభీషణుని పట్ల ఆదరాతిశయం పెల్లుబికినందున "అతడు ఏ విధంగా పల్కితే ఆ విధంగా చేస్తాను'' - అని అన్నాడు. ఆ విభీషణుడు **"సముద్రం రాఘవో రాజాశరణంగంతు మర్హసి"** (రామా-యుద్ధ- 19-30) (శ్రీరాముడు సముద్రాన్ని శరణు పొందదగినవాడు) అని అన్నాడు. సముద్రాన్ని దాట గోరిన శ్రీరామునిచే సముద్ర దేవత శరణాగతి వరణ విషయంగా గ్రహించదగినవాడని అన్నాడు *సర్వలోక శరణ్యాయ* **"రాఘవాయ మహాత్మనే"** (మహాత్ముడు, లోకాలకు అన్నిటికి గొప్ప శరణం అయిన రాఘవునకు) అని పల్కుతూనే శరణాగతిని చేయమన్నాడు. తను చేసిన శరణాగతి వల్ల కార్యసిద్ధి కల్గడం గమనించినందున, లోకంలో అందరికి శరణాగతియే కార్యసాధన సమర్థమైనదని తలచిన వాడై, విభీషణుడీ విధంగా ఉపాయాన్ని పలికాడని తెలియాలి. సర్వలోక శరణ్యుడనైన నేను ఏ విధంగా ఈ ఉప్పు సముద్రాన్ని శరణు పొందగలను? అసమర్థుని పనికద!, శరణు పొందడమనేది. సుసమర్థుడనైన నాకు ఏ విధంగా శరణాగతి చేయడంలో యోగ్యత ఉన్నది? అని అతని మాటలను శ్రీరాముడు తోసిపుచ్చి ఉండాలి. అయినా, భక్తుడైన విభీషణుని మాటపట్ల ఉండే ఆదరాతిశయం చేత సాగరాన్ని శరణు పొందాడు. **"నిశాస్త్రిస్రోతి చక్రముః"** (రామా.యు.21-10) (మూడు రాత్రులు గడచి పోయాయి). సాగర దేవత ఏ మాత్రం ముఖాన్ని చూపలేదు. రాముడైతే తీవ్రమైన

కోపాన్ని ఆలోపించుకొని, **"అసమర్థం విజానాతి మామయం మకరాలయః"** (రామా - యుద్ధ - 21-21) (ఈ మొసళ్ళకు నిలయమైన సముద్రం నన్ను అసమర్థునిగా తలుస్తున్నట్లున్నది) అని లక్ష్మణునితో పల్కుతూ కలియ తిరిగాడు. "సోదరా! సౌమిత్ర! ఈ ఉప్పు సముద్రం తన అల్పత్వాన్ని కొంచెం కూడ గుర్తించకుండా, నన్ను చేతగాని వానినిగా తలుస్తున్నది. వాస్తవానికి నేను సమర్థుడనో, లేక, అసమర్థుడనో, క్షణంలో ఇపుడు ఇది గ్రహిస్తుంది. వెంటనే వింటిని తీసికొని రా. సర్పాలవంటి బాణాలను కూడ తీసికొనిరా. క్షణకాలంలో సాగరాన్ని శోషింపజేస్తాను. పంచ భూతాలలో జలతత్త్వం నశించిందనే ప్రఖ్యాతిని కల్గిస్తాను. జలతత్త్వం లేకుండా నాల్గు భూతాలతోనే లోకంలో జనులు తమపనులను సాధించుకోగలరు, చూడు". అని ఈ రీతిలో చాలా ఉద్భటమైన వాక్కును రాముడు పలికాడు. అపుడు, సముద్ర దేవత వినయంగా, సమీపించి, తగిన రీతిలో విజ్ఞాపన చేసి, చేయదగిన పనిని చేసింది - అనే పద్యభాగం ఉండనివ్వండి, ఇక్కడ పలు విమర్శలు చేయబడితే చేయబడ నివ్వండి. సర్వథా సుసమర్థుడైన వాని చేత అసమర్థకృత్యం చేయబడడం అనేది ఏ మాత్రం తగదు. శ్రీరాముడు చేసిన శరణాగతి అయితే, అది పూర్తిగా అసమర్థకృత్యమే. ఆకించన్యం, అనన్యగతిత్వం - అనేవి ఎవనిలో నిండుగా ఉన్నాయో, అతడే శరాణాగతిని చేయడానికి అధికారి. భగవద్యామున మునీంద్రులు **"అకించనోనన్య గతిః శరణ్య! త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"** (స్తోత్రరత్నమ్-22) (శరణ్యా! నేను అంకిచనుడను, అనన్య గతిని. నీ పాద మూలాన్ని శరణు పొందుతున్నాను) అని కదా అనుసంధించారు. ప్రపన్నులందరికి సర్వస్వ మనదగిన, ఉభయవిభూతి నాథుడయ్యేవాడు అకించనుడే విధంగా కాగలడు? **"మాతా పితా భ్రాతా నివాసః శరణం సుహృద్గతిః నారాయణః"** (సుబాలోపనిషత్) (నారాయణుడు- తల్లి, తండ్రి, సోదరుడు, నివాసం శరణం, మిత్రం, గతి) అని చెప్పబడిన రీతిలో అందరితో

అన్ని విధాలైన బంధుత్వాన్ని కలవాడై భాసించే భగవంతుడు, అయ్యయ్యో! ఏ విధంగా అనన్యగతి కాగలడు! కానేకాడు. అకించన్యం, అనన్యగతిత్వం అనేవి పూర్తిగా శ్రీరామునిలో సంభవించవు - అనేది సుదృఢం.

## శ్రీరామచంద్రుని సౌందర్యగుణానుభవం

శ్రీరామచంద్ర భగవానుని నిరపాయమైన వీర్య గుణాన్ని అప్రతిమశీల గుణాన్ని, అద్వితీయ సత్యవాక్యత్వాన్ని, అతిగభీర యుక్తి వాదిత్వాన్ని, అప్రధృష్యదృఢ వ్రతత్వాన్ని, సంప్రతిపన్న సుసామర్థ్యాన్ని యథోచితంగా ఇంత వరకూ ప్రతిపాదించాము. ఇక, ఇపుడు ఆ స్వామి యొక్క నిరతిశయ సౌందర్య గరిమను గూర్చి ఉపపాదించడానికి ఉపక్రమిస్తున్నాము. ఈ గుణాన్ని ప్రస్తావించే దశలోనే నిజంగా ఆ గుణవైభవానికి విహ్వలతను పొందుతున్నాము. ఇంత వరకు ప్రస్తుతించిన గుణాల కల్యాణ చరిత్ర వల్ల ఏదో కొంచెం వాటికి సంబంధించిన జ్ఞానం కల్గితే కల్గి ఉండవచ్చు. కాని, సౌందర్యమనే గుణాన్ని గూర్చి చెప్పాలంటే, చక్షుసాక్షాత్కారం లేకుండా దానిని గూర్చి ప్రస్తావించడం శక్యం కాదు కద! ఇపుడు శ్రీరంగనాథ - శ్రీవేంకటేశ - శ్రీహస్తిశైలేశ - శ్రీ మత్సుందరబాహు ప్రభృతుల రూపం లోని అర్చామూర్తుల దివ్య మంగళవిగ్రహాలలోని దివ్య శోభాసాక్షాత్కారం లభించినందు వల్లనే కద మనం ఆయా మూర్తుల సౌందర్యాన్ని దర్శించి, ఆనందించి, సంతుష్టులం కాగల్గుతున్నాము. త్రేతాయుగంలో అవతరించి, కొంతకాలం ఈ లీలా విభూతిలో వేంచేసి ఉండి తిరోహితుడైన వాడు, అందువల్ల ఇపుడు మన వంటి గర్భ దరిద్రుల కళ్ళకు ఏ మాత్రం గోచరం కాని వాడైన శ్రీరామచంద్రుని సౌందర్యవర్ణనం చేయాలనే ఈ ప్రయత్నం కల్ప వృక్షానికి పలు దినాల క్రితం పూచిన పూల సౌరభం పండిన ఫలాల సౌవాదవం మొదలైన వానిని గూర్చి వర్ణించాలనే ప్రయత్నం వలె అపహాస్యమే కాగలదు కద! ఇది నిజం. అయినా, అంత మాత్రంలో మనం శ్రీరామచంద్రుని సౌందర్యానుభవమనే భాగ్యాన్ని ఏ విధంగా కోల్పోగలము? ఎంతమాత్రం కోల్పోలేము, కోల్పోము కూడ. వస్తుతః, శ్రీరామ సాక్షాత్కారాన్ని కల్గిన వాల్మీకి

మునీంద్రాదుల వచన సమూహాన్ని వివరించడం ద్వారా ఏదో కొంత కృతకృత్యులం కావాలని కోరుదాం. యాగచరుఫలభూతులైన నల్గురు పుత్ర రత్నాలకు నామకరణ సంస్కారాన్ని చేస్తూ వశిష్ఠ భగవానుడు మొదటి కుమారునకు, వాక్కులు, మనస్సుకు అందని అతని అందాన్ని చూచినందు వల్లనే, రాముడనే పేరును పెట్టాడు. **"రమత ఇతి రామః, రమయతీతి రామః"** అనే సుప్రసిద్ధాలైన రెండు వ్యుత్పుత్తుల్లో, రెండవ వ్యుత్పత్తి అంటే - ఆనందింపజేస్తాడు కనుక రాముడు - అనే వ్యుత్పత్తి మిక్కిలి ఔచిత్యాన్ని కల్గినది. తన నిరతిశయ సౌందర్య, లావణ్యాలతో వివేకులు, అవివేకులు అనే భేదం లేకుండా అందరి మనస్సులను రంజింపజేసేవాడు- అనే ఈ అభిప్రాయంతోనే మహర్షి ఈ నామాన్ని పెట్టాడు.

ఇపుడు, శ్రీరామసౌందర్యానుభవ భాగ్యశాలుర అనుభవాలను ప్రదర్శించడం జరుగుతున్నది. శ్రీరామునకు యౌవరాజ్య పట్టాభిషేకాన్ని చేయాలని నిశ్చయించుకొన్న దశరథ చక్రవర్తి శ్రీరాముని తన దగ్గరకు రమ్మని పిలిపించాడు. శ్రీరాముడతని దగ్గరకు వచ్చాడు. తన వద్దకు వచ్చే ఆ శ్రీరాముని దూరం నుండి చూచే దశరథ చక్రవర్తి ఆ శ్రీరాముని సౌందర్య సాగరంలో తలమునకలు వేస్తూ ఉన్నా, ఎంత మాత్రం తృప్తిని పొందలేదు. ఈ అద్భుతానుభవాన్ని గూర్చి ప్రస్తావిస్తూ వాల్మీకి మహర్షి ఆ సందర్భంలో కొన్ని శ్లోకరత్నాలను నిబంధించాడు. అవి ఏవి? అంటే - **"ప్రాసాదస్థో రథ గతం దదర్శాయాంత మాత్మజమ్, గంధర్వ రాజ ప్రతిమం లోకే విఖ్యాత పౌరుషమ్, దీర్ఘబాహుం మహాసత్త్వం మత్తమాతంగ గామినమ్, చంద్ర కాంతాననం రామ మతీవ ప్రియ దర్శనమ్, రూపౌదార్యగుణైః పుంసాం దృష్టి చిత్తాపహారిణమ్, ఘర్మాభితప్తాః పర్జన్యం హ్లాదయంతమివ ప్రజాః"** (శ్రీరామా-అయోధ్యా-3-27, 28, 29, 30) అనేవి. వీటి భావం ఏమంటే -

రాజభవనంలో ఉండే దశరథుడు రథంలో తన వద్దకు వచ్చే కుమారుడైన శ్రీరాముని చూచాడు. ఆ శ్రీరాముడు గంధర్వరాజసమానుడు, లోకంలో ప్రసిద్ధి పొందిన పరాక్రమాన్ని కలవాడు. పొడుగైన బాహువులను కలవాడు, గొప్ప బలాన్ని కలవాడు, మత్తగజం నడకం వంటి అందమైన నడకలను కలవాడను, చంద్రుని కంటె మించిన ఆకర్షణను కల ముఖాన్ని కలవాడు, మిక్కిలి అందమైన రూపాన్ని కలవాడు, రూపంలోని గొప్పతనంతో, గుణాలతో మానవులందరి దృష్టిని మనస్సులను దోచేవాడు, ఎండవేడిమిచే తపించినవారిని తన చల్లని వృష్టితో ఆనందింప జేసే మేఘం వంటి వాడు. అటువంటి శ్రీరాముని దర్శించిన దశరథుడు తావన్మాత్రానుభవంలో తృప్తి పడనివాడై, ఇంకా ఇంకా శ్రీరామసౌందర్యాన్ని దర్శించాలని తహతహలాడాడు.

ఈ శ్లోకాలలోని స్వాదిష్ఠగుణాన్ని (మాధుర్యాన్ని) గూర్చి వర్ణించడానికి మనం ఏ పాటి వారం? పరమ భోగ్యాలైన వాక్య సందర్భాలు కద, ఈ శ్లోకాలు. వీటి అర్థాను భవాన్ని కొంచెం ఆస్వాదిద్దాం.

**(చంద్రకాంతాననమ్)** - చంద్రుని వలె అందమైన ముఖాన్ని కలవాడనే ఉపమిత సమాసంలో అంత స్వారస్యం లేదు. చంద్రుని మించిన ఆకర్షణీయమైన ముఖాన్ని కలవాడు శ్రీరాముడు. చంద్రుడు క్షయించే కళలను కలవాడు కద. కళంకం - మచ్చను - కలవాడని కూడ ప్రతీతి. అందఱు అతనిని ఉత్కంఠతో చూడరు. **"ఏకో హి దోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః"** (కుమార సంభవం 1-3) (చంద్రుని కిరణాలలో అతనిలో ఉండే మచ్చ కనుపించనట్లు, పలు గుణాలున్నపుడు ఏదో ఒక దోషం ఉన్నా, అది కన్పించదు) అనే మహాకవి వచనం కూడ మోఘార్థకమే. (వట్టిదే). రాముడెక్కడ? సోముడెక్కడ? అని కద తోస్తుంది. **"సోమవత్ ప్రియదర్శనః"** (చంద్రుని వలె అందమైనవాడు) అనే మహర్షి

వచనం కూడ కేవలం లౌకికమైన ఉపచ్ఛందనమే. **"ఉపమేయాచ్ఛతగుణ ముపమానమ్"** (ఉపమేయం కంటే వందరెట్లు గొప్పది ఉపమానం) అని ఆలంకారికు లంటారు. అయ్యో! ఈ న్యాయం ప్రకృతంలో దుర్ఘటం కద!

**(అతీవ ప్రియ దర్శనమ్)** - నిరంతరం దర్శిస్తూ ఉన్నా ప్రతి క్షణం కలిగే దర్శనం నవనవీ భూతంగా, ఎప్పటికప్పుడు నిత్యనూతనంగా ఉంటుంది.

**(రూపౌదార్యగుణైః దృష్టిచిత్తాపహారిణమ్)** - ఇక్కడ **"రూపం చ ఔదార్యం చ గుణాశ్చ"** అనే ద్వంద్వ సమాసం వివక్షితం కాదు. రూప విషయంలోని ఔదార్యం - గొప్పతనమే రూపౌదార్యం. ఆ రూపౌదార్యం, గుణాలు - అనే ద్వంద్వం అందమైనది. క్షత్రియ కుమారుడైన శ్రీరామచంద్రుడు జాత్యుచితంగా సదా కంచుకంతో అలంకరింపబడ్డ (కప్పబడ్డ) దేహాన్ని కలవాడై ఉంటాడు. అందరు అతని అందాన్ని సాక్షాత్తు దర్శించదగిన రీతిలో ఉంటూ, తన రూపంలో చూచే వారిని ఆనందింపజేస్తాడు. **"రూపం చ ఔదార్యం చ"** అని ద్వంద్వ సమాసాన్ని చేసినప్పటికీ పద సన్నికర్ష బలం వల్ల పైన తెలుపబడిన అర్థం స్ఫురిస్తుంది. **"య ఆత్మదా బలదా"** (ఆత్మను అనుగ్రహించిన వాడెవడో, అతడే తనను అనుభవించడానికి కావలసిన బలాన్ని ఇస్తాడు) అని తైత్తిరీయం చతుర్థకాండ లోని సప్తమఖండం తెల్పుతున్నది. ఆత్మను ఇచ్చేవాడు - **"ఆత్మదాః"**. ఇది బహు వచనం రూపం కాదు. క్విబంతమైన ఏక వచన రూపం. భగవంతుడు చేసే దానాలన్నిటిలో చాల గొప్పది, పరమ విలక్షణమైనది అయిన దానం ఇది. **"నాయమాత్మా"** ఇత్యాది శ్రుతి వాక్యంలో **"తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్"** (అతనికి పరమాత్మ తన దివ్యమంగళ విగ్రహాన్ని దర్శింపజేస్తాడు) అని ఈ అర్థం ఉపబృంహితమైనది.

**(పుంసాం దృష్టిచిత్తాపహారిణమ్)** - అనే చోట **"పుంసామ్"** అని విశేషించి పల్కడం వల్ల, అతడు స్త్రీల చిత్తాన్ని అపహరించే వాడు కాడు- అనే రసికులు కాని వారి వ్యాఖ్యానం, అయ్యో! లోకంలో - ఒక పురుషుడు ఎంతటి అందగాడైనా అతనిని చూచిన ఇంకొక పురుషుడు అతని పట్ల వ్యామోహాన్ని పొందడు; ఏ ఆడది, ఇంకొక ఎంత అందమైన ఆడదాన్ని చూచినా మోహాన్ని పొందదు - అనేది పూర్వానుభవసిద్ధమైన, లోకంలో గోచరమయే విషయం. పురుషులు స్త్రీల పట్ల వ్యామోహం, స్త్రీలకు సుందర పురుషుల విషయంలో వ్యామోహం కల్గుతుందనేది ప్రకృతి సిద్ధం. దీనికి విపరీతంగా ఉంటే, అది ఆ పురుషునిలో, లేక, స్త్రీలో ఉండే అవధికి మించిన సౌందర్యాతిశయాన్ని సూచిస్తుంది - అనేది నిస్సందేహం. ప్రస్తుతంలో, శ్రీరాముని సౌందర్యం పురుషులు దృష్టిని, చిత్తాన్ని హరిస్తుంది - అని అనడం వల్ల స్త్రీల వ్యామోహం **"దండాపూపికాన్యాయ"** (నైమిత్తిక న్యాయ) సిద్ధం. లేక, పుంసామ్ అని అనడం చేత స్త్రీపుంసాధారణమైన ఆత్మ నిర్దేశింప బడిందని అనవచ్చు. **"పుమానేకో వ్యవస్థితః"** (పురుషుడనే వాడొకడే ఉన్నాడు) అని కద శ్రీవిష్ణుపురాణ వచనం. దీనివల్ల సురులు, నరులు, తిర్యక్కులు మొదలైన ఏ తేడా లేకుండా, స్త్రీ పురుష భేదం లేకుండా అందరి దృష్టిని, చిత్తాన్ని తన అందంతో హరించేవాడు శ్రీరాముడు - అనే అర్థాన్ని ఇది తెల్పుతుందని తెలియాలి.

శ్రీరామ సౌందర్యంలో విహ్వలతను పొందిన కొంతమంది విశిష్ట వ్యక్తులను ఇక్కడ ప్రస్తావించడం జరుగుతున్నది. ముందుగా, విశ్వామిత్ర మహర్షిని గూర్చి తెలుప బడుతున్నది. ఈ మునివరుడు దశరథ మహారాజు వల్ల రామ లక్ష్మణులను గ్రహించి, వారిని తీసికొని బయలు దేరాడు. దారిలో సూర్యుడు అస్తమించగా, రామ లక్ష్మణులిద్దరు నిద్రించారు. మరునాటి ఉ

దయ సమయంలో ముని ప్రభాత గీతాన్ని పల్కుతూ **"కౌసల్యా సుప్రజా రామ! పూర్వా సంధ్యా ప్రవర్తతే ఉత్తిష్ఠ నరశార్దూల! కర్తవ్యం దైవమాహ్నికమ్"** (రామా-బాల-23-2) (కౌసల్యా దేవికి కల్గిన గొప్ప సంతానమా! శ్రీరామా! ఉదయ సంధ్య ఇపుడు జరుగుతున్నది. ఓ నరశ్రేష్ఠా! నిద్రలే, దైనందిన కృత్యాలను నిర్వహించాలి) అని అన్నాడు.

ఈ శ్లోకంలో రెండవ పాదం నుండి ఉండే మూడు పాదాలు అటు ఉండనివ్వండి. ప్రథమపాదంలోని సూక్తి సన్నివేశం, ఆహా! అత్యంత సుందరం. **"కౌసల్యా సుప్రజా రామ!"** అని పాదం అంతా పూర్తిగా శ్రీరామ సంబోధన పరంగా ఒక అర్థ నిర్వాహం చేయబడింది. ఓ రామా! అనేది మాత్రం సంబోధనం. **"కౌసల్యా సుప్రజాః"** అనేది ప్రత్యేకమైన వాక్యమనేది ఇంకొక అర్థ నిర్వాహం. మొదటి అర్థ నిర్వాహంలో - కౌసల్యకు కల్గిన సుపుత్రా! ఓ రాఘవా! అని సంబోధింపబడింది. దీనికంటే, రెండవ నిర్వాహం పరమ రమణీయం. కౌసల్యా సుప్రజాః అనే వాక్య భేదం ఇక్కడ వివక్షితమైన అర్థం. ఏకవాక్యత్వం సంభవిస్తే, వాక్య భేదం తగినది కాదు **"సంభవత్యేక వాక్యత్వే - వాక్య భేదో న యుజ్యతే"** (తత్త్వ ముక్తా కలాపం-జడద్రవ్యసరం-14) అనే తాంత్రికుల న్యాయం ఇక్కడ ఆదరింపబడడం లేదు. అర్థ స్వారస్యాన్ని దృష్టిలో ఉంచుకొని న్యాయాన్ని లెక్క పెట్టక పోవడం న్యాయమే- అని అంటారు రసికులు. అందువల్లనే శ్రీమద్వేదాంత దేశికులు **తత్త్వముక్తాకలాపంలో- "తర్కైకాలంబిగోష్ఠ్యాం భవతు బహుమతిం తావకీలాఘవోక్తిః"** అని అన్నారు. లాఘవ - గౌరవ విచారం, వాక్య భేదంలోని ఔచిత్య - అనౌచిత్య విచారం - మొదలైనవి శుష్క విషయాలలో ప్రసక్తం అయితే కానీ, రసఘనమైన అర్థంలోని స్వారస్యాన్ని ఆస్వాదించేటపుడు అది అనాదరణీయం - అనేదే పూర్వాచార్యుల అభిసంధి. అందువల్ల ఇక్కడ **"కౌసల్యా సుప్రజాః"** అనే

వాక్య భేదాన్ని ఆదరించడం వల్ల వర్ణనకు ఏ మాత్రం అడ్డులేదని గ్రహించాలి. మునికి ఇపుడు- రాజకుమారులను ప్రబోధనం చేయడమే కర్తవ్యకృత్యం. అయినా, ఆ కర్తవ్యాన్ని మరచిపోయి, శ్రీరాముని కన్నతల్లి అయిన కౌసల్యా దేవిని పొగడడం ఆరంభించాడు. ఏమి తపస్సును చేసి కౌసల్య ఈ కుమారుని కన్నదో కద! అని ఆమెను అభినందిస్తూ, **"కౌసల్యా సుప్రజాః"** అని అన్నాడు. లోకంలో పుత్రవతి అంటే కౌసల్య మాత్రమే. మిగిలిన తల్లులందఱు వంధ్యలే - అనేది దీని తాత్పర్యం. వాచామగోచరమైన సౌందర్య లావణ్యాలకు నిధి అయిన ఈ రాజకుమారుని కన్నందు వల్లనే కౌసల్య పుత్రవతి అయినది - అని చెప్పినట్లయినది. లోకంలో సుందరులైన నరులలో కూడ వారు నిద్రించేటపుడు వారిలో అనేక వికారాలు గోచరిస్తాయి. రామునిలో అయితే, అతడు నిద్రిస్తున్నపుడు కూడ మరింత గొప్పగా ప్రకాశించే శోభాతిశయాన్ని కలవాడై విరాజిల్లుతున్నాడే! ఆహో! అనే హర్షం ఈ సూక్తిలో వ్యక్తమవుతున్నది. సుందరకాండలో హనుమంతుని ఉద్దేశించి, కాకాసుర వృత్తాంతాన్ని పలికే **"వైదేహి స మయా బోధితః శ్రీమాన్ సుఖసుప్తః పరంతపః"** (శ్రీరామా- సుందర- 67-6) (నిద్రాకాలంలో కూడ గొప్ప శోభను కలవాడు, ఆ సమయంలోనూ శత్రువులకు భయాన్ని కల్గించేవాడు, సుఖంగా నిద్రించిన ఆ శ్రీరాముడు నాచే ప్రబోధింప బడ్డాడు) అని పల్కినది అంతా రాఘవుని నిద్రా సమయంలో అతనిలో గోచరించే శోభాతిశయాన్ని దర్శించి ఆనందించినందున పల్కినదే కద! **"సుఖసుప్తః శ్రీమాన్, సుఖ సుప్తః పరంతపః"** అని రెండు విధాలుగాను అన్వయాన్ని పూర్వాచార్యులు ఆచరించారు. మొదటి యోజనలో - నిద్రా సమయంలో కూడ శ్రీరామునిలోని శోభకు కొఱత లేదని, రెండవ యోజనలో- శత్రునిరసనాన్ని చేయగోరిన శ్రీరాముడు సదా మెలకువగా ఉండాలనే నియమం లేదని, నిద్రించిన వాడైనపుడు కూడ అతడు

అరిభయంకరుడేనని స్ఫురిస్తున్నది. ఈ రెండవ అన్వయంలో కంటే మొదటి యోజనలోనే రసపుష్టిని రసజ్ఞులు భావిస్తారు.

**"కౌసల్యా సుప్రజాః"** అనే చోట వ్యాఖ్యాన చక్రవర్తి అయిన గోవిందరాజాచార్యులు **"భోజనకాలే విస్మృత ముఖ ఇవాసీన్మునిః"** (భోజన సమయమంలో నోటిని మరచిన వాని వలె - భుజించడం మరచిన వాని వలె- ముని అయ్యాడు) అని వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానం లోని అందమైన అర్థాన్ని వెంటనే విశదీకరిస్తాము. మధ్యలో మా మనస్సులోని ఒక విచారాన్ని ప్రస్తావిస్తాము. ప్రకృతంలో ప్రస్తావింపబడిన గోవిందరాజీయ వాక్యంలోని అర్థాన్ని తెలియలేని వారంతా శ్రీ రామాయాణ వ్యాఖ్యాన ముద్రణను చేసినపుడు **"బోధనకాలే విస్మృత ముఖోభూన్మునిః"** అని ముద్రించారు. ఆంధ్ర - గ్రంథ - దేవ నాగరి లిపిలలో ముద్రించిన శ్రీరామాయణ వ్యాఖ్యానకోశాలన్నిటిలో ఈ వాక్యమే సమానంగా కన్పడుతున్నది. **"భోజనకాలే"** అనేపదం, **"విస్మృత ముఖః"** అనే పదంలో మాత్రం వారి మనస్సులలో సరి అయిన అర్థాన్ని భాసింప జేయలేదనేది స్పష్టం. ప్రభాత కాలంలో భోజనానికి ఏ ప్రసక్తి లేదు. ముఖవిస్మరణ మనేది కూడ పూర్తిగా ప్రకృతంలో అనన్వితమని వారంతా భావించి ఉంటారు. **"బోధనకాలే విస్మృత ముఖో మునిరాసీత్"** (బోధన కాలంలో ముని విస్మృతముఖుడయ్యాడు) అనే వాక్యానికి ప్రకృతంలో ఏమి ఉపపత్తి ఉన్నది? - అని వారు ఎంత మాత్రం ఆలోచించిన వారు కాలేక పోయారు. అయ్యో! ఇక, యథావస్థితమైన వాక్యాన్ని, దానిలోని అర్థాన్ని తెల్పుతాము, వినండి. ఈ శ్లోక వ్యాఖ్యానంలో నిద్రా సమయంలోని శోభను చూచి, అందులో ఆసక్తుడైనవాడై తాను అయోధ్యకు వెళ్ళి శ్రీరాముని వెంటబెట్టుకొని వచ్చిన కార్యాన్ని సైతం మరచి, "ఇతనిని ప్రసవించిన కౌసల్య ఏమి తపస్సును చేసిందో కద!" అని ముని

ఆశ్చర్యపోతున్నాడు -'' అనేది ప్రాచీన వ్యాఖ్యలోని వాక్యం. ఈ వాక్యాన్ని మన పూర్వాచార్యులు తమ దివ్య ప్రబంధ వ్యాఖ్యానాలలో **''కౌసల్యా సుప్రజారామ!''** ఇత్యాది ప్రకృత పద్యాన్ని ఉదాహరించి, ద్రావిడ భాషలో వివరిస్తూ వ్రాసినది అంతా దానికి సంస్కృతానువాద రూపమే. ఇక, తరువాతి వాక్యంలో ఏమార్పు లేదు. ఇక, పూర్వాచార్యుల ద్రావిడ సూక్తి ఏమంటే - **ఉణ్ణప్పుక్కు వాయై మఱైప్పారైప్పోలే''** (భుజించ గోరి, నోటిని మరచే వారివలె) అనేది. "భుజించడానికి ఉపక్రమించిన వాడు నోటిని మఱచిపోయినట్లు'' అనేది దాని భావం. ఇంతకు ముందు ప్రస్తావించిన పూర్వ వాక్యంలోని **"స్వాగమన కార్యం విస్మృత్య"** (తన రాకలోని కారణాన్ని మఱచి) అనే దానితో ఈ ఉదాహరణం చక్కగ సమన్వయాన్ని పొందుతున్నదని గ్రహించాలి. **"భోక్తుం ప్రవృత్తో జనో వదనం విస్మరతి"** (భుజించడాని ఉపక్రమించిన వాడు నోటిని విస్మరిస్తున్నాడు) అని పల్కినపుడు, దీని అర్థమేమి? అనే జిజ్ఞాస కల్గుతుంది. దానికి ఏమి సమాధానం? అంటే వినండి - అపూర్వమైన, అద్భుతమైన ఒక భక్షణం వడ్డింపబడినపుడు, భుజించేవాడు వెంటనే దానిని భుజించడం మఱచి, దానిలోని గొప్ప రస గుణాలు అనుభవంలో కంటే, దాని బాహ్యమైన అవయవ సౌష్ఠవంలో (అందంగా మలచిన రీతిలో) ఆకర్షితుడై, "ఆహా! ఏమి ఈ భక్ష్యం! ఎంత అందమైనది! దీనిని తయారు చేసిన చతురుడు ఎవడు? దీనిని నిర్మించిన వాడు ఈ భూమిలోనే ఉన్నాడా! ఇది నిజంగా ఈ లోకంలో నిర్మింపబడినదిగా తోచడం లేదు. దివ్యంగా కన్పిస్తున్నదే!'' ఇత్యాదిగా పొగడుతూ, దానిని భుజించడంలో కొంత ఆలస్యం చేస్తాడు - అనేది లోకంలో గమనించే విషయం. ఇదే ఇక్కడ వదన విస్మరణమనేది. ఆ భోజ్య వస్తువును నోటిలో పెట్టుకొని భుజించడం విస్మరిస్తాడని భావం. ఈ విధంగానే విశ్వామిత్రముని కూడా రాముని పడక నుండి నిద్ర లేపడం మరచి, అతని తల్లి కౌసల్యను పొగడడంలో ఆసక్తుడయ్యాడు, ఆహా! అనేది ఇక్కడ అర్థ వివక్ష. ఇందువల్ల ఇక్కడ

**"బోధనకాలే విస్మితముఖో మునిరాసీత్"** అనేది తగినది కాదు. **"భోజనకాలే విస్మృత ముఖ ఇవ ఆసీత్"** అనేది తగినది - అని రసికులు, కుశలులు తెలియ గలరు. ఈ విధంగా శ్రీరామ సౌందర్యంలో విద్ధులైన వారిలో విశ్వామిత్ర మహర్షి అగ్రేసరుడు.

ఇక, దశరథుని అనుభవ విశేషం కొద్దిగా నిరూపించబడు తున్నది. ఇది శ్రీకులశేఖరాళ్వార్ల శ్రీసూక్తి ద్వారా ఉద్ధరింపబడు తున్నది. దశరథ చక్రవర్తి "ఓ పుత్రరత్నా! ఒకసారి నా దగ్గరకు వచ్చి వెళ్ళు" అని శ్రీరాముని పిలిచేవాడు. శ్రీరాముడు కూడ తదాజ్ఞానుసారంగా వచ్చేవాడు. అపుడు ప్రభువు "వెళ్ళిరా, పుత్రరత్నా" అని అనేవాడు. ఆ మాట విని రాముడు తిరిగి వెళ్ళేవాడు. మళ్ళీ తిరిగి శ్రీరాముని రమ్మని చక్రవర్తి పిలిచేవాడు. "తండ్రీ! ఎందుకు ఈ విధంగా మాటిమాటికి వెళ్ళి రమ్మనే ప్రయాసను నాకు కల్గిస్తున్నావు?" అని రాముడు ఏనాడూ అనేవాడు కాదు. రమ్మని అన్నపుడు వచ్చేవాడు, వెళ్ళమని పల్కినపుడు వెళ్ళేవాడు, అంతే. ఈ విధంగా ఆదేశించే చక్రవర్తికి ఏమి అభిప్రాయం? అంటే, పరమ రసికులైన ఆచార్యులు ఈ విధంగా బదులిచ్చారు. శ్రీరాముని ముఖ భాగం, పృష్ఠ భాగం - రెండూ సమానంగా చాల అందమైనవి. ముఖారవిందంలోని గొప్ప అందాన్ని దర్శించాలని క్షణకాలం రమ్మని అనేవాడు రాజు. మళ్ళీ పృష్ఠభాగ సౌందర్యాన్ని దర్శించాలనే అభిలాషతో "వెళ్ళిరా" అనేవాడు. ఈ విధంగా మాటి మాటికి పలికి చక్రవర్తి తన పుత్రుని సర్వాంగ సౌందర్యాన్ని అపర్యాప్తితో అనుభవిస్తూ ఆనందించాడు. **"ఘర్మాభి తప్తాః పర్జన్యం హ్లాదయంత మివ ప్రజా :, న తతర్ప సమాయాంతం పశ్యమానో నరాధిపః"** (శ్రీరామా- అయో-3-29, 30) (ఎండ వేడిమికి తాపాన్ని పొందిన ప్రజలు తమను ఆనందింప చేసే మేఘాన్ని చూచినట్లుగా, ప్రభువు తన వద్దకు వచ్చే శ్రీరాముని చూచిన వాడైనా, పర్యాప్తిని పొందలేదు.) అని వాల్మీకి మహర్షి

పలికాడు. **''అహం పునర్దేవ కుమార రూప మలంకృతం తం సుతమాప్రజంతమ్, నందామి పశ్యన్నపి దర్శనేన భవామి దృష్ట్వా చ పునర్యువేవ''** (శ్రీరామా-అయో-12-103) (దేవ కుమార రూపుడు సుబ్రహ్మణ్యునివలె అందమైనవాడు, చక్కగా అలంకరించు కొన్నవాడు, నా దగ్గరకు వచ్చేవాడు, కుమారుడు అయిన శ్రీరాముని చూచి ఆనందించాను. అతని దర్శనంతో మళ్ళీ తిరిగి యౌవనాన్ని కలవాని వలె అయ్యాను) అని చక్రవర్తి స్వయంగా పలికాడు.

ఇక, దండకారణ్య వాసులైన తాపసుల మాట ప్రస్తావింపబడుతున్నది. **''రూప సంహననం లక్ష్మీం సౌకుమార్యం సువేషతామ్, దదృశు ర్విస్మితాకారాః రామస్య వనవాసినః''** (శ్రీరాముని రూపంలోని పొందికను, ప్రత్యంగ శోభను, సౌకుమార్యాన్ని, సువేషతను, లావణ్యాన్ని దండకారణ్యం లోని మునులు దర్శించి ఆశ్చర్యపడ్డారు) అని ఆరణ్య కాండలో మొదటి సర్గలో తాపసుల దశను తాపసవరేణ్యుడైన వాల్మీకి స్వయంగా పలికాడు. ఈ శ్లోకంలో **"వనచారిణః"** అని, **"వనవాసినః"** అని పాఠభేదాలు. వనంలో సంచరించేవారు, వనంలో నివసించేవారు - ఎవరైనా - చివరికి పశువులు కూడ పరవశ హృదయులయ్యారు. ఇంతకంటే గొప్ప ఆశ్చర్యాన్ని వినండి.

పంచవటిలో శ్రీరామచంద్రునిచే ఆదేశింపబడిన లక్ష్మణుడు శూర్పణఖ ముక్కు చెవులు కోసి వేశాడు. ఆ శూర్పణఖ ఖరుని దగ్గరకు వచ్చి ప్రలాపా విలాపాలను చేస్తూ, "ఈ ఇద్దరు పాపిష్టి వారు. నాకు ఈ ద్రోహాన్ని చేశారు'' అని చెప్పవలసి ఉండగా, ఆ విధంగా కాకుండా ఈ క్రిందిరీతిలో పల్కింది.

**"తరుణౌ రూపసంపన్నౌ సుకుమారౌ మహాబలౌ, పుండరీక విశాలాక్షౌ చీర కృష్ణాజినాం బరౌ, గంధర్వ రాజప్రతిమౌ పార్థివ**

**వ్యంజనాన్వితౌ"** (శ్రీరామా-ఆరణ్య -19-14,15,16) (వయస్సులో ఉండే వారు, గొప్ప రూప సంపద కలవారు, సుకుమారులు అయినా, గొప్ప బలం కలవారు, తామర వంటి విశాల నేత్రాలను కలవారు, చీర వసనాలను ధరించిన వారు, గంధర్వరాజు వంటి వారు, చక్రవర్తి లక్షణాలను కలవారు) అని ఈ విధంగా దాశరథి సౌందర్యంలో పారవశ్యాన్ని పొందిన హృదయం కల్గినదై ఆక్రందించింది. శ్రీరామచంద్ర భగవానుని పట్ల గొప్ప ప్రేమ నిండిన వారైన అయోధ్యావాసుల నోటి నుండి ఇటువంటి వచన వ్యక్తి అవతరించలేదు. ఆహా! నిందించాలని ఆరంభించినవారి ముఖం నుండి ప్రశంసావాక్య రీతియే ప్రాదుర్భవించేటట్లు చేస్తున్నది శ్రీరామ సౌందర్య మహిమ.

ఖర దూషణాదుల వధ తరువాత, రావణుని సమీపానికి వెళ్ళిన శూర్పణఖ అతని సమక్షంలో కూడ సౌందర్యాన్నే వర్ణించింది. ఈ సందర్భంలో కూడ గోవిందరాజ వ్యాఖ్యానం లోని ఒక ముద్రణదోషాన్ని ప్రాసంగికంగా ప్రస్తావిస్తాము. ఈ ప్రకరణంలో **"దీర్ఘబాహుర్విశాలాక్షః చీరకృష్ణాజినాంబరః, కందర్ప సమరూపశ్చ రామో దశరథాత్మజః"** (శ్రీరామా-ఆరణ్య-34-5) (విశాలమైన నేత్రాలను కలవాడు, దీర్ఘమైన బాహువులను కలవాడు, నారబట్టలను కట్టినవాడు, మన్మథునితో సాటివచ్చే వాడు, దశరథ కుమారుడైన శ్రీరాముడు) అనే ఈ శ్లోకం యొక్క వ్యాఖ్యానావతారికలో ఈ పంక్తి కన్పిస్తున్నది. **''రామానుజ వరవశ హృదయాపి తదగ్రజ కృత మహోన్మాద హేతుభూతం రామలావణ్యం సంగ్రహేణాభిధత్తే - దీర్ఘ బాహు రిత్యాదినా"** ఇటువంటి సన్నివేశాన్ని కల వాక్యమే ముద్రణ ప్రతులన్నిటిలో కన్పిస్తున్నది. ఈ వాక్యం పూర్తిగా అన్వయం లేనిది. కొన్ని తాళపత్ర కోశాలను పరీక్షించినా, వాటిలో కూడ ఈ వాక్యమే గోచరించింది. శూర్పణఖ ముఖానికి వలె, ఇక్కడ ఉండే వాక్యంలో కూడ ఒక అక్షరానికి వివర్యాసం కల్గింది.

**"రామానుజ పరవశ హృదయాపి"** అనేది ఏ మాత్రం అర్థం లేని మాట. రామానుజుడంటే లక్ష్మణుడు, అతని పట్ల పరవశ హృదయత్వం శూర్పణఖకు లేనే లేదు. ఇక, **తదగ్రజ"** పదంతో రాముడు గ్రహింపబడుతున్నాడు. అతనిచే ఏ మహోన్మాదం కల్గించ బడింది? దానికి హేతుభూతం (హేతువు) రామలావణ్యమనే వచన రీతి పూర్తిగా అర్థశూన్యం. ఇక, వస్తుస్థితి ఈ విధంగా భావ్యం. రామానుజ అనే చోట కామానుజ అని పఠించాలి. **"కామానుజవరశ హృదయాపి"** అనియే వ్యాఖ్యాత తన హస్తంతో లిఖించి ఉంటారు. చాటూక్తి అయిన దీనిలోని అర్థాన్ని గ్రహించలేనివారు **"రామానుజ"** అని మార్చి ఉంటారు. అయ్యో! ఇక, దీని అర్థం వినండి. **"కామాత్ క్రోధోభిజాయతే"** అని శాస్త్రం. ఇది లోకానుభవ సిద్ధం కూడ. అందువల్ల **"కామానుజః** అంటే క్రోధమనే అర్థం సిద్ధిస్తుంది. **"క్రోధపరవశ హృదయాపి"** (క్రోధ పరవశు రాలైన) అని తాత్పర్యం. తన అంగభంగం వల్ల శూర్పణఖ క్రుద్ధురాలైనది కద! ఇక తదగ్రజ శబ్దంతో క్రోధాగ్రజుడు కాముడు గ్రహించదగినవాడు. కామం వల్ల కద ఈ శూర్పణఖకు గొప్ప ఉన్మాదం కల్గింది. దానికి హేతువు రామలావణ్యమే. కనుక ప్రకృతంలో అంతా చక్కగా ఉపపన్నమైనది. ప్రాసంగికమైన ఈ విషయం ఇంతటితో ఉండనివ్వండి.

ఇపుడు, ఇంకొక విషయానికి వెడదాం. కపికులపతి అయిన మారుతికి కల్గిన శ్రీరామసౌందర్య సాగరావగాహనాన్ని గూర్చి కొద్దిగా ప్రస్తావింప బడుతున్నది. పంపానదీ తీరంలో మొట్టమొదటగా శ్రీరాముని దర్శించినపుడు మారుతి ఈ విధంగా అన్నాడు. **"ఆయతాశ్చ సువృత్తాశ్చ బాహవః పరిఘోపమాః, సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః?"** (శ్రీరామా-కిష్కింధ-3-15) (విశాలమైనవి, చక్కగా వర్తులమైనవి, పరిఘలవంటివి, అన్ని ఆ భరణాలను ధరించదగినవి, లేక అన్ని భూషణాలను

భూషించదగినవి అయిన నీ బాహువులు ఎందుకోసం అలంకరింపబడనివిగా ఉన్నాయి?) ఈ శ్లోకానికి ముందు శ్లోకాలలో ఇంకా కొన్ని శ్లోకాలు రామ సౌందర్యావగాహనాన్ని తెలిపేవిగా ఉన్నా, వాటికన్నిటి కంటే ఈ శ్లోకం పరమభోగ్యమని మన పూర్వాచార్యులు దీనిలో మిక్కిలిగా విద్ధులయ్యారు. **"ఆయతౌ చ సువృత్తౌ చ బాహూ తే పరిఘోపమౌ, సర్వభూషణ భూషార్హౌ కిమర్థం న విభూషితౌ?"** అని ద్వివచన ప్రయోగంతో ఈ పద్యరచనను చేయడం సులభమే అయినా, బహువచన ప్రయోగం వల్ల పలు రహస్యార్థాలను ఆచార్యులు వెలికి తీశారు. **రామస్య దక్షిణో బాహుః"** (రామునకు కుడి చేయివంటివాడు) అని లక్ష్మణుడు రామదక్షిణ బాహుస్థానీయుడు కనుక, అతని బాహువులు కలిపి బహువచనం ప్రయోగింపబడిందని కొందఱు అన్నారు. హనుమంతుడు భక్తుడు కనుక, అతనికి చతుర్భుజ రూపంతో శ్రీరాముడు సాక్షాత్కరించాడు. అందువల్లనే బహువచనం చక్కగా ఉపపన్నమైనది అనేది సాంప్రదాయికమైన పరమార్థం. రావణ వధానంతరం శ్మశాన భూమికి వచ్చి, విలపించే మండోదరి **"తమసః పరమోధాతా శంఖచక్రగదా ధరః"** (తమస్సుకు దూరమైనవాడు, సృష్టికర్త, శంఖచక్రగదా ధరుడు) అని భగవంతుడైన నారాయణుని చతుర్భుజత్వాకారాన్ని దర్శించి పల్కినట్లే, ఇక్కడ కూడ అటువంటి ఆకారాన్ని దర్శించి నందువల్లనే **"బాహవః"** అనే బహువచనాన్ని హనుమంతుడు పలికాడు. ఈ విశేషం అటు ఉండనివ్వండి. ఇక, **"ఆయతాః** ఇత్యాది శ్లోకంలోని ఉత్తరార్ధం - **"సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః?"** అనేది. ఇది రసిక వాక్యం కాదు; కపి వచనం.

**"ఆఘ్రాతం పరిచుంబితం పరిముహుర్లీఢం పునశ్చుంబితం. త్యక్తం వా భువి నీరసేన మనసా తత్ర వ్యథాం మా కృథాః, హే సద్రత్న!**

**తవైతదేవకుశలం యద్వా నరేణాదరాత్ అంతస్సార విలోకన వ్యసనినా చూర్ణీకృతం నాశ్మనా"** (ఓ సద్రత్నమా! వానరం నిన్ను వాసన చూచి, చుట్టూముద్దాడి, మళ్ళీ మాటి మాటికి నాకి, మళ్ళీ చుంబించి, ఏమీ లభించ నందున నిన్ను ఉసూరుమని అంటూ కింద పారవేసిందని చింతించవద్దు. నీలోపల ఉండే సారాన్ని చూడాలనే ఆసక్తితో నిన్ను ఆ వానరం రాతితో చూర్ణం చేయకపోవడ మనేది నీకు చాల మంచిది అని గుర్తించు) అనే శ్లోకం రసికులు తెలిసినదే. ఇటువంటి మాటకు యోగ్యమైన వానర జాతికి చెందిన హనుమంతుడు **"సర్వభూషణ భూషార్హాః కిమర్థం న విభూషితాః"**అని అన్నాడంటే, ఆహా! ఏమి అనాలి?

**(సర్వభూషణ భూషార్హాః)** అన్ని నగలతో అలంకరించ దగినవి - అనేది సామాన్యార్థం. కాని అది అంత సరసం కాదు. అన్ని భూషణాలను భూషించగల్గినవి - అనేది పూర్వాచార్యాభిమతమైన మహార్థం. **"ఆభరణ స్యాభరణం ప్రసాధన విధేః ప్రసాధన విశేషః ఉపమాన స్యాపి సఖే! ప్రత్యుపమానం వపుస్తస్యాః"** (స్నేహితుడా! ఆమె రూపం ఆభరణానికి ఆభరణం, అలంకార విధికి అలంకార విశేషం. ఉపమానానికే ఉపమానం సుమా)అని కాళిదాసు చేసిన ఊర్వశీ వర్ణనం ప్రకృత రామాయణ శ్లోకార్థ చౌర్యమేనని గ్రహించాలి. మనవంటి జనులు ఆభరణాలను ధరించడం వల్ల అపూర్వశోభను కలవారం అవుతాము. సహజ కోమలుడైన భగవంతుడు భూషణాలతో అలంకరింపబడినపుడు ఆ నగలకే శోభను కల్గిస్తాడు తప్ప, ఆ నగల వల్ల స్వామికి కలిగే కొత్త అందం ఏమీ ఉండదు. స్వయంగానే పూర్ణంగా అభివృద్ధి చెందే శోభను కలవాడతడు. శ్రీరంగ క్షేత్రంలోని శ్రీరంగనాథ స్వామిని కీర్తించే పాశురాలలో **"ఆభరణత్తుక్కు అழకుకొడుక్కుమ్ పెరుమాళ్"** (ఆభరణాలకు అందాన్ని ఇచ్చే స్వామి) అనే పాశుర విశేషం ప్రసిద్ధం. కాళిదాసు

ఏదో ఒక సమయంలో అక్కడకు వెళ్ళి, ఆ పాశురాన్ని విన్నందువల్లనే **"సుశోభనం తదిదమాప వర్ణనమ్"** (ఈ వర్ణన ఎంతో చక్కనిది) అని ఆనందించిన వాడై, ఆ వర్ణననే ఊర్వశీ విషయంలో చేశాడనేది వాస్తవం. మొదట ఇటువంటి భావం మారుతి మనస్సులో కల్గింది. అందువల్లనే అతడు **"సర్వభూషణ భూషార్హాః"** అని అన్నాడు. **"కిమర్థం న విభూషితాః"** అని ప్రశ్నించే మారుతి మాటలో ఏమి తాత్పర్యం? అంటే, "భగవన్! రామచంద్రా! నీ బాహు సౌందర్యాన్ని ఈ విధంగా బయటకు కన్పించేటట్లు వ్యక్తం చేస్తే దానికి దృష్టి దోషం కల్గుతుంది కద! దానికి పరిహారం ఏర్పడేటట్లుగా ఆభరణాలతో నీవు నీ బాహువులను ఎందుకు ఆచ్ఛాదించుకోలేదు? - అని ప్రశ్నించడమే. దీనివల్ల హనుమంతుని మంగళాశాసన తత్పరత వ్యక్తమవుతున్నది. అందువల్లనే శ్రీవచన భూషణమనే గ్రంథంలో మంగళాశాసన పరులైన మహాత్ముల పరిగణనలో విశ్వామిత్ర - జనకరాజ - జానకీ ప్రభృతుల మధ్యలో హనుమంతుని పరిగణన చేయబడింది. ఈ హనుమంతుడే అశోక వనంలో సీతతో సంభాషిస్తూ ఉండగా, **"యాని రామస్య చిహ్నాని లక్ష్మణస్య చ వానర!, తాని భూయ స్సమాచక్ష్వ న మాం శోక స్సమావిశేత్, కీదృశం తస్య సంస్థానం రూపం రామస్య కీదృశమ్, కథమూరూ కథం బాహూ లక్ష్మణస్య చ శంస మే"** (శ్రీరామా-సుందర-35- 3,4) (ఓ వానరా! శ్రీరాముని, లక్ష్మణుని చిహ్నాలను గూర్చి నాకు తెలుపు. వానిని వింటే నా మనస్సు దుఃఖాన్ని పొందదు, మఱచి పోతుంది. ఆ శ్రీరాముని రూపం ఎటువంటిది? అవయవ సన్నివేశంలో ఎటువంటిది? లక్ష్మణుని రూపం ఎటు వంటిది. నాతో పల్కు) అని సీతాదేవిచే ప్రశ్నింపబడిన వాడై **"త్రిస్థిరః త్రిప్రలంబశ్చ త్రిసమస్త్రిషు చోన్నతః"** (శ్రీరామా-సుందర-35-17) (వక్షస్సు, మణి బంధం, ముష్టి - అనే మూడు చోట్ల స్థిరంగా ఉండే వాడు, వేలాడు భ్రూముష్క బాహువులు కలవాడు, కేశాగ్ర వృషణ జానువులనే వానిని సమంగా కలవాడు, బొడ్డు లోపలి భాగం,

కుక్షి, వక్షస్సు అనే ఉన్నతిని కలవాడు) ఇత్యాదిగా అభిజ్ఞాన (గుర్తుల) వర్ణనను చేయడానికి ముందే **"రామః కమల పత్రాక్షః సర్వసత్త్వ మనోహరః"** (శ్రీరాముడు తామరల వంటి నేత్రాలను కలవాడు, ప్రాణులందరి మనస్సులను దోచేవాడు) అని అన్నాడు. సర్వసత్త్వ మనోహరుడు, రాముడు అనే సంగతిని హనుమంతుడు ఏ విధంగా తెలిసికొన్నాడు? అనేది గమనించవలసిన విషయం. ఎపుడు ఈ హనుమంతుడు రామచంద్రుని దర్శించాడో, అపుడు వానర వర్గం కంటే అన్యులెవరు అక్కడ లేరు. సుగ్రీవాదుల వలె ఇతడు కూడ వర్షాకాలంలో కిష్కింధలోనే కాలం గడిపాడు. కిష్కింధ నుండి రాముని దగ్గరకు వచ్చి, తరువాత సీతను అన్వేషించడం కోసం బయలుదేరే వరకు రాముని వద్ద ఏ ప్రాణి లేదు. ఈ విధంగా ఉన్నపుడు, **"బహుసత్త్వ మనోహరః"** అని పలుకడానికే ఏమాత్రం అవకాశం లేకపోగా, **"సర్వ సత్త్వ మనోహరః"** అని హనుమంతుడు ఏ విధంగా అన్నాడు? అనే ప్రశ్న ఇక్కడ తప్పక కల్గుతుంది. ఈ విషయంలో ఆచార్య చరణులు ఈ విధంగా సమాధానం పల్కుతారు. నిత్య బ్రహ్మచారి, లౌకిక విషయాల పట్ల విరక్తుడు, సురూప - విరూప జ్ఞాన ప్రసంగాలకు దూరంగా ఉండేవాడు అయిన తన మనస్సునే హరించ గల్గినపుడు, ఇక రామచంద్రుడు ఏ ప్రాణి మనస్సును అయినా హరించ గల్గిన వాడనే విషయం కింపునర్న్యాయ సిద్ధమని హనుమంతుడు భావించాడు. ఇక్కడ గోవింద రాజీయ వ్యాఖ్యానం ఈ విధంగా ఉన్నది. **"తిర్యగ్జాతితయా విటపాత్ విటపం ప్లవతో మమాపి చిత్తాపహారకః, అవిశేషజ్ఞస్యాపి మనోహర ఇత్యర్థః.... తిర్యగ్జాతీయత్వేన శాఖాచంక్రమణ పరస్య వాతాత్మజస్యాపి మనోహరత్వేన సర్వజన మనోహరః"** (తిర్యగ్జాతికి చెందిన వాడైనందున ఒక కొమ్మ నుండి ఇంకొక కొమ్మకు దూకే నా మనస్సును కూడ హరించాడు. విశేషజ్ఞుడు కాని వాని మనస్సును కూడ హరించేవాడని అర్థం. తిర్యగ్జాతీయుడైనందున చెట్టు కొమ్మలలో దుముకుతూ తిరిగే స్వభావం కల

హనుమంతుని మనస్సును కూడ హరించి నందున సర్వజన మనోహరుడని భావం)

**(రూప దాక్షిణ్య సంపన్నః)** దేహగుణాలతో, ఆత్మ గుణాలతో పూర్ణుడు.

**(ప్రసూతో జనకాత్మజే)** ఇక్కడ ప్రసూత పదం అపేక్షితం కాదని కొందఱు భావిస్తారు. అనపేక్షితం కాదు, అపేక్షితమే. ఈ సంపద అంతా ఆగంతుకం కాదు. మరి ఏమంటే, సహజమే ఔత్పిత్తిక మేనని భావం. స్వాభావికాన వధికములైన దివ్య దేహ గుణాలను కలవాడని దీని భావం. వెనువెంటనే **"జనకాత్మజో"** అని చేసిన సంబోధనం కూడ సాభిప్రాయకం. అతనితో సాటి వచ్చే వ్యక్తి ఇంకొకరు ఎవరు లేరు, ఒకవేళ ఉంటే నీవు ఒక్కతెవే అతనితో సాటి వచ్చే దానవు - అని చెప్పడానికి సాధ్యం, ఇక వేటెవ్వరూ లేరు - అని దీని తాత్పర్యం. ఇది అంతా నీకు ఏ విధంగా సహజమో, ఆ విధంగానే అతనికి కూడ ఈ గుణ సంపత్తి అంతా సహజమే - అని చెప్పినట్లయినది.

ఇక, సీతాదేవి శ్రీరామసౌందర్యం పట్ల ఏ విధంగా విద్ధ హృదయ (మిక్కిలి ఆకర్షింపబడినది) అయినదో, ఆ విషయం కొంచెంగా దర్శిద్దాం. అశోకవనంలో దుఃఖించే సీత - **"తం పద్మపలాశాక్షం సింహవి క్రాంత గామినమ్, ధన్యాః పశ్యంతి మే నాథం కృతజ్ఞం ప్రియవాదినమ్"** (తామర రేకుల వంటికన్నుల కలవాడు, సింహం వలె పరాక్రమించే గమనాన్ని కలవాడు, కృతజ్ఞుడు, ప్రియంగా పలికేవాడైన నా నాథుడు అయిన రాముని ధన్యులు దర్శించ గల్గుతున్నారు) అని విహ్వలతను పొందింది. ఇక్కడ గల **"పద్మ "పలాశాక్షమ్"** అనే ప్రయోగం లోని అర్థ విశేషం గమనించ దగినది. **"పద్మదళాక్షః"** అని కాని **"పద్మపత్రాక్షః"** అని కాని ప్రయోగించిన ఇక్కడ సరిపోయి ఉండేది. **"పత్రం పలాశం ఛదనం దళం పర్ణం ఛదః పుమాన్"**

(అమరమ్ 2-59) అనే అమరకోశ వచనానుసారం దళ, పత్ర శబ్దాలు పర్యాయాలు కనుక సమానార్థకములు. ఈ రెండు శబ్దాలు కలిపి ఒకేచోట ప్రయోగించడం ఏ ఉద్దేశ్యంతో? అని కొందఱు సందేహించ వచ్చు. ఇక్కడ రస్యమైన రహస్యం ఇది. **"అక్షమింద్రియకాయయోః"** అనే కోశవచనానుసారం అక్ష శబ్దం నేత్రాన్ని వలె విగ్రహాన్ని (దేహాన్ని) కూడ తెల్పుతుంది. **"ఏకయోక్త్యా పుష్పవంతౌ"** అనే రీతిలో ఇక్కడ ఉండే అక్ష శబ్దం నేత్రాన్ని కాయాన్ని రెండింటిని తెల్పుతుంది. అందువల్ల పద్మదళ సదృశనేత్రుడు, పద్మపత్ర సదృశ కాయుడని (తామర రేకుతో పోలిన నేత్రాలను కలవాడు, తామర ఆకుల రంగువంటి వర్ణాన్ని కల దేహాన్ని కలవాడు అని) ఒక్కమారు చెప్పినట్లయినది. కమలంలో ఉండే దళాలు అవి ఇక్కడ దళశబ్ద వివక్షితాలు. నీటిలో ఉండే తామర పత్రాలు పచ్చగా ఉంటాయి. అవి ఇక్కడ వివక్షితాలు. తిరువాయ్‌మొళిప్రబంధంలో నమ్మాళ్వార్లు **"శెక్కమలత్తలర్ పోలుమ్ కణ్‌కై వాల్ శెజ్ఞనివాయ్ అక్కమలత్తిలై పోలుమ్, తిరుమేని యడికళుక్కే"** (స్వామి నేత్రాలు, హస్తాలు, పాదాలు ఎఱ్ఱని తామర పూవు వంటివి, ఆ కమలం యొక్క పత్రాల వంటిది, ఆ స్వామి తిరుమేని) అని వచించారు. ఈ దివ్య సూరి సూక్తిలో తెలుపబడిన పద్మదళాయతే క్షణత్వం, పద్మపలాశోపమ దివ్యమంగళ విగ్రహ వైలక్షణ్యం అనేది పూర్వం ప్రస్తావించిన సీతావచనాన్ని అనుసరించి వివరింపబడ్డాయి అనేది సత్యం. ఈ విధంగా శ్రీరామ సౌందర్యాను ప్రవణులైన కొందఱు వ్యక్తులు ఇంకా ఉన్నారు. ఈ విషయం ఇంతటితో ముగింపబడుతున్నది.

## శ్రీరామచంద్రుని ధార్మికత్వగుణానుభవం

ఇక, శ్రీరామచంద్రుని ధార్మికత్వాన్ని గూర్చి వివరిస్తాము. శ్రీరామాయణంలో **"రామో విగ్రహవాన్ ధర్మః"** (రాముడు మూర్తీభవించిన ధర్మం) అని, **"విదితః సహి ధర్మజ్ఞః"** (సుందర-21-20) (ఆ రాముడు ధర్మజ్ఞుడు ప్రసిద్ధుడు కద), అని, **"ధార్మికం రామమంతరా"** (ధార్మికుడైన రాముని తప్ప) అని, **"ధర్మాత్మా సత్య సంధశ్చ"** (యుద్ధ-90-69) (ధర్మాత్ముడు, సత్య ప్రతిజ్ఞ కలవాడు) అని, **"జితేంద్రి యశ్చోత్తమ ధార్మికశ్చ"** (కిష్కింధ-24-31) (జితేంద్రియుడు, ఉత్తముడైన ధార్మికుడు) అని గల పలుచోట్ల ధర్మరూపిగా, ధర్మజ్ఞుడుగా, ధర్మాత్ముడుగా, ధార్మికుడుగా, ఉత్తమ ధార్మికుడుగా శ్రీరామ చంద్రుడు కీర్తింపబడ్డాడు. **"రామో విగ్రహవాన్ ధర్మః"** (అరణ్య-37-13) (రాముడు మూర్తీభవించిన ధర్మం) అనేది మారీచ వచనం. **"విదిత స్స హి ధర్మజ్ఞః"** అనేది సీతావచనం. **"దాన యజ్ఞ వివాహేషు సమాజేషు మహత్సు చ, న ద్రక్ష్యామః పునర్జాతు ధార్మికం రామమంతరా"** (కిష్కింధ-24-31) అనేది అయోధ్యా పురజనుల వచనం. **"త్వమప్రమేయశ్చ ఉత్తమ ధార్మికశ్చ"** అనేది తారావచనం. **"అస్యా దేవ్యా మనస్తస్మిన్ తస్య చాస్యాం ప్రతిష్ఠితమ్, తేనేయం స చ ధర్మాత్మా ముహూర్త మపి జీవతి"** (సుందర-15-52) (ఈ సీతాదేవి మనస్సు అతనిలో, ఆ శ్రీరాముని మనస్సు ఈమెలో నిలచి ఉన్నాయి. అందువల్లనే ఆ ధర్మాత్ముడు ముహూర్తమైనా జీవించగల్గుతున్నాడు) అనేది మారుతి వచనం. విభీషణ భరత లక్ష్మణ మారుతి ప్రభుతులు కూడ పలువురు శ్రీరామాయణంలో శ్రీరాముని ధర్మాత్మునిగా కీర్తించారనే విషయం ఉండనివ్వండి. ఈ వ్యపదేశాలన్నిటిలో మారీచుడు పల్కిన మాట చాల గొప్పది. **దశవతార స్తోత్రంలో** శ్రీదేశికులు రామావతారాన్ని కీర్తిస్తూ మారీచ వచనాన్నే ప్రధానంగా

గ్రహించి, **"ధర్మో విగ్రహవాన్ అధర్మ విరతిం ధన్వీ స తన్వీత నః"** (మూర్తీభవించిన ధర్మ స్వరూపుడైన కోదండ ధారి అయిన రాముడు మనకు అధర్మంలో ఉండే ఆసక్తిని పోగొట్టాలి) అని స్తుతించాడు.

అయితే, ధర్మ శబ్దార్థంగా వివక్షితమైన విషయమేమి? అనేది ముందుగా విచారించాలి. పూర్వం ప్రస్తావించిన దేశిక సూక్తిలో **"ధర్మో విగ్రహవాన్"** అనే దానికి ముందు **"సర్వావస్థ సకృత్ ప్రపన్న జనతా సంరక్షణైక వ్రతీ"** (ఏ అవస్థలో అయినా ఒకసారి ప్రపత్తి చేసిన వానిని సంరక్షించడమనే అద్వితీయమైన వ్రతాన్ని చేపట్టిన వాడు) అని పల్కినందున ప్రపన్న జనతా సంరక్షణమే ప్రకృతంలో ధర్మమని వ్యక్తమవు తున్నది. **"విదిత స్స హి ధర్మజ్ఞః"** అని పలికే వైదేహి కూడ వెనువెంటనే **"శరణాగత వత్సలః"** అని పల్కినందున ఆ ధర్మం శరణాగత వాత్సల్య మూలకమని తెలియబడుతున్నది. సుందర కాండలో **"ఆనృశంస్యం పరో ధర్మః త్వత్త ఏవ మయా శ్రుతః"** (సుందర 38-39) (దయ అనేది గొప్ప ధర్మం. దీనిని నీ వల్లనే విన్నాను) అనే సీతా వచనం ద్వారా ఉత్తమమైన ధర్మ శబ్దార్థ నిష్కర్ష వ్యక్తమవుతున్నది. సీతను ఉద్దేశించి శ్రీరాముడే స్వయంగా ధర్మ శబార్థాన్ని గూర్చి పలికాడని పై సూక్తి వల్ల తెలుస్తున్నది. గోవిందరాజార్యులు ప్రకృతంలో ఈ విధంగా వ్యాఖ్యానించారు. **"సంశ్లేష దశాయాం తవాత్యంతాభిమతో ధర్మః కః? ఇతి మయా పృష్టే, పరదుఃఖాసహిష్ణుత్వమేవ పరమో ధర్మ ఇతి మమాభిమతమ్, తదైవ మత్స్వభూః ఇతి త్వయా రహస్యోద్ఘాటనం కృతమ్ త్వత్త ఏవ మయా శ్రుతః న తు దూతముఖేన"** (సంశ్లేష దశలో ఇద్దఱమూ ఏకాంతంలో ఉండేటపుడు నేను "నీకు మిక్కిలి ఇష్టమైన ధర్మమేది? అని ప్రశ్నించగా, "ఇతరుల దుఃఖాన్ని చూచి సహించలేక పోవడమనే దయయే గొప్ప ధర్మమని నా అభిప్రాయం; నా స్వభావం కూడ అటువంటిదే **(త్వత్త**

**ఏవ మయా శ్రుతః)** నీ వల్లనే విన్నాను. దూత ద్వారా కాదు) అనేది గోవిందరాజీయం వ్యాఖ్య. వాస్తవానికి *ఆనృశంస్య* శబ్దార్థం అయితే ఇదే కద!

ఆనృశంస్యం, కృప, దయ, కరుణ, కారుణ్యం, ఘృణ, అనుక్రోశ, అనుకంప - మొదలైనవి అన్నీ పరస్పర పర్యాయ శబ్దాలు. **"దయా హి నామ స్వార్థ నిరపేక్షా పర దుఃఖా సహిష్ణుతా"** (దయ అంటే - స్వార్థం లేని, ఇతరుల దుఃఖాన్ని చూచి ఓర్వలేని స్వభావం) అని భగవద్భాష్యకార నిర్వచనం. **"దయాన్యేషాం దుఃఖాప్రసహనమ్"** (ఇతరుల దుఃఖాన్ని సహించలేని స్వభావం దయ) అని పరాశర భట్టర్ అన్నారు. పరుదుఃఖాసహిష్ణుత్వమనేది పరదుఃఖదుఃఖిత్వం కంటే - వేరు కాదు. "దేవదత్తుడు దుఃఖాన్ని సహించలేక పోయాడు'' అంటే ఏమి అర్థం? మిక్కిలి దుఃఖాన్ని పొందిన వాడయ్యాడని కదా అర్థం. భగవంతునకు పరదుఃఖదుఃఖిత్వమనేది పొసగదని (ఇతరుల దుఃఖాన్ని చూచి దుఃఖించే స్వభావం పొసగదని) భావించే వారు కొందఱు పరదుఃఖనిరాచికీర్ష (పరుల దుఃఖాన్ని తీర్చాలనే ఇచ్ఛ) దయ అని చెప్పాలని అంటారు. భగవంతునకు పరదుఃఖనిరాచికీర్ష ఉన్నదని అనడంలో ఎవరికీ విప్రతిపత్తి లేదు. రాత్రింబగళ్ళు భక్తుల నానా దుఃఖాలను తీర్చడంలోనే భగవంతుడు బద్ధ దీక్షను కలవాడై వెల్లుతున్నాడు. అతనికిగల ఈ పరదుఃఖనిరాచికీర్షను ఆక్షేపించగల్గినవాడు కాని, లేదని అనగల్గినవాడు కాని ఎవడూ లేడు. అయితే అది భగవంతునకు గల ఒక ప్రత్యేకమైన గుణం. అది ద్వయా స్వరూపం కాదని తెలియాలి. అయినా, దయా స్వభావుడైన పురుషుడు శక్తిని కలవాడైతే, అపుడతడు పరదుఃఖ నివారణంలో ఆసక్తిని, ప్రయత్నాన్ని పొందుతాడు. అతడే, ఒకవేళ, శక్తిరహితుడైతే పరదుఃఖాన్ని తీర్చడంలో ప్రయత్నించ లేనివాడై "అయ్యో! అయ్యో! ఈ విధంగా మనకు కావలసినవాడు దుఃఖాన్ని పొందాడే! ధిక్! కష్టం'' అని చాల బాధపడుతూ, స్వయంగా

విషాదానుభవాన్ని పొందడంలో విశ్రాంతుడవుతాడు. ఇపుడు చేసే చర్చ సామాన్య పురుషునకు ఉండే దయను గూర్చి కాదు. అప్రమేయ శక్తి యుక్తుడైన పరమాత్మ విషయంలోనిది. అతడు తన అచింత్యమైన, అద్భుతమైన, దివ్యమైన శక్తితో పరదుఃఖాన్ని తీర్చడంలో సమర్థుడై, స్వయంగా విషాదాన్ని పొందే అవకాశాన్ని, అవసరాన్ని ఏ మాత్రం పొందడు. అందువల్ల పరదుఃఖ దుఃఖిత్వానికి ప్రసక్తి ఏక్కడ? కనుక, మిగిలిన అందఱి వ్యక్తులలో అవకాశాన్ని పొందగల్గిన పరదుఃఖ దుఃఖిత్వం అనేది, గొప్ప శక్తిని కల, ప్రణతార్తి హరుడైన భగవంతునిలో ప్రసంగ మాత్రంగా కూడ ఉండే అవకాశం లేదు - అని ఇతరులు తలుస్తారు.

ఇక్కడ కొందఱు ఈ విధంగా అనవచ్చు. భగవంతుడు సర్వజ్ఞుడు, సర్వశక్తి అయినా అజ్ఞతను, అశక్తతను అభినయిస్తూ అవతరిస్తాడు. అపుడు వాస్తవానికి అశక్తుల వలె అతనికి కూడ విషణ్ణత కల్గడం యుక్తమే - అని కాని. సమాధానం ప్రధానమైనది కాబోదు. శాస్త్రతాత్పర్యం కూడ ఇది కాదు. మన ఆచార్య సార్వభౌములు ఈ విధంగా తెల్పుతారు. సర్వశక్తి యుక్తుడు, ఇతరుల దుఃఖాన్ని తీర్చేవాడైన భగవానునకు కూడ నిజంగా అపరిహార్యమైన దుఃఖం ఒకటి ఉన్నది. దుఃఖమనేది రెండు విధాలు - అతీతం, అనాగతమని. వర్తమాన దుఃఖాన్ని కూడ చేర్చి మూడు విధాలుగ కూడ కావచ్చు. ఆ భగవంతుడు భక్తుల వర్తమానం, ఆగామి దుఃఖాలను పోగొట్టుగలవాడైనా, అతీత దుఃఖాన్ని గూర్చి పశ్చాత్తాపం పడడం తప్ప వేఱు ఏమీ చేయలేడు. చైతన్యం ఉన్న చోట అంతా ఈ అనుశయమనేది తప్పక అవకాశాన్ని పొందినది కాగలదు (తప్పక ఉంటుంది). మొసలిచే పట్టుకొనబడ్డ గజేంద్రుని రక్షణ కథ ప్రసిద్ధం కద! గజరాజు చేసిన గొప్ప ఆర్తనాదాన్ని విని మిక్కిలి వేగంగా భగవంతుడు సరస్తీరానికి వచ్చాడనేది ప్రసిద్ధం. గజేంద్రుని రక్షించడం కోసం రావడమనే ఇది కూడ ఒక అవతార విశేషమే కద! తన శక్తిని కప్పి పుచ్చుకోవడం కాని,

అశక్తి భావన కాని ఈ అవతారంలో లేదు. యథావస్థితమైన శక్తితో గజేంద్రుని ఆర్తిని అనంతర క్షణంలోనే తొలగించాడనేది వ్యక్తం. అయినా, గజేంద్రుని ఆర్తనాదాన్ని విన్న దగ్గర నుండి అటువంటి ఆర్తిని పరిహరించే క్షణం వరకు భగంతుడు అనుభవించిన దుఃఖం ఎవరికీ పల్కడానికి సాధ్యం కానిది. అపుడు ఆ సమయంలో ఆ భగవంతుని దర్శించే భాగ్యాన్ని మనం పొందలేకపోయాము. యోగం ద్వారా దానిని దర్శించిన అదృష్టవంతులు పల్కిన మాటనే కద మనం తెలిసికొంటున్నాము. **"స్రగ్భూషాంబర మయథా యథం దధానో ధిక్! మా మిత్యను గజగర్జమాజ గంధ"** (శ్రీరంగ రాజస్తవం-ఉత్తర శకతకము-59) (పూమాలికలను, ఆభరణాలను, వస్త్రాలను యథావిధిగా ధరించనవాడై, ఛీ! ఏమి నా రక్షణ! అని బాధ పడుతూ గజరాజు చేసిన గర్జన విని వచ్చాడు) అని కద పరాశర భట్టారకులన్నారు. "అయ్యో! అయ్యో! ఈ విధంగా కద, నా పరమ భక్తుని మొసలి పట్టుకొనేటట్లుగా విడిచాను. ధిక్! నా సర్వేశ్వరత్వం! ధిక్! నా భక్త రక్షణ పరాయణత్వం! ధిక్! నా జీవితం! అని హెచ్చు తగ్గులుగా పల్కుతూ ఆక్రందిస్తూ కద వైకుంఠ నాథుడు వచ్చాడని తత్త్వదర్శులు పలికారు. గజరాజు దుఃఖాన్ని తీర్చడంలో భగవంతుడు మిక్కిలి సమర్థుడే. దానిని వెంటనే పోగొట్టాడు కూడ. అందులో ఏవిధమైన వైకల్యం లేదు కద! అయినా తన భక్తవరుడు చాల కాలంగా ఆర్తుడై ఉన్నాడే! అయ్యో! అనే ఆర్తి భగవంతునకు అవర్జనీయ మైనది కద! భగవంతుడు పరమ చేతనుడు కద! ఎవరికైనా చైతన్య ప్రయుక్తమైన కార్యమనివార్యం కద! చంటిబిడ్డ బావిలో పడ్డాడని తెలిసిన తల్లి ప్రలపిస్తూ విలపిస్తూ మహావేగంగా పరుగు తీస్తూ వస్తుంది. అదృష్టవశం చేత పైకి తీయబడ్డా, శిశువు బతికి బయటపడినా, తరువాత అతడు నవ్వు ముఖంతో ఆడుకొంటూ ఉన్నా, తల్లి దుఃఖం వెనువెంటనే తీరిపోదు. ఏ విధంగా తీరుతుంది! నిజంగా, పలు ఘడియల కాలం పాటుగాని, మూడునాల్గు దినాల పాటుగాని ఆమె దుఃఖం అనువర్తిస్తుంది. ఆమె ఏడుపు త్వరగా నిలువదు.

కన్నీళ్ళు చాలాసేపు స్రవిస్తాయి. దీనికి గల కారణాన్ని గూర్చి ఎవరిని అడగాలి? ఎవరు బదులిస్తారు? ఆత్మ ధర్మమనేది నాశాన్ని పొందదు కద! గజేంద్రుని శోకం తీరినా, భగవంతుని బాధ మాత్రం వెంటనే తీరలేదు. ఏ విధంగా తీరుతుంది! భగవద్గుణాలను ఆర్ద్ర హృదయంతో, ఆర్జవంతో అనుభవించడమనేది తక్కువ తపస్సు వల్ల కలుగదు. అది గొప్ప తపస్సు వల్ల కలిగే ఫలం. అటువంటి తపస్సును కలవారమై మనం అనుభవించి ఆనందిద్దాం. భగవంతుడైన వాసుదేవుడైన నంద నందనుడు అవతార సమాప్తిని చేసి తన దివ్యధామాన్ని చేరేటపుడు విషణ్ణమైన మనస్సుతోనే వెళ్ళాడని మహర్షి పలికాడు. **"నాతిస్వస్థ మనా యయౌ"** (మిక్కిలి స్వస్థత లేని మనస్సుతో వెళ్ళాడు) అనే మహర్షి వచనం ప్రసిద్ధం. ద్రౌపది నిండు సభలో పొందిన గొప్ప అవమానాన్ని తీర్చి, దుర్యోధనాది దుర్వర్గాన్ని సంహరించి, ధర్మరాజు తలపై కిరీటాన్ని పెట్టి - ఈ విధంగా పలు చేసినా, **"గోవిందేతి కృష్ణా మాం దూరవా సినమ్, ఋణం ప్రవృద్ధ మివమే హృదయాన్నాప సర్పతి"** (భారతమ్ ఉద్యోగ -58-21) (గోవిందా! అని అంటూ ద్రౌపది దూరంలో ఉండే నన్ను ఉద్దేశించి చేసిన ఆక్రందన, వడ్డీతో పెరిగిన ఋణం వలె, నా హృదయం నుండి తొలగి పోవడం లేదు) అని తన నిర్వేదాన్ని ప్రకటిస్తూ తన స్థానానికి వెళ్ళేటపుడు నిర్విణ్ణుడై వెళ్ళాడని మహర్షులు పలికారు. దీనికి రాళ్ళు కూడ కరుగుతాయి. ఆర్ద్రమైన మనస్సు కలవారు రాత్రింబగళ్ళు అనుభవించవలసిన గుణం ఇది. అయ్యో! కొందరు అనుభవించలేమన్నారు. ఈ గుణాన్ని వారు కాదంటున్నారు.

మనం సతతం అనుభవించ దగిన భగవద్గుణాలలో దయయే పట్టాభిషేకాన్ని పొందుతున్నది. శ్రీరామాయణంలో శ్రీరామచంద్ర భగవానుని పరదుఃఖదుఃఖిత్వ రూపమైన కారుణికత్వం పలుచోట్ల కన్పిస్తుంది. దీనిని కొంచెం ప్రదర్శిస్తాము. ముందుగా, కారుణ్య శబ్దార్థమేమి? అనే విషయాన్ని

శ్రీరామాయణం ద్వారానే నిరూపిస్తాము.

బాలకాండలోని రెండవ సర్గలో, వాల్మీకి మునిచే సాదరంగా పూజింపబడిన నారదుడు బ్రహ్మలోకానికి తిరిగి వెళ్ళి పోయాడు. తరువాత తన శిష్యుడు భరద్వాజునితో పాటు స్నానార్థం తమసానదీ తీరానికి వెళ్ళిన వాల్మీకి అక్కడ రెండు క్రౌంచ పక్షులను దర్శించడం, వ్యాధుడు ఆ మిథునంలో మగపక్షిని వధించడం, మొదలైనవి చెప్పబడ్డాయి. ఆ సర్గలో పదమూడవ శ్లోకం ఇది. **"తథా తు తం ద్విజం దృష్ట్వా నిషాదేన నిపాతితమ్, ఋషేః ధర్మాత్మనస్తస్య కారుణ్యం సమపద్యత"** (బాల 2-13) (వ్యాధుడు పడగొట్టిన ఆ పక్షిని చూచిన ధర్మాత్ముడైన ఈ ఋషికి కరుణ కల్గింది) ఇక్కడ ఋషికి కల్గినట్లుగా చెప్పబడిన కారుణ్యం అంటే ఏమి? అని వివేచించాలి. దుఃఖం కంటే వేరొకటి ఏమీ అక్కడ మునికి కలుగలేదనేది అందఱు అంగీకరించే విషయం. కరుణ పొందిన ఆ మునికి ప్రయోగింపబడ్డ ధర్మాత్ముడనే ఒక విశేషణాన్ని కూడ గమనించాలి. దీనివల్ల ధర్మాత్ముని స్వభావం కారుణ్య సంపన్నత - కరుణను కల్గి ఉండడం - అని కద వ్యక్తమవుతున్నది. ఈ కారుణ్యాన్నే శ్రీరామచంద్రుడు పలుచోట్ల ప్రదర్శించాడు.

కొంచెం వినండి. శ్రీరాముడు, సుగ్రీవుని ప్రార్థనలు అనుసరించి వాలిని వధించాడు. వాలి చనిపోగా, సుగ్రీవుడు ప్రలపించాడు, విలపించాడు. అపుడు రాముని దశను గూర్చి పల్కుతూ వాల్మీకి - **"ఇత్యేవ మార్తస్య రఘు ప్రవీరః శ్రుత్వా వచో వాల్యనుజస్య తస్య, సంజాత బాష్పః పరవీరహంతా రామో ముహూర్తం విమనా బభూవ"** (కిష్కింధా-24-24) (ఈ విధంగా ఆర్తుడైన సుగ్రీవుని మాటలను విన్న శ్రీరామునకు దుఃఖాశ్రువులు కలిగాయి. శత్రువులను సంహరించే రాముడు ఒక్క క్షణకాలం పాటు శూన్యమనస్కుడయ్యాడు) అని అన్నాడు. ఈ శ్లోకంలో **"సంజాత బాష్పః,**

**ముహూర్తం విమనాబభూవ"** అని పల్కిన రెండు సూక్తులు, రాళ్ళను కూడ కరిగించగలవు. సుగ్రీవుని విలాపం ఉపశమించినా, రాఘవుని విలాపం తగ్గ లేదని కదా స్ఫుటమవు తున్నది. **"సంజాత బాష్పః"** అని అన్నందున ఆనంద బాష్ప సంపత్తి కల్గిందని భావిస్తారో! ఏమో! అని, **(విమనా బభూవ)** అని అన్నాడు. *వికృతం మనో యస్యస విమనాః* (బాధపడిన మనస్సును కలవాడు) అని అర్థం. మనస్సు లోపల శోకం లేకపోయినా, కొందరు బయటికి కన్నీళ్ళు విడుస్తారు. అటువంటి వాడు కాడు, రాముడు. రాముడు శిథిలమైన మనస్సును కలవాడయ్యాడని కద చెప్పబడింది.

తరువాత, ఆ కిష్కింధాకాండ 25 సర్గలోని ఆరంభంలో ఉండే శ్లోకం - **"సుగ్రీవం చైవ తారాం చ సాంగదం సహ లక్ష్మణః, సమాన శోకః కాకుత్థ్సః సాంత్వయన్నిద మబ్రవీత్"** (కిష్కింధ-25-1) (సమాన శోకాన్ని కలవాడు, లక్ష్మణునితో కూడిన వాడైన రాముడు అపుడు సుగ్రీవుని, తారను, అంగదుని ఓదారుస్తూ ఈ మాటను పలికాడు) అనేది. వారి శోకం వల్ల తారకు - అంగదునకు ఎంత శోకం కల్గిందో, అంతటి శోకం ఆహా!, రామునకు కూడ కల్గిందని మహర్షి అన్నాడు.

ఆ సర్గ చివరలో కూడ **"సుగ్రీవేణైవ దీనేన దీనో భూత్వా మహాబలః, సమాన శోకః కాకుత్థ్సః ప్రేత కార్యమకారయత్"** (కిష్కింధ 25-53) (దీనుడైన సుగ్రీవుని వల్ల మహాబలుడైన రాముడు కూడ దీనుడై, అతనితో సమానమైన శోకాన్ని కలవాడై, ప్రేత కృత్యాలను అతనిచే నిర్వహింప జేశాడు) అని అంటూ శ్రీరాముని సమాన శోకత్వాన్ని మహర్షి పునరుద్ఘాటించాడు. శుభగుణాలలో గణనీయమైనది కద, ఈ శ్లోకం.

ఇక, శోకాన్ని శుభగుణాలలో ఒకటిగా లెక్కించడం ఏ విధంగా? అని కొందరు వాదిస్తారు. వీరు శ్రీరామాయణంతో పరిచయంలేని వారు. వారిని

అంగీకరింపజేస్తాము. శ్రీరామాయణంలో దశరథ చక్రవర్తి మనస్సులో శ్రీరామచంద్రునకు యౌవరాజ్య పట్టాభిషేకాన్ని జరుపాలనే కోరిక ఎపుడు కల్గిందో, అపుడు అతడు పెద్ద సభను ఏర్పాటు చేశాడు. ఆ సభలో పలువురు రాజులు, మహర్షులు, పురజనులందరు ఉన్నారు. ఈ సభలో ప్రభువు ఈ విధంగా పలికాడు. **"ఇదం శరీరం కృత్స్నస్య లోకస్య చరితాహితమ్, పాండరస్యాత పత్రస్య చ్ఛాయాయాం జరితం మయా, ప్రాప్య వర్ష సహస్రాణి బహూన్యాయూంషి జీవతః జీర్ణస్యాస్య శరీరస్య విశ్రాంతి మభిరోచయే"** (అయోధ్యా-2-7,8) (నేను సమస్తలోక హితం కోసం ఈ శరీరాన్ని తెల్లని శ్వేతచ్ఛత్రం నీడలో వినియోగించి, ముసలివాడనయ్యాను. పలు సంవత్సరాల కాలం దీర్ఘమైన జీవితాన్ని గడిపిన నేను ఈ జీర్ణ శరీరానికి విశ్రాంతి కలగాలని కోరుకొంటున్నాను) అని, **"సోహం విశ్రమమిచ్ఛామి పుత్రం కృత్వా ప్రజాహితే, సన్నికృష్టానిమాన్ సర్వానను మాన్య ద్విజర్షభాన్"** (అయోధ్యా 2-10) (అటువంటి నేను, ఇక్కడ వేంచేసి ఉండే ఈ గొప్ప బ్రాహ్మణులను అందరిని అనుమతింప జేసి, నా పుత్రుని ప్రజాహితం కోసం నియుక్తుని చేసి - యువరాజుగా చేసి - విశ్రాంతిని పొంద గోరుతున్నాను) అని, **''యదీదం మేనురూపార్థం మయా సాధు సుమంత్రితమ్, భవంతో మేనుమన్యంతాం కథం వా కరవాణ్యహమ్"** (అయోధ్యా-2-15) (ఇది నాకు తగినది అయితే, నేను చక్కగా ఆలోచిస్తే, మీరు దీనిని అంగీకరించండి. నేను ఏ విధంగా చేయాలో తెలుపండి). ఈ విధంగా పల్కడం ద్వారా దశరథ చక్రవర్తి శ్రీరామయౌవరాజ్య పట్టాభిషేక విషయంలో తనకు గల అత్యుత్కటమైన ఉత్కంఠను వ్యక్తం చేశాడు. తరువాత ఏం జరిగింది?

**''అనేక వర్షసాహస్రో వృద్ధ స్త్వమసి పార్థివ స రామం**

**యువరాజాన మభిషించస్వ పార్థివమ్"** (అయోధ్య 2-21) (రాజా! పలువేల వర్షాల వయస్సును కల నీవు వృద్ధుడవై ఉన్నావు. ఆ రాముని యువరాజుగా పట్టాభిషేకం చేయి) అని జనులు చేసిన ఉద్ఘోషం విమానాన్ని (రాజ భవనాన్ని) కంపించేటట్లుగా పైకి ఎగసింది. రాజా! నీవు వృద్ధుడవైనావు. ఇక చాలు చాలు, తొలగిపో వెంటనే, శీఘ్రంగా రాముని యువరాజుగా చేయాలి) అని ముక్తకంఠంగా జనులందరు బిగ్గరగా పలికారు. దీని వల్ల ప్రభువు మనస్సులో గొప్ప సంతోషం కల్గిన మాట వాస్తవమే. ఎందుకంటే, తన మనోరథాన్ని జనులందఱు ఏక కంఠంగా అభినందించారు కద! అయినా, ప్రజల హార్దమైన భావాన్ని తెలిసికోవాలనే ఉద్దేశ్యంతో తిరిగి ఈ విధంగా ప్రశ్నించాడు. **"కథం ను మయి ధర్మేణ పృథివీమనుశాసతి, భవంతో ద్రష్టుమిచ్ఛంతి యువరాజం మమాత్మజమ్"** (అయోధ్యా-2-25) (నేను ధర్మంగా భూమిని పాలిస్తూ ఉన్నా, ఎందువల్ల మీరు నా కుమారుని యువరాజుగా చూడగోరు తున్నారు?) అని అడిగాడు. ఈ ప్రశ్న సహజమే, తన మనోరథాన్ని ఆవిష్కరించిన చక్రవర్తికి ప్రజలు సవినయంగా, సాదరంగా, గౌరవంగా బదులు పలికి ఉండాలి. "ప్రభూ! సార్వభౌమా! మహారాజా! ఇంకాకొన్ని సంవత్సరాలు నీవే రాజ్యాన్ని పాలించు. ఇపుడెందుకు తొందర? ఒకవేళ, ఇపుడే నీవు విశ్రాంతిని పొందగోరితే, అపుడు నీవు కోరినట్లుగా ఆచరించవచ్చు. అల్పులమైన మా అభిప్రాయాన్ని తెలిసికోవలసిన ఆవశ్యకత నీకున్నదా? స్వతంత్రుడవైన నీవు నీవు కోరినట్లుగా నీ బుద్ధితో కార్యాన్ని నిర్వర్తించడంలో అడ్డు ఏమి? ఎవడు అడ్డుపెట్ట గలడు?'' అని కద పలికి ఉండాలి నిజంగా. ఇటువంటి మర్యాద కద ప్రజలకు ప్రభువుపట్ల ఉండ దగినది. ఈ పద్ధతిని విడచి, ప్రజలు **"అనేక వర్ష సాహస్రో వృద్ధ స్త్వమసి పార్థివ, అపసరతా దపసరతాత్"** (రాజా! ఎన్నో ఏళ్ళ వయస్సును కల వృద్ధుడవు నీవు తొలగిపో, తొలగిపో) అని అనడం పూర్తిగా అయుక్తం కద! ఈ విధంగా పల్కడం వల్ల చక్రవర్తి చిరకాలం చేసిన

రాజ్యపాలనం ప్రజలకు అధర్మంగా తోచిందని, దాని పట్ల వారికి అరుచి ఉన్నదని వ్యక్తమవుతున్నది. అందువల్లనే చక్రవర్తి **"కథం ను మయి ధర్మేణ వృథివీమనుశాసతి, భవంతో ద్రష్టుమిచ్ఛంతి యువరాజం మమాత్మజమ్"** అని అడిగాడు. అపుడు పౌరులు ఏమని బదులిచ్చారు?

**"బహవో నృప! కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే, గుణాన్ గుణవతో దేవ! దేవ కల్పస్య ధీమతః, ప్రియానా నందనాన్ కృత్స్నాన్ ప్రవక్ష్యామోద్య తాన్ శ్రుణు"** (అయోధ్య-2-26, 27) (రాజా! నీ పుత్రునకు ఎన్నో శుభ గుణాలున్నాయి. దేవా! గుణవంతుడు, దేవునితో సమానుడు, ధీమంతుడైన రాముని గుణాలు ప్రియమైనవి, ఆనందింపజేసేవి. వానిని అన్నిటిని గూర్చి పల్కుతాం, విను) అని ఆరంభించి సుమారు ఇరవై అయిదు శ్లోకాలతో సీతాపతి కల్యాణ గుణ సముహాల వర్ణనను చేశారు. "రాజా! నీ కంటే అతిశయించిన గుణగణ సమృద్ధిని కల రాముని పాలనలో జీవించాలనే ఆశతో మేము ఈ విధంగా పలికామని దీని వల్ల తెలిపినట్లయినది. ఇక్కడ **"బహవో నృప! కల్యాణ గుణాః పుత్రస్య సంతి తే"** (రాజా! నీ కుమారునకు ఎన్నో కల్యాణ గుణాలున్నాయి) అనే ప్రతిజ్ఞకు అనుగుణంగా కల్యాణ గుణాలను గూర్చి పలికే పౌరులు మధ్యలో **"వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః"** (అయోధ్యా 2-40) (మానవుల దుఃఖాలలో వారి కంటె మిక్కిలిగా దుఃఖాన్ని పొందినవాడవుతున్నాడు.) అని కద అన్నారు. ఇతరుల దుఃఖాలలో మిక్కిలి దుఃఖితుడు కావడం హేయ గుణం కాదు. కల్యాణ గుణమే - అని కద దీనివల్ల స్పష్టంగా ప్రకాశింపజేయబడినట్లయింది. **"వ్యసనేషు మనుష్యాణామ్"** ఇత్యాది ఈ పద్యానికి పూర్వాచార్య వ్యాఖ్యానం లోని స్వారస్యం సహృదయులకు అనుభావ్యం. పెరియ వాచ్చాన్‌పిళ్ళై అనే ఆచార్యవర్యులు ద్రావిడ భాషలో అనుగ్రహించిన దానిని గోవిందరాజార్యులు

గీర్వాణ వాణితో అనువదించారు; తమ వ్యాఖ్యలో. ఆ వ్యాఖ్యానం ఏమంటే - **"సత్పురుష సంభావిత గుణానభిధాయ, రామస్య అసాధారణ గుణానాహ - వ్యసనేష్వితి. (మనుష్యాణామ్) - దివ్యాంతః పురస్థితానాం న; కింతు మనుష్యాణామ్. ఆఢ్య దరిద్ర ద్విజాతి తారతమ్యానాదరేణ మనుష్య జాత్యా క్రాంతానామ్. (వ్యసనేషు) అల్పానల్ప విచారమంతరేణ వ్యసన పదార్థేషు. (భృశం భవతి దుఃఖితః) - వ్యసనవతో యాదృశం తాదృశం న, కింతు పంకమగ్నగజ ఇవ స్వమాహాత్మ్యానుగుణం యావత్ సత్తాకం చ దుఃఖితో భవతి. న తావద్దిన క్రమేణ విస్మరతి. ప్రజానామిదం దుఃఖం మత్పరి పాలన వైగుణ్యేన ఖల్వాగతమితి నితరాం దుఃఖితో భవతి"** (సత్పురుషులలో సంభావితాలైన గుణాలను ప్రస్తావించి, రాముని అసాధారణ గుణాన్ని గూర్చి పల్కుతున్నాడు. **(వ్యసనేషు)** - అని అంటూ. **(మనుష్యాణామ్)** దివ్యాంతఃపురంలో ఉండే వారి వ్యసనాలలో కాదు. సామాన్య మానవుల కష్టాలలో. ధనికుడు, దరిద్రుడు, బ్రాహ్మణుడు మొదలైన తేడాలు ఏమీ లేకుండా మనుష్యజాతికి చెందిన వారి - అని అర్థం. **(వ్యసనేషు)** - చిన్న పెద్ద - అనే తేడా లేకుండా ఎటువంటి ఆపదలో అయినా - వ్యసనమని చెప్పదగిన వానిలో **(భృశం భవతి దుఃఖితః)** ఆపదలు పొందినవానికి ఎంత దుఃఖం కల్గుతుందో, అంతమాత్రమే కాదు. బురదలో మునిగిన ఏనుగు, తన బలానికి తగిన బాధను పొందేటట్లు, తన మహిమకు అనుగుణంగా, సత్త ఉన్నంత వరకు, మిక్కిలి దుఃఖితుడవుతున్నాడు. దినాలు గడిచే కొద్దీ దుఃఖాన్ని విస్మరించడు. ప్రజల ఈ దుఃఖం నా పరిపాలనలోని దోషం వల్ల కల్గింది కద - అని చాలా బాధపడతాడు.)

ఈ వ్యాఖ్యానం అటు ఉండనివ్వండి. **"హే నృప! తే పుత్రస్య బహవః కల్యాణ గుణా స్సంతి"** (ఓ రాజా! నీ పుత్రునకు పలు కల్యాణ

గుణాలున్నాయి) అనే కల్యాణ గుణ ప్రస్తావన చేసేటపుడు **"మనుష్యాణాం వ్యసనేషు రామో భృశం దుఃఖితో భవతి"** (జనుల కష్టాలలో రాముడు చాల దుఃఖితుడవుతున్నాడు) అని అన్నందున ఈ దుఃఖితత్వం అనేది హేయమనే ప్రస్తావలేశాన్ని అయినా సహించనిది. అఖిల హేయ ప్రత్యనీకుడైన పరమ పురుషునకు దుఃఖితత్వాన్ని అంగీకరిస్తే, అతనికి హేయ ప్రతిభటత్వం లేకుండాపోతుంది, ఆనందమయుడనే శ్రుతి కూడ నిరర్థకమవుతుందని కొందఱు అనే మాట తగినది కాదు. కల్యాణ గుణశాలిత్వానికి పర్యాయం వంటిదైన ఆనందమయత్వంతో కల్యాణ గుణాలలో గొప్పదైన ఈ దుఃఖితత్వం ఎంత మాత్రం విరోధించదు. గమనించండి. ఆనందమయుడనే ఉక్తి తప్పక సాంకాక్షమై ఉంటుంది కద! లోకంలో ఆనందమనేది ఏదో ఒక వస్తువు యొక్క సంబంధంతో కలిగేది. కారణాధీనమని దీని అర్థం. 'అతడు ఆనందిస్తున్నాడు' - అయితే, అతని ఆనందానికి ఏమి కారణమనే ప్రశ్న వెనువెంటనే కల్గుతుంది. దానిని సమాధానించడం కోసం కారణ కలాపాన్ని తెలుపవలసిన ఆశ్యకత తప్పక కల్గుతుంది. హేయమైన వస్తువుల వల్ల కూడ ఆనందాన్ని పొందడం అనేది మనవంటి సంసారులకు కల్గితే కలుగవచ్చుగాక! పరమ పురుషునకు ఆ విధంగా సంభవించదు. కల్యాణ రూపాలైన వస్తువుల వల్లనే అతడు ఆనంద మయుడవుతాడనే ఈ ఆనంద మయత్వోక్తి కల్యాణవత్త్వ కథనంలోకి పర్యవసిస్తుంది. **"స ఏకో మానుష ఆనందః"** (తైత్తి.-2-8) ఇత్యాది ఉపనిషత్తు కూడ హేతూపన్యాసపూర్వకంగానే కద ప్రవర్తించింది. **"యువా స్యాత్ సాధుయువాధ్యా యకః"** (తైత్తి-2-8) ఇత్యాదులు ఆ హేతువులు. హేతువులు హేయాలైతే తత్కార్య రూపమైన ఆనందం కూడ హేయమే కాగలదు. హేతువులు కల్యాణ రూపాలైతే, కల్యాణత్వం సిద్ధిస్తుంది - అనే ఆనందమయత్వోక్తి - కల్యాణ గుణవత్త్వ కథనం పరస్పర పర్యాయ భావాన్ని పొందుతున్నాయని గ్రహించాలి. ప్రకృతంలో **"బహవో నృప కల్యాణగుణాః**

**పుత్రస్య సంతి తే"** (అయోధ్యా-2-26) (రాజా! నీ కుమారునకు పలు శుభ గుణాలున్నాయి) అనే కల్యాణ గుణ పట్టికా విన్యాసంలోని వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః (అయోధ్యా-2-40) అని పఠింపబడినందున, ఈ దుఃఖితత్వానికి కల్యాణత్వం సిద్ధి అవ్యాహతమే - అని తెలుస్తున్నది. అందువల్ల శ్రీరాముని పరమధార్మికత్వం **"ఆనృశంస్యం పరో ధర్మః"** (సుందర-38-39) అనే వచనానుసారంగా చక్కగా ఉపపాదింపబడింది కనుక సర్వం సమంజసం.

**1)శ్రీరామస్య గుణౌఘ దుగ్ధజలధేః భోక్తుం సమస్తాన్ గుణాన్ కః**
**శక్తో భువి? నైవ దివ్యపి, తథా చాష్టౌ గుణాన్ సారశః।**
**ఉద్ధృత్యాన్వభవామ వాక్యశతకేనాస్మిన్ ప్రబంధే వయం**
**విద్వాంసో భగవద్గుణౌఘరసికా హృష్యంతి నిర్మత్సరాః॥**

శ్రీ రాముని కల్యాణ గుణ క్షీర సముద్రంలోని గుణాలను అన్నిటిని అనుభవించగలవాడు ఈ లోకంలో ఎవడున్నాడు? స్వర్గంలో కూడ లేడు. అందువల్ల, వాటిలో ఎనిమిది గుణాలను సారంగా గ్రహించి, ఈ ప్రబంధంలోని నూరు వాక్యాలతో మనం వానిని అనుభవించాము. భగవద్గుణ సమూహ రసికులు, మాత్సర్యం లేనివారైన విద్వాంసులు దీనిని చూచి సంతోషిస్తారు.

**2)శ్రీరామాయణ దుగ్ధ సింధు జఠరే శ్రీరామచంద్ర ప్రభోః**
**దీవ్యంత్యద్భుత దివ్య సద్గుణగణాః నానాకథా విష్కృతాః।**
**తాన్ సర్వానపి చేద్వృశైః సులలితైః వాక్యోత్కరైశ్చారుభిః**
**భోక్తుం భోజయితుం చ తీవ్ర రుచిరస్త్యస్మాక మంతర్హృది॥**

శ్రీరామాయణమనే పాల సముద్ర గర్భంలో శ్రీరామచంద్ర ప్రభువు యొక్క అద్భుతాలైన, దివ్యాలైన కల్యాణ గుణాలు పలు వృత్తాంతాల ద్వారా

వ్యక్తమై ప్రకాశిస్తున్నాయి. వానిని అన్నిటిని ఇటువంటి మృదువైన అందమైన వాక్య సమూహాలతో అనుభవించడానికి ఆసక్తి మా మనస్సులో ఉన్నది.

**3)సీతాపతేః పరమయా కృపయాక్రమేణ**
**క్షిప్రం ఫలిష్యతి స ఏష మనోరథో నః।**
**పశ్చాచ్చ నందతనయస్య గుణాంబురాశౌ**
**గాఢావగాఢహృదయా విల్లిఖేమ భూరి॥**

సీతాపతి యొక్క గొప్ప కృపవల్ల, దీనికి పిమ్మట శ్రీకృష్ణుని గుణ సముద్రంలో లోతుగా అవగాహించిన హృదయం కలవారమై విస్తృతంగా లిఖించాలనే మా ఈ ఆశ త్వరగా ఫలిస్తుంది.

**శ్రీకాంచీ ప్రతివాది భయంకరమ్ అణ్ణంగరాచార్య స్వామి**
**విరచితమైన వాల్మీకి వాగమృతానికి అంధ్రీకరణం సంపూర్ణం**



**వాల్మీకి వాగమృత నామక సన్మరందం**
**హస్త్యద్రి నాథగురువర్యముఖాబ్జ జాతమ్ ।**
**తన్మాధురీ హృతమనో వ్యలిఖద్గిరాంధ్యా**
**సారజ్ఞసజ్జనముదే భువి శింగరార్యః॥**





ఇయం సీతా మమ సుతా సహధర్మచరీ తవ,

ప్రతీచ్ఛ చైనాం భద్రం తే పాణిం గృహ్ణీష్వ పాణినా.

(వాల్మీకి రామాయణమ్ - బాలకాండ - శ్రీసీతారామకళ్యాణ సర్గ)